శ్రీ గురుభ్యో నమః.

# అచలప్రబోధ.



ఇది

శ్రీమద్రామడుగు శ్రీశివరామదీక్షిత అచలగురుపరంపరా

బ్రహ్మశ్రీ మాధవరాజు వేంకటేశ్వరదాస

దేశికప్రభుస్వాములవారి ప్రియశిష్యుడు

గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా క్రోసూరు పోష్టు

పీసపాటిగ్రామనివాసుడు

## ఝాపూడి హనుమద్దాసు

విరచితము.

ప్రథమ ముద్రణము : 1,000 ప్రతులు

ఈగ్రంథమును నైజాం నల్లగొండనివాసభక్తవరులచందా

ద్రవ్యము చే

బెజవాడ : ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1935

 [వెల రు ౧-౮-౦

శ్రీ గురుభ్యో నమః.

అచలగురు డగు జూపూడి హనుమద్దాస్ దేశికప్రభువులవారి
ప్రియశిష్యులు నైజాం నల్లగొండ గ్రామనివాసు లగు
పోరుగంటి నరసమ్మ, పందిరి సోమయ్య, దడవాయి కనకయ్య
అను యీముప్వురు జూపూడి హనుద్దేశికులవారిచే
రచియింపబడిన

# అ చ ల ప్ర బో ధ

అను గ్రంథముకు పోషణకర్తలై యుండిరి. గాన వీరే గ్రంథ
మును తమయిష్టానుసారము ప్రింటువేయించుకొని
అమ్ముకొనుటకు ఉత్తరువు యివ్వనైనది.

(సంతకం) జూపూడి హనుమద్దాస్.

# అచలగురుపరంపరా.

౧. శ్రీధరస్వాములవారు.
౨. వీరిభ్రాతలు శ్రీమద్రామడుగు శ్రీశివరామదీక్షితులవారు.
౩. వీరి ప్రియశిష్యుడు కంబాలూరి అప్పారావుగారు.
౪. వీరి ప్రియశిష్యుడు పరశురామ సీతారామదాస దేశికులవారు.
౫. వీరి ప్రియశిష్యుడు భాగవతుల కృష్ణదేశిక ప్రభుస్వాములవారు.
౬. వీరి ప్రియశిష్యుడు ఖిల్లానాశంకరదేశిక ప్రభుస్వాములవారు.
౭. వీరి ప్రియశిష్యుడు మాధవరాజు వేంకటేశ్వరదాస దేశికప్రభుస్వాములవారు.
౮. వీరి ప్రియశిష్యుడు జూపూడి హనుమద్దాస్.

---

# కృతికర్తమనోభిప్రాయము.

అయ్యా! బుధశ్రేష్ఠభేదాభేదపరమహంసస్వరూపసుజ్ఞానులారా! నేను భేదసంబంధచిత్తచంచలమందప్రజ్ఞుడనైన నామనవి యించుక నాలకించగలందులకై అంజలిబద్ధుడనై మిమ్ముల ప్రార్థించి వేడుకొనుట యేమన—

ఉ॥ చూడగలేదు లక్షణపు • సూత్రము లెవ్వియు పంచకావ్యముల్
నాడుక యే నెరుంగ నతి•వాంఛతో శాస్త్రములందు దేని నే
నాడు స్మరించకన్ దృఢమ•నంబున నాదగు దేశికేంద్రునిన్
బాడగ నే దలంచి గణ • ప్రాసయతు ల్పదయర్థభావముల్
జూడక శ్రీహరిన్ మదిని • జొప్పడజేసి రచించు నాదు యీ
మూఢకవిత్వగ్రంథమును • మోద మెలర్పగ జూచి యిందులో
గూఢసుధామృతంబు నతి•కోర్కెతో గ్రోలియు మేటిదోషముల్
వీడి ప్రజాళి కెంత సువి•వేకులరై వినుపింప గోర్తు నే
ప్రౌఢకవీంద్రులన్ సుగుణ•పండితులన్ ఘన బ్రహ్మవేత్తలన్.

ఇట్లు సకలజనవిధేయుడు,
జూపూడి హనుమద్దాస్.

నాకు యిచ్చి వివాహముచేయించ, ఆయమ సంసారముకు వచ్చి షుమారు అయిదుఆరుసంవత్సరము లుండి ఆమె గతింప తదుపరి స్కూలు మానుకొని నాప్రభు వగు వేంకటేశ్వరదేశికస్వాములవారి దయవల్ల యించుక బోధజెంది యహోరాత్రిలు నామనంబున నా ప్రభు వగు నాదేశికులవారిని స్మరియించుచు కొరతదినములు గడుపుచు నాప్రభుస్వాములవారిని నాశక్తికొలది ధ్యానించుకొనుచు ఆ ధ్యానము పూరక వృధాగా జేయ సమంజసము గాదని కవితాలక్షణ యేమి యెరుగకపోయినను సద్గురుమూర్తిధ్యానముకు లోటుయుండదనే యుద్దేశ్యముతో నాదేశికస్వామిపేర దేశికశతకము, హనుమనపద్యములు, కృష్ణశతకము, అప్పుడప్పుడు ప్రార్థనమూలకముగా చెప్పుకొనిన కీర్తనలు, పెద్దలవల్లనే గ్రహించిన సంగతులు, యింకా పెద్దలు చెప్పిన కొన్నివిషయములు, పూహకు తోచినంతవరకు సాంఖ్యతారక అమనస్కబోధయు యివి అన్ని కలిపి నేను యీనీచదేహముతో యుండునంతవరకు నాప్రభు వగు వేంకటేశ్వరదేశికస్వాములవారిని దలచుకొనుచు పెద్దలవాక్యముల మరువక స్మరించుకొనుటకు యీ పొత్తమును వ్రాసుకొని సద్గురుచరణారవిందార్పణచేసియుంటిని గాన యిందలి సమస్తదోషముల హంసక్షీరన్యాయముగ జూచుకొని యీ నీచదేహధారి యగు హనుమద్దాసును మీకరుణాకటాక్షవీక్షణముచే వీక్షించుచు యుండగలందులకు మీవంటి అశరీరవర్తనులకు అనేకవేల వందనములు. యీహనుమద్దాసుజననము శ్రీవిజయనామసంవత్సర ఆశ్వీజ బ ౧౦ లకు సరియగు ఆన 1893 సంవత్సరం ది 3 మూడో నవంబరు.

# పండితాభిప్రాయములు

ఆర్యులారా! జీవబ్రహ్మైక్యసంధానులార! ఖేదమోదద్వయ సమానస్వభావులారా! యీకవి యిప్పటికి షుమారు ముప్పదినాలుగు వత్సరములప్రాయము గలవాడై పదిపదిహేను వర్షములవయస్సు నుంచియే సంసారాంబుధి నెట్లు దాటుదునో యని చింతాగ్నిచే మ్రగ్గుచు శ్రీహరిభజనానందామృతమున శాంతిల్లుచు శ్రీమదాద్రిమదుగు శ్రీశివరామదీక్షిత అచలగురుపరంపరా గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా వుయ్యందన తాళ్ళూరుగ్రామనివాసులగు బ్రహ్మశ్రీ మాధవరాజు వేంకటేశ్వరదాస దేశికప్రభువులవారి ప్రియశిష్యుడై శ్రీమత్కర్మదేవతా వరప్రసాదంబున సహజకవిత్వపాండిత్యంబు గలిగిన ఆర్వేలనియోగి బ్రాహ్మణుడును, ఆత్రేయసగోత్రోద్భవులగు జూపూడి ముత్తయ అడివెమాంబలకు జ్యేష్ఠపుత్రుడును, సత్సాధుబృందసేవాసక్తమానసుండును, దీనజనపోషణకుతూహలుండును, శాంతిశమదమగుణస్థయిర్య ధైర్యుండును, కేవలనిర్గుణపరిపూర్ణపరబ్రహ్మానందనిర్విచారుండై శ్రీ విశ్వమయుండగు గురుమూర్తి కరుణాకటాక్ష వీక్షణుండై యెన్నిదుఃఖుల తా నొందినను గురుమంత్రగురుధ్యానమును స్వప్నమందైనా యేమరక శ్రీహరియె గురు వను నిశ్చలత్వంబుచే హరి కర్పితముగా హనుమద్దాసుగారు రచియించిన

కం॥ శ్రీమద్దేశికశతకం
బీమహి పద్యాకృతిగ సృ♦జించి సమస్త
క్షేమంకరముగ తత్పద
సీమ సమర్పించె సాధు♦సిద్ధాంతముగన్.

ఉ॥ భాసుర మొప్ప నీకృతి స్వ♦భావగుణంబున లక్ష్యలక్షణ
శ్రీసహితంబునౌట గుణ♦శీలురు నిర్గుణశీలు రెల్లెడన్
వాసిజెలంగ మెచ్చెడి శు♦భప్రదసూచక మంచు నెంచి యే
దోసము లిందు లేవని య♦థోచితభక్తి నుతింప గల్గితిన్.

ఇట్లు బుధజనవిధేయుడు,

బత్తుల లక్షయ్య, సాకిన్ - దొడ్లేరు.

సీ॥ జూపుడివంశాబ్ధి ♦ సోము డాత్రేయస, గోత్రు డార్వేల ప♦విత్రకు
లుడు। ముత్తయకను శశి ♦ మోము హసించెడు, అడివెమాంబకు
గల్గి♦నట్టి సుతుల ♦ యం దగ్రజుడు మాధ♦వాన్వయుం డగు వేంక,
టప్రభు ఛాత్రుడు ♦ సుప్రసిద్ధు। డుర్వి పీస్వాడ్వంశ ♦ పర్వేందు
డెల్లయ, మేనయల్లుండు సు♦మేరుధీరు॥ గీ॥ డగు హనుమదాసు దేశికు
♦ననవరతము, బాడ గాంక్షించి జెప్పిన ♦ బద్యతతులు, గీర్తనలు
జనుల కెంతయు ♦ కేవలముగ, సాక్షిభూతుని గన్గొన ♦ సాదృశంబు,
గలిగి వర్తిలె నెంతయు ♦ గడుముదమున.

గీ॥ గాన నీకృతికర్తను ♦ గరుణతోడ। కమలమిత్రుడు తారలు ♦ కుము
దహితుడు। నెంతవర కుందురో ధాత్రి ♦ నంతదనుక। గాచి
రక్షించ శ్రీరమా♦కాంతు దలతు.

దమ్మాలపాడు,
ది 15—8—28.

ఇట్లు,
కృతికర్త జనకసోదరుడు,
ప్రత్తిపాటి ముక్తేశ్వరరావు.

---

సీ॥ ఆత్రేయగోత్ర ప♦విత్రమా జూపూడి, వంశమం దుద్భవం ♦ బంది
నావు। అడివెమాంబాముత్త ♦ యాభిధానుల కగ్ర, పుత్రుండవై
ఖ్యాతి ♦ బొందినావు। మాధవరాడ్వంశ ♦ మండన వేంకటేశ్వర
శిష్యమణి వనర్ ♦ బరగినావు। శాంతార్థసంపత్తి ♦ స్వాంతపేటిక
యందు, తగిన జాగ్రతతోడ ♦ దాచినావు। అఖిలదేశికసాంప్ర
దా♦యకులు మెచ్చ, మెన్నొగ్రంథంబులర్ లిఖి ♦ యించినావు,
సల్పితివి నేడు హనుమనా ♦ శతక మొకటి, సంతసము గొల్ప
నోమిత్ర ♦ సార్వభౌమ.

గీ॥ ఎద్ది కావలెనో దాని ♦ నేయిమిడ్చి, భావ మేమాత్రమైనను ♦ బోవ
నీక, భక్తులకు జ్ఞానులకు మహా♦సక్తిగొల్ప, వ్రాసితివి గాదె
యోమిత్ర ♦ వర్య నేడు.

గీ॥ ఎందరినో చూచినాడ నా♦నందమొదవ, బోధసల్పెడిప్రజ్ఞ నీ♦మూర్తి
యందె, గల దనుచు నిక్కముగ జెప్ప ♦ గలను దాని, నెంత
యనుచును నేను వ♦ర్ణింతు నయ్య.

పల్నాడుతాలూకా,
తక్కెళ్లపాడు,
ది 25—11—31.

ఇట్లు,
కన్నెకంటి ప్రభులింగాచార్యులు,
శతావధాని.

---

క॥ ఓసత్యభామహనుమ, ద్దాసశ్రేష్ఠా గుణాఢ్య ♦ ద్వయరాహిత్యా
నీసహచరుడను షట్చ, క్రాసన విను మనవి మల్లి♦కార్జున కవినీ.

క॥ హనుమన పేరట దేశిక, ఘనుపేరట కృష్ణపేర ♦ కడుమధురంబై
యనుపమశృంగారంబుల, కనువై రసవంత మగుచు ♦ నార్యమతంబై.

క॥ మీరు రచించిన శతకము, లారంభమునుండి సాంత♦మగువరకును నే
కోరి తిలకించినాఁడను, తారకసాంఖ్యామనస్క♦తాత్త్వికబోధన్ .

ఉ॥ సంతత మైహికంబు లగు ♦ సౌఖ్యము లిచ్చుచు నుండునట్టి నీ
కాంత దివంబుజేరిన చి♦కాకు మనంబున దూరసిక నే
కాంత సుఖంబు లందితివి ♦ కాంతల నిర్వురగూడి యాయశో
కాంతను ముక్తికాంత నెటు ♦ గాంచితివో పరమార్థకోరికన్ !

మ॥ జనులెల్లన్ కడుమూఢచిత్తులయి య♦జ్ఞానాంబుధిన్ మున్గిరో
హనుమంతా కడతేర్చి రమ్మనుచు ని ♦ న్నంపించ రామాజ్ఞ చే
కొని యేతెంచిన మారుతాత్మజు డనన్ ♦ కూపెట్టి భక్తాళిలో
సునితంబా పరమార్థమార్గ మగు నీ ♦ సుజ్ఞానమున్ దెల్పితే.

గుంటూరుజిల్లా,
పల్నాడుతాలూకా,
వేమవరం, 8—5—34.

ఇట్లు బుధజనవిధేయుడు,
కొండా రాజమల్లయాచార్యులు.

---

# భక్తజనుల చందా

| | | | | |
|---|---|---|---|---|
| రు | 10 | 0 | 0 | నందలూరి లింగమ్మ, జంగాలు, గుంటూరుజిల్లా, గుర్జాల తాలూకా, వేమవరం. |
| | 10 | 0 | 0 | పెన్నా నరసమ్మ, బ్రాహ్మణులు, నైజాము, నల్లగొండ. |
| | 3 | 0 | 0 | ఇతియాల మల్లమ్మ, వైశ్యులు, చేపూరు. |
| | 20 | 0 | 0 | ఓరుగంటి నరసమ్మ, వైశ్యులు, యీమె కుమాళ్ళు లింగయ్య, శంకరయ్య, నల్లగొండ. |
| | 5 | 0 | 0 | ఓరుగంటి కనకయ్య యీయన భార్య మంగమ్మ, నల్లగొండ. |
| | 20 | 0 | 0 | దడవాయి కనకయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 25 | 0 | 0 | పబ్బతు లింగమ్మ, వైశ్యులు, నల్లగొండ. |
| | 10 | 0 | 0 | లఖింశెట్టి కనకమ్మ, వైశ్యులు, నల్లగొండ. |
| | 3 | 0 | 0 | దడవాయి లచ్చమ్మ, వైశ్యులు, నల్లగొండ. |
| | 25 | 0 | 0 | ఓరుగంటి మల్లయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 10 | 0 | 0 | ఓరుగంటి పుల్లయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 10 | 0 | 0 | పందిరి సోమయ్య, భార్య మల్లమ్మ, వైశ్యులు, నల్లగొండ. |
| | 25 | 0 | 0 | కస్తూరి మల్లయ్య, పోతేదార్, తెలగాలు, నల్లగొండ. |
| | 10 | 0 | 0 | బూర్లగడ్డ వెంకటప్ప, వైశ్యులు, గుంటూరుజిల్లా, సత్తెనపల్లి తాలూకా, దమ్మాలపాడు. |

# చందాదార్లు

| | | | | |
|---|---|---|---|---|
| రు | 5 | 0 | 0 | బొందిలి నారాయణశింగ్, శేగేదార్, నల్లగొండ. |
| | 2 | 0 | 0 | కర్నాటి వెంకన్న, వైశ్యులు, నల్లగొండ. |
| | 10 | 0 | 0 | ఇలెందులజీడికంటి రామయ్య, వైశ్యులు, కటంకూరు. |
| | 1 | 0 | 0 | రాపోలు పూర్ణయ్య, సాలె, బోగారం. |
| | 5 | 0 | 0 | మందాళ్ళపు లింగయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 5 | 0 | 0 | పుప్పల కనకయ్య, వైశ్యులు, నల్లగొండ |
| | 5 | 0 | 0 | మంచుకొండ ముత్తయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 10 | 0 | 0 | సోమారపు ముత్తయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 5 | 0 | 0 | గుండా రామయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 5 | 0 | 0 | పందిరి అచ్చమ్మ, వైశ్యులు, నల్లగొండ. |
| | 5 | 0 | 0 | తడికెమళ్ళ పెద్దయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 10 | 0 | 0 | జయిని వెంకటాద్రి, వకీల్, వైశ్యులు, నల్లగొండ. |
| | 5 | 0 | 0 | కలకుంట్ల పుల్లయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 5 | 0 | 0 | కొండూరు నారాయణ, వైశ్యులు, నారాయణపురం. |
| | 25 | 0 | 0 | రాచూరి అనంతం, వైశ్యులు, నల్లగొండ. |
| | 1 | 0 | 0 | శివప్ప, లింగబల్జలు, నల్లగొండ. |
| | 5 | 0 | 0 | శేపాల రామయ్య, వైశ్యులు, మంగలపల్లి. |
| | 1 | 0 | 0 | వంగపల్లి రామయ్య, వైశ్యులు, నల్లగొండ. |
| | 2 | 0 | 0 | మంచుకొండ వెంకమ్మ, వైశ్యులు, నల్లగొండ. |
| | 5 | 0 | 0 | గడ్డం శంకర్రావు, బ్రాహ్మణులు, గొల్లగూడెం. |
| | 5 | 0 | 0 | గజ్జి వెంకటనరసయ్య, వైశ్యులు, మంగనపల్లి. |
| | 5 | 0 | 0 | తోట మల్లయ్య, వైశ్యులు; చందూరు. |
| | 1 | 0 | 0 | గుడిపాటి రామలింగయ్య, వైశ్యులు, కటంకూరు. |

1 0 0 గుడిపాటి గోపాలకృష్ణయ్య, వైశ్యులు, కటంకూరు.
2 0 0 ఆపుకూరి లక్ష్మీనరసయ్య, నల్లగొండ.
2 0 0 గట్టు వెంకయ్య, వైశ్యులు, నల్లగొండ.
5 0 0 రామరాజు లక్ష్మీనరసమ్మ, బ్రాహ్మణులు, గుంటూరు.
3 0 0 తుర్లపాటి లక్ష్మమ్మ, బ్రాహ్మణులు, గుంటూరుజిల్లా,
సత్తెనపల్లితాలూకా, వుయ్యందనతాళ్లూరు.
10 0 0 జూపూడి హనుమద్దాసు, గ్రంథకర్త.
1 0 0 తాడిశెట్టి అచ్చన్న, వైశ్యులు, చందూరు.
10 0 0 మంచుకొండ కనకమ్మ, నల్లగొండ.
10 0 0 మంచుకొండ రామయ్య, నల్లగొండ.

రు 358 0 0 లు.

ఈ ద్రవ్యముచే యీగ్రంథము అచ్చొత్తించబడియె.

శ్రీ గురుభ్యో నమః.



# దేశికశతకము.

ఉ॥ శ్రీకరమొప్ప నీదుపద • సేవ యొనర్చెడివారిపాపముల్
మీకరవాలఖడ్గమున • మీదికి లేపియు మీటి ద్రుంచె న
ద్భీకరమూర్తివే యయిన • బీదలయందున నిల్చి ప్రేమయుఁ
బ్రాకట మొప్ప నిల్పు మని • ప్రార్థనసల్పితి నిన్ను దేశికా! 1

శా॥ శ్రీనారాయణవేంకమాంబికలకుఁ • చిత్తంబు రంజిల్ల నీ
నానాభక్తుల బ్రోవ నెంచి యిలలో • న న్నాదరం బొప్పగా
నానావిద్య లనేకసిద్ధులను వి • న్నాణంబుగా దాల్చి స
న్మానప్రాజ్ఞత నాదివిష్ణు వన న • న్మన్నింపవే దేశికా! 2

ఉ॥ మాధవరాజవంశమున • మాన్యులు మెచ్చగ నుద్భవించి స
మోద మెలర్ప జానికమ • నుఁ వరియించి ధరిత్రి యెంతో బల్
సాధు లటంచు దేవతలు • సన్నుతిజేయ పురోహితాదు లే
భేదములేదు వీరి కన • బ్రీతి వివాహమునాడి దేశికా! 3

ఉ॥ ఈయలివేలితో నెవరు • నీస్థలియందున సాటిలే రనే
న్యాయముతో వచింప విని • నాయమ గాంచి బహుప్రజల్ సదా
పాయ్యని ప్రేమతో జగతి • భక్తుల బ్రోవగ యన్నపూర్ణ యీ
మాయగ నుద్భవించె నని • మాన్యత గొల్తురుగాదె దేశికా! 4

ఉ॥ మీ కల పుత్రవర్గమును • మేదినియందున నెంద రుండిరో
మీ కెరుకౌనుగాని మరి • మేమె యెరుంగగ నెంతవారమో

మీకరుణాసముద్రమును ◆ మిక్కిలిపొర్లగజేయు నాపయిన్
ప్రాకటమూర్తి తేజమును ◆ బాగుగజూపుము నాకు దేశికా! 5

ఉ॥ తీగెకు కాయలెన్నయిన ◆ తేలికయే యగుచుండునట్లుగన్
బాగుగ మీకు గల్గు నిజ◆భక్తులలోపల నే నొకండ నన్
వేగమె బ్రోవకున్న తను◆విభ్రమ మల్పము కాల మెంత నే
నాగగ ధాత్రి నేలుము మ◆హాత్ములు మెచ్చగ నేడు దేశికా! 6

ఉ॥ మూఢుడ నంచు నన్ను నతి◆మోదముతోడను బ్రోవకున్న నా
వాడు మెవండు వేరొకని ◆ ప్రార్థనసల్పితొ లేక నిన్ను నే
పీడ దలంచినాడనొకో ◆ వేగిరపాటున యానతిమ్ము నీ
గూఢమహాత్మ్య మెంచగల ◆ కోవిదు డెవ్వడు నేడు దేశికా! 7

ఉ॥ మోదముతోడ కొన్ని యతి◆మూఢతనమ్మున కొన్ని కర్మముల్
పాదుగజేసియున్ దుదకు ◆ పాపవిపానలమందు మ్రగ్గి తీ
ఖేద మిదేల నంటి కడు◆వేడ్క పదాబ్జము వీడనంటి న
న్నాదరణం బొనర్చియు మ◆హోదయ నేలగరమ్ము దేశికా! 8

శా॥ శ్రీరాగేశ్వరుడై సుధీవరుడునై ◆ శ్రీవేంకటేశ్వర్లునై
భారం బెంచక బూని భక్తులను తా ◆ పాలించలేకున్న నా
ధారం బెవ్వరు లేక తాల్మిజెడి యం◆ధత్వంబునుం జెందరో
నారాధించెదగాన ని న్ననిశమున్ ◆ న న్నేలు మో దేశికా! 9

ఉ॥ నేను మరేమి గోర నిక ◆ నీరజగర్భునికన్న మిక్కిలౌ
మానసమొప్పుధీవర సు◆మాన్యుడ వేంకటనామదేశికా!
బానకమంచు నే నధిక ◆ బాల్యతనమ్మున నుండి నీమహా
ధ్యానసమనేటి యామధుసు◆ధారస మే ననిశమ్ము గ్రోలు నన్
గానను జేర్తువో యనుచు◆గల్గెను భీతియు నేడు దేశికా! 10

ఉ॥ మోదమెలర్ప సాంఖ్య మది ◆ ముఖ్యమటంచును నాకు జెప్ప యీ
మేదిని పంచభూతములె ◆ మేటిగ నిల్చి సృజింపజేసె నీ
వేదనబాపి యంచు కొన◆వేడ్కతో నైదు నొకొక్కదానిలో

పాదుగనిల్చి పెంపయి ప్రపంచమునా యను పంచవింశతిన్
వాద మికేల గ న్మనుచు ♦ బాగుగదెల్పితి వయ్య దేశికా ! 11

శా॥ సారాచారవిచారధీర విను నీ ♦ సామర్థ్య మే గన్గొనన్
నేర న్నేర్చినగాని దెల్పగల యా ♦ నేర్పెట్లొ దెల్పంగ నా
భారం బబ్జభవాదులావిషయమున్ ♦ భావింపగా గల్గిరే
ధీరా భక్తుల నెట్లు గాచెదవొ బు♦ద్ధి న్నిల్పి శ్రీదేశికా ! 12

ఉ॥ నీపదభక్తిసంయుతుడు ♦ నిశ్చలతత్వము జెందు ధాత్రిలో
నీపదభక్తిచే త్రిపుటి ♦ నిర్మలచిత్తముతో జయించడా
నీపదదాస్య మెల్లపుడు ♦ నీతిగ జేసిన మూటి ద్రుంచడా
నీపదసేవ నేమరక ♦ నీతితొ జేసెద బ్రోవు దేశికా ! 13

ఉ॥ నీపదధారణ న్విడక ♦ నేర్పుగ జేయ భవాబ్ధి దాటడే
నీపరభావమున్ గనిన ♦ నీతివిదుం డెటు జెందు నాపదన్
నీపదయుగ్మమున్ గొలువ ♦ నేశ్రమజెందక నిన్ను జేరడే
నీపదసార మేమరక ♦ నిత్యము గోరెద గావు దేశికా ! 14

ఉ॥ పాతకవార్ధిలోన బహు♦బాధల జెందుచు మున్గి దేలు నా
వ్రాతఫలం బిదేమనుచు ♦ వాంఛలుదీర్పగ వేడు దెవ్వరిన్
భూతదయాసముద్ర వర♦పూరుష మద్గురు వేంకటార్య నిన్
దాతయు తల్లిదండ్రియును ♦ దైవమటంచును నమ్మి తిత్తరిన్
ప్రీతితొ బ్రోవవేడుచును ♦ పేర్మితొ నిచ్చెడు నాదు మ్రొక్కులున్
నీతరివేగ గొన్మి నను ♦ నేరుగ నెంచక బ్రోవు దేశికా ! 15

శా॥ పారావారములెల్ల బొంగి ధరపై ♦ బడ్డన్ గిరుల్ వ్రాల్లినన్
తారల్ డుల్లిన భూనభోంతరములున్ ♦ తబ్బిబ్బుచే నుర్రింగినన్
శూరాగ్రేసరు డాజిబారినను నిన్ ♦ శోధింపకన్ వీడ నిం
కే రా ధాత్రినితాల్మినైన గన రా♦వే బ్రోవ రా దేశికా ! 16

ఉ॥ అంగభయంబు ద్రుంచ మది ♦ హాయిగ నుంచ దరంబుగాక మీ
చెంగట నేను నిల్చి తమ♦చిత్త మెలర్ప నిరంతరంబు భా

వాంగక స్థాన మాత్మ యన ♦ భాసిలు సేవలు నాల్గు సల్ప ను
ప్పొంగుచు మూడుదీక్షలును ♦ మూడుప్రసాదములన్ నొసంగి ని
స్సంగుని జేసి నన్ను దయ ♦ సాకిన మద్గురువర్య దేశికా! 17

ఉ॥ మాటలు వేయునేల విను ♦ మాధవ నీదు పదద్వయం బనే
మాటున జేరి దాగితిని ♦ మామకదుష్కృతరూపసైన్యమే
మేటిగ వెంటనంటియును ♦ మీద నెదుర్కొనవచ్చె జూడుమా
నాటియెగాదు లక్షలును ♦ నూర్లును మించెను ద్రుంచు దేశికా!

ఉ॥ ద్రుంచినవెంటనే తమ మృదుత్వపు నిర్మల పాదపద్మయు
గ్మాంచితభక్తిరజ్జువున ♦ నాత్మను చిక్కులుబెట్టి మానసం
బించుకయైన ప్రాకృతి ని♦జేచ్ఛ నటింపగనీక యెంతయున్
గొంచక పాణిపాదముల ♦ గూరిచి కట్టినచాలు దేశికా! 19

ఉ॥ చాలును చాలు నాకు మరి ♦ చాలును కీర్త్యపకీర్తులెల్ల బల్
మేలును కీడుగూర్చుటకు ♦ మేటిగ నిల్చి యనేకకర్మలన్
వాలుగ జేయుచుంటి నిది ♦ వాస్తవ మంచని తెల్పుచుంటి నన్
గాలును బేలుజేయకను ♦ గాచి సుకీర్తిని జెందు దేశికా! 20

శా॥ మూలాధారము నీవె నాకు విను నీ♦మూర్తిన్ మదిన్ నిల్పితిన్
చాలాకాలమునుంచి యీయెరుక నన్ ♦ చంపించి పుట్టించుటల్
వాలాయంబని దెల్పుకుంటి నిదుగో ♦ వాక్ప్రౌఢత న్నూపి దీ
న్నేలాగైన వధించు సూత్రమును ను♦ర్విన్ దెల్పు శ్రీ దేశికా! 21

ఉ॥ సారము దెల్యకన్ జనులు ♦ సాధులమాడ్కిని బల్కుచుండగా
నేరము లెంచకన్ యితర♦నీతులు జెప్పక వారితోడ బల్
కూరిమితో మెలంగుచును ♦ కోరి నుతించుచు నిన్ను వేడ నా
భారము తీరిపోవు నని♦బాగుగ బల్కితి నయ్య దేశికా! 22

ఉ॥ ముఖ్య మటంచు నాకు మరి♦ముందుగ సాంఖ్యము తారకంబు లన్
వాక్యములన్ చెవిన్ జొనిపి ♦ వాస్తవమైనపదార్థమెల్ల నీ

సౌఖ్యము తెల్సుకో మ్మనుచు ♦ సాధన దెల్పుచు జూపునట్టి నీ
యైక్యమునందె కామనను ♦ నంటి నశించగజేయు దేశికా! 23

ఉ॥ పొందుగ ద్వాదశిం దెలిపి ♦ పూర్తిగ దాని పదార్థమెల్ల యే
సందును లేక నిండె నని ♦ సాదృశసాజ్ఞగ దెల్పి దెల్పకి
సంధి యెరుంగలే రనుచు ♦ చక్కగ పెద్దలు చెప్పుచొప్పునన్
ముందుగ నీవు నే ననెడి ♦ మోహము దీసితివయ్య దేశికా! 24

ఉ॥ నమ్మితి సద్గురేంద్ర మది ♦ నమ్మితి భక్తకులేంద్ర నేర్పుగా
నమ్మితి పర్వ సాంద్ర విడ ♦ నంటిని దాసచకోరచంద్ర నా
నమ్మక మేమి జేతు వొకొ ♦ నమ్మను నర్హతలేనివారలన్
నమ్మను నిన్ను దప్ప నిక ♦ నమ్మను నెవ్వరి నెప్డు దేశికా! 25

ఉ॥ స్నేహముజేయుచున్ నితర ♦ చిక్కులుబెట్టదలంచునట్టి యీ
సాహసకృత్యచర్యలను ♦ సల్పెడినీచులబట్టి కాలుచున్
దేహము కండకండలుగ ♦ దీటుగ చీల్చుచు కాల్చుచున్ మరిన్
యూహను త్రోచలేద యిక ♦ నుండు మటంచును నుక్కగాల్చి యీ
దాహము తీర్చుతీర్చు మని ♦ దండిగ తన్నుచు పోయు దేశికా!

ఉ॥ చెప్పను సిగ్గుజెందు బహు ♦ చెడ్డస్థలంబున జన్మమెత్తి నే
నిప్పుడమిన్ జరించుచును ♦ నేయెడ దానికె నాశజెంది యీ
తిప్పలుజెందుచుంటి నను ♦ తీరని ప్రేమతో జూచుచున్ మహా
గొప్పగ నన్ను నేలగల ♦ కోవిదవంద్యుడ వంటి దేశికా! 27

ఉ॥ నీచపుజన్మ మందగనె ♦ నే నపు డెంతటి నిల్వ యుంటినో
దోచగలేదు తెల్యగల ♦ దృష్టి యెరుంగక ఖేదవార్ధిలో
నీచక మంది మూత్రమల ♦ నీచున ముగ్గుచు దేలుచున్ మహా
వాచకమే ♦ పగుల్ పగిలి ♦ వాచెడిరీతిని యేడ్చియేడ్చి నిన్
యాచనజేయ నిల్చితిని ♦ యార్తుడ నన్ గరుణించు దేశికా! 28

ఉ॥ జానెడులేని యీతనువు ♦ జాస్తిగనుండెను మూడుమూళ్లపై
జానెడు గానుపించుటకు ♦ జాణ యెవండు యిదెట్లు పెర్గెనో

మానసమందు తెల్యగల ♦ మార్గము దోచదు నాకు నేడు నీ
జ్ఞానతనంబు దెల్యదగు ♦ శాస్త్రము నాకు నొసంగు దేశికా! 29

ఉ॥ ఈధర మానవా ళెపుడు ♦ యింపుగ దేవునియందు భక్తిచే
మోదముజెందియుఁ దుదకు ♦ మోక్షపదంబును జేరిరంచు నే
సాధనజేయబూనినను ♦ సాదృశశత్రులు పోరినట్లు యీ
మేదిని శూరు లార్గు రొక ♦ మిత్తిగ బట్టెరి దుఃఖించు దేశికా! 30

ఉ॥ నీచుడ పాపుడఁ జెడుడ ♦ నీతియెరుంగని మూఢచిత్తుడఁ
దోచదు నాకు నేడు తమ ♦ తోరపుపల్కులు పల్కు ఘోరణుల్
నీచపువాక్యముల్ గలిగె ♦ నే నెటు సల్పుదు నీదు వర్ణనల్
దాచిన దాగబోవుగద ♦ ధర్మసుకార్యము లెందు దేశికా! 31

ఉ॥ కాసుఖరీదు లేని యర♦కాసుకు పోల్పనుసాటిరాని యీ
నీసడిదేహముఁ విడువ ♦ నెంతయు మూర్ఖత జెంది యుంటి నీ
దాసుడ నంటి బ్రోవగల ♦ దాతవు నీవని నమ్మికుంటి నా
గాసిబోలంగు సాధనము ♦ గానగ లేవ యిదేమి దేశికా! 32

ఉ॥ పామరుడై జడుండయిన ♦ పాపహితాత్ముడై యైనగాని నీ
నామము ధ్యాన మే సలిపి ♦ నాణెముదప్పక నిల్చియున్న యే
బాముల నంటనీయకను ♦ బాధ్యతజూపియు బ్రోతువంచనే.
సామితె దెల్సి వేడితిని ♦ చయ్యన నేలగ రమ్ము దేశికా! 33

ఉ॥ మూలములేని యీతనువు ♦ మోహవశంబున సంభవించి యీ
కీలును దెల్యకఁ తుదకు ♦ కీడును జెందుచు గూలుచుండుటల్
వాలుగదెల్సియుండె నిక ♦ వాద మి కెందుకు దీని దుఃఖించియుఁ
పాలన నన్ను జేయు మని ♦ పట్టితి పాదము వీడ దేశికా! 34

ఉ॥ మేలుక యేమిలేకయును ♦ మించి సుషుప్తిలో వచ్చి దాను యే
మూలములేక నిల్చి కడు♦మోదముతో విహారించునట్లుగఁ
చాలుగ నీటిలోన తను ♦ ఛాయ నెరుంగని యంధురీతిగఁ
పాలనజేయుచుఁ నెరుక ♦ ప్రాపుబయల్ గనకుండ దేశికా! 35

ఉ॥ కర్మముచేత జన్మమును ♦ గల్గిన దంచును మేటిశాస్త్రముల్
నిర్మలవాక్యముల్ బలుక ♦ నీతిగ నే నెటు నమ్మకుందు యీ
కర్మము జన్మలేక యెటు ♦ కర్మ మొనర్చెనో నాకు నేడు యీ
మర్మము దెల్పి బ్రోవుమని ♦ మానక గొల్తును దెల్పు దేశికా! 36

ఉ॥ దేశిక! గాంచుచుంటి నిక ♦ దిట్టముగా జగమెల్ల నేను యీ
పాశము లేమొ యీజగము ♦ పట్టుగ లే దనుచుండ వింటి నా
గాశి యిదేమొగాని యిటు♦గన్పడుచున్న జగంబు లే దనన్
వాశిగ యేమికారణమొ ♦ వాంఛతొ దెల్పుము నాకు దేశికా! 37

ఉ॥ యేమిర ఛాత్రి నీమదిలో ♦ యేర్పడి నిల్చిన శంక దీర్చెదన్
నీవు మెలర్ప నిల్చి విని ♦ నీకును జూపెడి సాక్షి దెల్పుకో
కోమలమానసుండవయి ♦ కోరిక లేకయె నిద్రబోవగా
హేమము వచ్చినట్టు కల♦యేర్పడియుండియు జూడలే దనే
సామితె పోల్చు మీజగ మ♦సత్యము జుమ్మని యన్న దేశికా! 38

ఉ॥ మానుగ నీకు నన్ భవము ♦ మానక మిక్కిలి యున్నదన్న నీ
కన్నులపండురీతిగను ♦ కాంతయు స్వప్నములోన వచ్చియున్
మన్ననజేసియున్ తనకు ♦ మక్కువదీరిచి మాని నప్పుడే
వన్నెగ గాంచలేదనెడి ♦ భావము జూపితివయ్య దేశికా! 39

ఉ॥ గాఢసుషుప్తిలో నెటుల ♦ గల్గునొ లోకములెల్ల దెల్పరా
మూఢుడ నామరూపములు ♦ మోదముతోడుత దెల్పుకుంటివా
వాడకజెప్పు నీ కపుడు ♦ ప్రాహాలు గల్గిన గల్గకుండునా
పాడను యూడ లే వనుచు ♦ పాడుచు దెల్పగ వింటి దేశికా! 40

ఉ॥ నీవు సృజింపగల్గినవి ♦ నిత్యచరాచరజంతుజాలముల్
నీవును పెంచ నిల్చినవి ♦ నిత్యము వృద్ధిగ జీవసంఘముల్
నీవె లయింపబూనినను ♦ నిల్వగ బోవు సమస్తవస్తువుల్
గావున మూటి నెప్పటికి ♦ గానిది నాకు నొసంగు దేశికా! 41

ఉ॥ నీవె సమస్తమున్ గలయ ♦ నిండిన నెక్కడ సందు లేక నీ
లావుగనున్న గర్భమున ♦ లంపటజెందక త్రిక్షోణులన్

గావను నిల్పుకొంటివో కో ♦ గారడిజేయను దల్చియుంటివో
నేవిధమైన నల్పుమిక ♦ నే నను వాక్యము లేదు దేశికా! 42

ఉ॥ నేత్రియుగమ్ము పృథ్వికిని ♦ నీటుగ నిల్పుచునుంచగానె బల్
చిత్రవిచిత్రమై జగము ♦ చీకటి జెందగ నంతలోపలన్
పాత్రితగాని వాక్యముల ♦ పల్కు లనేకములై ఘటింపుచున్
మిత్రిత జెందకన్ నిలువ ♦ మించను స్పర్శయు గల్గువాని ధీ
ధాత్రియు నేమిలేని దని ♦ దల్చుచునుంటిని బాగ దేశికా! 43

శా॥ ఆశాపాశము నంతులేక పెరిగెన్ ♦ నార్యా నివర్తింపవా
యీశా దోస మనేటి చీకటిలో నన్ ♦ నింపారగా నుంతువా
పాశాబంధములెల్ల గోసి దయతో ♦ పాలించియున్ బ్రోవవా
దేశాంతంబున కేగెద న్నిదిగో నీ♦దిక్కున్ గనన్ దేశికా! 44

ఉ॥ కోరికె గల్గి కామమున ♦ కోమలి మోహములోన జిక్కియున్
దీరనిలోభక్రోధమున ♦ తెల్వియు మారుట సంభవించియున్
బోర నుపక్రమించితిని ♦ పూర్తి మదంబున మత్సరంబుచే
మీరి చరించుచుంటి నిది ♦ మీఱటి నన్ గరుణించు దేశికా! 45

ఉ॥ కాలమె మారిపోయె నని ♦ కాలముగాకనె చెప్పి మానవుల్
వాలుగ దిర్గుచుండి రిది ♦ వాస్తవ మంచని దెల్పుకుంటి యీ
మూలము బాగదెల్సుకొన ♦ మోహమనేటి స్వకర్మచేతలే
మేలుగ దిర్గుచుండె నని ♦ మిక్కిలి నమ్మికయుంటి దేశికా! 46

ఉ॥ వేసటజెంద కెల్లపుడు ♦ వేడుకగా తవనామధ్యానమున్
దోసములెల్ల దుంచు నని ♦ తొల్లిటితత్త్వదభక్తులందరున్
దోసిలి యొగ్గి నిన్నెపుడు ♦ స్తోత్రముజేయుచునుండువారి కే
దాసుల దాసదాసుడను ♦ దండనజేయక బ్రోవు దేశికా! 47

ఉ॥ తోలును మాంసయస్థులతో ♦ తొమ్మిదిద్వారము లున్న కొంపలో
మేలును జెంద నుంచితివ ♦ మిక్కిలి తెల్సినవాడవై తివే
చాలును దీనిపొందు నిక ♦ చాలును నాకును యిట్టిస్నేహమున్
వాలుగ నిల్వదంచు ముని♦వర్యులు దెల్పిరి వింటి దేశికా! 48

ఉ॥ నూరనో గాక మిక్కిలిగ ♦ నున్న జలంబులమధ్యనో మహా
ఘోరపరాక్రమార్యులగు ♦ గుంభిని శూరుల మాటుదెబ్బనో
మ్రారి చెరించు సింహగజ♦మిక్కిలి దుష్టమృగాలచేతనో
మారకమౌను కాయ మని ♦ మాన్యులు దెల్పిరి బ్రోవు దేశికా!

ఉ॥ పోవును యెట్టికాయములు ♦ పూర్తిగ ప్రేమను బెట్టిపెంచినన్
గోవులబట్టి మ్లేచ్ఛులును ♦ గొంతులుగోసినరీతిగాను యీ
జీవులబట్టి హింసలను ♦ జేయదలంచినయట్టి కాలుడే
గావ నటంచు జెప్పచును ♦ కత్తియు బూనుక వచ్చి దేహమున్
బోవను సాధ నే సలుప ♦ పూజ్యమె నిల్వదు తన్వు దేశికా! 50

ఉ॥ గావున నట్టికాలమున ♦ గల్గునో గల్గదో నీకు నిప్పుడే
సేవలు జేయుదున్ తమకు ♦ చిత్తము రంజిలగాను నిల్వుమో
దేవర నీవుదప్ప యిక♦దేవు డెవండును లే డటంచు యీ
భావమె నమ్మి నిల్చితిని ♦ పాపములన్నియు ద్రుంచు దేశికా! 51

ఉ॥ మేటిగ నిక్కుచున్ దనువు ♦ మేదిని వృద్ధిగ నుండునంచు బల్
పాటున బల్కుటల్ వినిన ♦ పక్కన నవ్వును గల్లు టబ్రమే
యేటికో యింతపట్టుదల ♦ యేకము వింశతివేల సంఖ్యకున్
దాటియు నారునూరులును ♦ తప్పక నిత్యము తగ్గుహంసల
న్నోటిగ జెల్లుకుంటి యిది♦సూత్రమి కెక్కుడివృద్ధి దేశికా! 52

ఉ॥ జంత్రపుబొమ్మ రీతిగను ♦ ఝాములో నాటలునాడి మానవా
ళ్యంత్రము దొల్గ సామికి వి♦డంబము లేమి విధంబుగాను బల్
మంత్రియు లేని రాజువలె ♦ మాంద్యముగల్గియు నాదు జీవముల్
తంత్రముమాని యేగునని ♦ తథ్యము నమ్మితినయ్య దేశికా! 53

శా॥ భూమ్యాకాశము లేకమైనపిదపన్ ♦ భూతంబులున్ లేక యున్
స్వామీ యెప్పుడు నిర్వికల్పమగుచున్ ♦ స్వాదృశ్యమున్ దెల్యకన్
నామాకారవికారమూకితలపున్ ♦ నం దుండకన్ లీనమై
యేమీలేక నిరామయంబు నగుచున్ ♦ యందుండు శ్రీదేశికా! 54

ఉ॥ తామరపాకుపై నబడు ♦ తజ్జలబిందువులెల్ల ముత్యముల్
నామముతోటి నిల్చినను ♦ నాశముజేయగ నిల్చియుండదు నా
కామముగల్గి కాంతలును ♦ కానుక లివ్వను బూనినట్లనే
యేమియురావు చేతికిని ♦ యిట్లస్థిరత్ నిల్వదు తన్వు దేశికా! 55

ఉ॥ అంద మెలర్ప యోగములు ♦ నాగక యెన్నియెదిజేసి మేలునున్
జెందుదు నంచు మిక్కిలిగ ♦ జెప్పుచునుండనవారి నెల్ల బూ
ముందుగ కష్టముల్ గలిగి ♦ మోహముచేసిన నష్టమాగదా
మందునిబోలి మానితిని ♦ మక్కువయోగములెల్ల దేశికా! 56

ఉ॥ మానితినంచు నన్ను నను♦మానముబూనకు మార్గదర్శకా
మేనును ప్రాణమానములు ♦ మిక్కిలియంచు దలంచి యుంచకే
బూనితి నీకు నర్పణము ♦ పూర్తిగజేయదలంచి యిచ్చితిన్
మానసమందు దుర్వ్యసన ♦ మంటక నీటి గ్రహించు దేశికా! 57

ఉ॥ ఇచ్చెదనంచు బల్కె నని ♦ యేమియు గోరదలంచియుంటినా
తుచ్ఛదశం వహించితిని ♦ తోచియు తోచనినాడన్న తినే
మెచ్చియు నిచ్చె హారములు ♦ మేదిని గల్గెను నీకు పూర్తి రా
నిచ్చెడి దాతలేడుగద ♦ నేరము నెంచకబ్రోవు దేశికా! 58

ఉ॥ ఖేచరి భూచరీ యనగ ♦ కేరుచు మధ్యమశాంభవీ యనన్
దోచెడి షణ్ముఖీ యనుచు ♦ దోచియు జేసితి సాధనంబులన్
యోచనలెల్ల బాసె నని ♦ యుబ్బుచు బల్కుచు నుండగాన బూ
సూచన జూపి యీతనువు ♦ చోద్యముగా నెటుబోనో దేశికా! 59

ఉ॥ పాటుగ పంచముద్రలను ♦ పద్ధతి వీడక చేసి చూచినన్
చేటును గల్గుగాని యిది ♦ శ్రేష్ఠమటంచు వచింపగ్గరి యీ
కూటమి దొల్గుపిమ్మటను ♦ కోటిసహస్రశశాంకదీప్తి కే
మేటిగ వెల్గె వెల్గు గన ♦ మిక్కిలి దేనిచె గాంచు దేశికా! 60

ఉ॥ పూనుచు తీర్థయాత్రలను ♦ బోయిన నేమి ఫలంబు నొందునో
మానసమందు యోచనయు ♦ మంచిగ జేసిన మాన్యులే గదా
కానరు నంతరంగమున ♦ కల్మషమేమియు లేక సర్వమున్

దాసయి నిండి వెల్గుచును ♦ దప్పక నాత్మలకెల్ల నాత్మయై
బూని చరించు స్వామి గని ♦ పూర్తిగ గొల్చుచు నుంటి దేశికా !

ఉ॥ షాపలు మూసియైన నిక ♦ పాపలు నిచ్చియునైన తేజముఁ
జూపెడి సాధనల్ దెలియ ♦ జ్యోతిని బ్రహ్మ మటం చెరుంగ ద
ద్రూప మదృశ్య మంచనియు ♦ రూఢిగ బల్కఁగ నార్యవాక్యముల్
జ్ఞాపక మేమిలేక కడు ♦ జ్ఞానవిహీనుడనైతి దేశికా ! 62

ఉ॥ నాదను బిందుపుఁ కళయు ♦ నాదములోపల నాదమే వినఁ
మోదము జెంది మిక్కిలిగ ♦ మోక్షము గల్గిన దంచు బల్కెఁ దు
ర్వాదులనాదముల్ వినగ ♦ వాంఛలు మానున వెర్రిగాక యీ
నాదమహత్త్యమే యెరుక ♦ నాటక మంచు దలంతు దేశికా ! 63

ఉ॥ యేమియు లేకనే యెరుక ♦ యింతగ నెచ్చటనుండి వచ్చెనో
సామియెరుంగుగాని యిది ♦ సాధ్యముగాదుర దీనిచర్యలఁ
వేమరు వేలసంఖ్యలుగ ♦ వింతలుజూపుచు నంతలోపలఁ
కామములెల్ల బాసి యతి♦కల్లగ బోవు ని కెట్లొ దేశికా ! 64

ఉ॥ నేరుగ రూపు నేకమయి ♦ నిల్చిన యంతట నేమి సౌఖ్యమో
నీరును పాలు నేర్పరచె ♦ నీతియెరుంగనియట్టి కొంగలుఁ
బారును తీరి కూర్చొనియు ♦ బాగుగ నేగెడిహంస గాంచి యో
ధీరుడ రార రార యని ♦ ధీరమనమ్మున బిల్చి దేశికా ! 65

శా॥ నీ కేనామము గూర్చి బిల్తురది వి♦న్పింపందగుఁ నా కనఁ
నాకుఁ నామము హంస యంచిడి ర♦నంగా మెచ్చి యాపత్ములుఁ
మాకుఁ మీకు నభేదమే యనుచు బల్ ♦ మర్యాదలఁ జూపియుఁ
నాకంబే సరిరాదటంచు మదిలో♦నఁ మెచ్చిరా దేశికా ! 66

శా॥ యేమీ హంస యెరుంగమైతిమిగదా ♦ యిన్నాళ్లకుఁ నేడు నీ
నామాకారములెల్ల గాంచి వినగా నా♦నందమే గల్గె మీ
భూ మెచ్చోట నివాస మెయ్యది కడుఁ♦పూజ్యుల్ గదా మీకు నై
నేమేమీ దినవార్కునో దెలు పనఁ ♦ ని ట్లేగమే దేశికా ! 67

ఉ॥ దేవునిసాక్షిగాను మది ♦ దిట్టముజేసియు మీకు దెల్పెదన్
పావనమైన మాస్థలము ♦ బాగుగ నేగెడి త్రోవలందు బల్
కావర మంచు నామమున ♦ గల్గియు నుండిన కాననంబునన్
త్రోవ లనేకముల్ గలుగ ♦ త్రొల్లటిదారి నెరింగి దేశికా! 68

ఉ॥ దారిన సూక్ష్మరూపమున ♦ దప్పక జ్ఞాతతో నేగుచుండగా
క్రూరిరస్వభావజన్యులను ♦ క్రోతు లనేకము లడ్డుపర్చు బల్
తారును మారు జెందియును ♦ తల్లడమందక త్రోసి నేగ వా
మేరువబోలి యడ్డమగు ♦ మేటి నగంబులు యేడు దేశికా! 69

ఉ॥ బాటకు నడ్డదిడ్డమయి ♦ బాతిన స్తంభములట్లు కొండలున్
వాటముగాను యుండినను ♦ వాంఛతో మెల్లగ నెక్కి పైకి బల్
నీటుగ బోయి చూడగను ♦ నిర్జనదేశమె మాది యంచు బల్
పాటుగ జెప్పసాగెను శ♦బాస్సరసే యని మెచ్చ దేశికా! 70

ఉ॥ నాస్థలమందు గల్గునవి ♦ యన్నివిశేషములెల్ల దెల్పెదన్
మాస్థలభోగవైఖరులు ♦ మాన్యులు జెందిన మేలుజెందనౌ
వాస్తవవజ్రమౌక్తికప్ర♦వాళమహాఖిలరత్నసంచయం
బేస్థలమందు బుట్టునో న♦దే స్థలమౌ నని దెల్పె దేశికా! 71

ఉ॥ షోడశకాంతులున్ గలుగు ♦ సోము నెదర్చగగల్గు వెల్గులో
పీడని శబ్దభేదములు ♦ వేడుకగా ధ్వనిసల్పుచుండగా
కూడికె జేయు నెంచుకొన ♦ కోరికెగల్గినవారికెల్ల బల్
గూఢప్రవాహముల్ తగులు ♦ కుంభిని మూడని జెల్పె దేశికా!

ఉ॥ నీటుగ మాయలేక నతి♦నిర్మలచిత్త మనేటి యోడపై
పాటుగ నెక్కి దాటవలె ♦ పంతములెల్లను మాని వేగమే
బూటకమేమిలేరు యెటు♦బోయిన గల్గును మేటిదుఃఖమ్మౌ
బాటలె యంచు దెల్పుచును ♦ బాగుగ జెప్పగ సాగె దేశికా! 73

ఉ॥ ఈవిధి బోవ గన్పడెడి ♦ యింపగు యేడుసు చుట్టుకోటలున్
దోవలు మూడు నందుగల ♦ దూతల నిద్దరి మీటిపోవ నిన్

గావ మటంచు జెప్పి ఘన ♦ కావలులుండినయట్టి శూరులున్
పావకురీతి పై బడెడు ♦ పాపులు నల్గురు నిల్చె దేశికా! 74

ఉ॥ పాపులతోను తాను మరి ♦ పాపము లేదని యెంచి ఘోరసం
వ్యాపకమైన శూలమున ♦ నార్యులు మెచ్చగ ద్రుంచి వెళ్లగా
యీపటిమేమొగాని యిటు ♦ యేమని దెల్పుదు నైదుగాక నే
రూపములేక తార్కొనిరి ♦ రూఢిగ ముగ్గురు యన్న దేశికా! 75

ఉ॥ తాకినయంతమాత్రమున ♦ తల్లడ మందక వానితోడ బల్
ఢీకొని త్రోసివేసియు క♦డిందిమగంటిమిజూపి పూర్వమా
వాకిలి గాంచి పోయినను ♦ వన్నెలు చిన్నెలు లేనిచోటునన్
ప్రాకటమొంద నిల్చి తను ♦ ప్రాపునుజేయుచునుండి దేశికా! 76

ఉ॥ పాశము భక్ష్యభోజ్యమును ♦ బాగని మెక్కుము మేము చాల బల్
వాసిగ వెల్గు వజ్రమణి ♦ వాలుగ నుండిన మంచిముత్యముల్
శ్రీశుని మేటి సత్కృపను ♦ యిలపుగ నిల్చిన పుష్యరాగముల్
గాసిదొలంగ భక్షణము ♦ గల్గును మా కని యన్న దేశికా! 77

ఉ॥ వేసట జెందుచున్ మిగుల ♦ వింతలువింతలుగాను జెప్పగా
దోసము గాదుగాని యిది ♦ దూరప్రదేశము యెంచి చూడగా
భాసురమైన వాగులును ♦ బాగుగ చెర్వులు తోటబావులున్
వాస్థలమందు లేవుగద ♦ మే మటు నిల్వ మటంచు దేశికా! 78

ఉ॥ వేడిమిగాడ్పులున్ గలుగు ♦ వేసవి కాలమునైన యెర్ర లే
నాడును యెండ్రకాయులును ♦ నాణ్యముజెందిన నత్తగుల్లలున్
వేడుకజెంద దొర్కు నవి♦వేసులమై యివిలేనితావునన్
గాడును బట్టి రా మనుచు ♦ ఘట్టిగ హాస్యమొనర్చె దేశికా! 79

ఉ॥ కావున మాయచే గలుగు ♦ ఘట్టిగ యింద్రియసంఘమెల్లనున్
లావును మెత్తు లేకమయి ♦ గాకలుపోకలు తేడయుండకన్
కోవెలరీతి పల్కులును ♦ కూరిమి రూపము జాతియొక్కటై
భావములో స్వభావమును ♦ బాగ నెరుంగనివారు సూక్ష్మపుం
దేవుని గాంచు వారలతో ♦ దీటును పోల్పగరాదు దేశికా! 80

ఉ॥ నూరులమించి తారసిలు ♦ నూతనవైరులమాటచేతనే
బారగటోలవచ్చు బహు♦భంగుల వెల్లువయెత్తిపారు యా
యేరుల దాటవచ్చు నిక ♦ నెన్నతిరంబునుగాని యగ్నినిన్
దూరగవచ్చు మిక్కిలిగ ♦ దుష్టులజేరుల కీడు దేశికా! 81

ఉ॥ ఘోరవిషమ్ముచే తిరుగు ♦ కుంభిని సర్వము లెన్నియైననున్
చారగ దీసి జంక కిల ♦ చయ్యన జంకను బెట్టవచ్చు బల్
క్రూరభయంకరంబు లగు ♦ ఘోరమృగమ్ముల బట్టవచ్చు యా
మేరువ నెత్తు శ్రీహరికి ♦ మెప్పగు సేవలు జేయవచ్చు యే
సారము శూన్యమయిన సం♦సారము యీదగ రాదు దేశికా! 82

ఉ॥ సాగరమెల్ల హస్తమున ♦ చక్కగ నిల్పగవచ్చు వేగమే
భోగములెల్ల మించుటకు ♦ పూర్తిగ బేరముజేయవచ్చు యే
జాగును జేయకన్ త్వరగ ♦ క్షాత్రమనమ్మున నెన్నొ రూపముల్
బాగుగ దాల్పవచ్చు హరి ♦ బట్టుక దండనజేయు హింస తా
నాగగ వచ్చు ధారుణి భ♦వాంబుధి దాటగలేరు దేశికా! 83

ఉ॥ పాములు కంఠమందుగల ♦ పార్వతినాథుని ఫాలనేత్రయు
ద్ధామమహాగ్నికీలల ము♦దంబున మ్రింగగవచ్చు దప్పిచే
సీమహి నెండమావులలో ♦ నింపగు నీరము త్రావవచ్చు యీ
భామల మోహవార్ధి బడ ♦ బాగుగ ముంచు నటంటి దేశికా! 84

ఉ॥ వేడియు వేడి వేసరితి ♦ వేడ్కతో బ్రోవవు నాదుకర్మమో
మూఢమనమ్ము దాల్చి యుటు ♦ మోసముజేయగ నీస్వభావమో
గూఢ మదేల దెల్పు మిట ♦ కుంభిని దాతలు వేరె లేరె నిన్
రూఢిగ దూలనాడితిని ♦ రోషముగల్గిన బ్రోవు దేశికా! 85

ఉ॥ జాతియు నీతి గోత్రమును ♦ జాస్తిగ రూపము నాకు మేక్రియన్
నీతిగ లేనివాడ వని ♦ నీతియెరుంగక యెన్నొనర్థముల్
ఖ్యాతిగ ధ్యానమున్ సలిపి ♦ ఘట్టిగ సేవలు జేసియుండగా
యీతరి మధ్యకాలమున ♦ నేమియు బల్క వదేమి దేశికా! 86

ఉ॥ చేసినవత్సరంబులకు ♦ చేరెడు ధాన్యమెగాని లేక నీ
వాసిగ వెల్గ పాణికిని ♦ వచ్చినగుప్పెడునూక లేని నా
కీసమయంబునం దయిన ♦ కిచ్చుట నోచుకొనంగనైతి నో
యీశ నిజార్థరక్షణము ♦ లేగెనొ గంగను లేక నిల్చెనో
పాశహరుండవం చనెడి ♦ పాటు దొలంగును జూడు దేశికా! 87

ఉ॥ నేరమపల్కు బల్కుటకు ♦ నీమమ కన్నులగానరావు యే
భారము బూని దాగినను ♦ బాధ్యతగల్గినవాడగాన యా
దారిన వచ్చి నిన్ గలసి ♦ దప్పక నాదుహృదాలయంబులో
మారును మాటలేక నిను ♦ మక్కువతోడుత బట్టి నిల్పి న
న్నారసి సేదుకాంత తన ♦ నాథుని నిమ్మన నివ్వ దేశికా! 88

ఉ॥ నామహిమంబు నెంచకను ♦ నన్నిటు బట్టియు కట్టి నిల్పెగా
యీమహిలోన వీని నిక ♦ నేమని నుంచెద నంచు నాపయిన్
తామసరోషజ్వాలలను ♦ తక్షణమంపిన నొక్క నంటి నో
సామజపోష పాపహర ♦ సాధుహృదబ్జనివాస యీశ నా
పామరబుద్ధి దొల్గ బహుభంగుల దెల్పెద నేడు దేశికా! 89

ఉ॥ నీరజనాభ నాదృథము ♦ నీతిగ బల్కెద నాలకించు నీ
ధీరశరీరమున్ మిగుల ♦ దీపముబోలిన నేత్రయుగ్మముల్
భారములైన బాహువులు ♦ బాతిన స్తంభము బోలు పాదముల్
మీరినతేజమున్ గనిన ♦ మేనున భీతియు లేదు గాని సం
సారమహాదవాగ్ని గన ♦ చయ్యన భీతియు గల్గు దేశికా! 90

ఉ॥ యోపరమాత్మ యోవరద ♦ యోప్రతిపక్షవిపద్వినాశ బల్
కోప మదేల యంటి నని ♦ కుత్సితమానస ముంచకయ్య యీ
పాపభవాగ్నిజ్వాల నను ♦ బట్టియు కాల్చగ నాగలేక ని
న్నాపలుమాటలాడితిని ♦ నన్ను గృపం గనుమయ్య దేశికా! 91

ఉ॥ కోపముచేత పుత్రుడును ♦ కొట్టిన తిట్టిన గాని వెంటనే
దాపునుజేర సొజ్జలతో ♦ దప్పక వెంబడినంటి బట్టియున్
పాపమటంచు వానికిని ♦ బాగుగ శర్కర పాలు వెన్నయున్

మోపుగ నీయ మొక్కుచును ♦ ముచ్చట జెప్పగనింట తండ్రిదా.
నీపనిగాని పుత్రులను ♦ హింసయొనర్పగ జూడ దేశికా! 92

ఉ॥ బాలుడ మందబుద్ధిగల ♦ బాపుడ కష్టుడ జారచోరుడన్
మేలుసహింపలేని కడు ♦ మేదిని దుష్టుడ యెంతొ క్రూరుడన్
నాలును బిడ్డ లన్నలును ♦ నాప్తులు తమ్ములు అక్కచెల్లెలున్
చాలుగలేనివాడ నను ♦ సాకను భారము నీదె దేశికా! 93

శా॥ నిత్యానందమనేటి సాగరమునన్ ♦ నిర్ముక్తనిష్కర్మచే
సత్యానందముతోటి స్నానమును బల్ ♦ నాహ్లాదతంజేసి యా
దిత్యజ్ఞప్తికి ధారణార్ఘ్య మిడి ముక్తిన్ ♦ భూతిగా దాల్చి యా
సత్యంబొప్ప మనోవినిగ్రహ మడిన్ ♦ తథ్యంబుగా గట్టియున్
నిత్యధ్యానజపం బొనర్చి నిను వర్ణింతు న్నిదే దేశికా! 94

ఉ॥ ఆశదొలంగె దోసములు ♦ నాగక నేగె మదీయ మోహముల్
నాశన మందసాగె నిక ♦ నాటగ సందునులేక దుఃఖముల్
బాశియు వార్ధి కేగె నను ♦ బట్టియు త్రిప్పెడివార లిట్లు నన్
రోసితొలంగె మేదినిలొ ♦ రూఢిగ నెవ్వరు తోడులేక యా
దేశమునందు నీదరికి ♦ దీటుగ జేరితినయ్య దేశికా! 95

ఉ॥ ధారుణియందు మంత్రములు ♦ దప్పక సప్తమి కోటులుండియున్
కోరికమించజేయుచును ♦ కూపతటాకజలంబుమాడ్కి బల్
ధీరత జూపి ముంచుచును ♦ దిమ్మరిపాటున ద్రిప్పుచుండగా
మీరి చరించి చిత్తమును♦మిక్కిలి విభ్రమజెందు దేశికా! 96

ఉ॥ నిక్కము సర్వమంత్రములు ♦ నెమ్మది నమ్మ పురాణవేదముల్
మిక్కిలి యంచు నమ్మ నిక ♦ మేదినియందున యోగసాధనల్
చక్కనివంచు నమ్మ బహు♦సన్నుతజీవశివైక్యపద్ధతుల్
మక్కువతోటి నమ్మ నతి♦మాయగ నేగెడిదేహ మే
నెక్కడ నమ్మ నీదుమృదు ♦ వేర్పడియుండినపాదపద్మముల్
గ్రక్కున నమ్మినాడ నను♦గ్రమ్మిన భ్రాంతిని ద్రుంచు దేశికా! 97

ఉ॥ నమ్మితి మూడుదీక్షలును ♦ నమ్మితి మూడుప్రసాదతీర్థముల్
నమ్మితి మూడువాక్యములు ♦ నమ్మితి నందున గల్గు నర్థముల్
నమ్మితి నీవె నిక్కము స♦నాతనవేల్పువె నీ వటంచు నే
నమ్మితి జన్మమృత్యువులు ♦ నాడె నశించె మదీయభక్తికిన్
సమ్మతి నొంది యేలగల ♦ సాదృశవేల్పవు నీవె దేశికా! 98

ఉ॥ ఖేద మదేల గన్మనుచు ♦ కీలును దెల్పెదనంచు బల్కె యే
మోదము ఖేదమందని ♦ ప్రమోదముగాని స్వరూపులేని దై
బాధలజెందరాక నతి♦బాధ్యత బూనను పోక సర్వముల్
మేదిని నాకసంబునకు ♦ మిక్కిలి ప్రక్కలసందుగొందులన్
బోధను నిండి వెల్గె పరి♦పూర్ణ మిదే యన గంటి దేశికా! 99

॥ నీకరయుగ్మమున్ గలిపి ♦ నింపుగ దోయిలిబట్టి చూపుచున్
శ్రీకరమౌనటంచు నర♦చేత విశంతముజూపబూని నీ
భీకరదోసిలిన్ విడగ ♦ భేషుగజేసిన మధ్య వెల్గె డీ
నాకపతీమునీంద్రులును ♦ నారదరుద్రులు నేడు నెవ్వనిన్
జోకతో గాంచుచున్ భవము ♦ జూడరో నావిభు గంటి దేశికా!

నీమమెలర్ప నొంటరిగ ♦ నిశ్చలమానస ముంచి పాద్రిశన్
పాములబట్టువానివలె ♦ బాగుగ వృక్షలసంబు లేకయున్
మోమును నిల్పి జూడగను ♦ మోక్షము గల్గిన దంచు బల్కె నా
సామి తె లన్ని నమ్మకము ♦ సామిని జూపెద జూచియుండరా
యేమియులేనివాడ వని ♦ యెన్నితి నిప్పుడు వెన్కప్రక్కలన్
కామముతోడ గాంచి యిది ♦ గానకయుండు మటన్న దేశికా! 101

నీనాసందున యేమి నిల్చినదో దా♦నిన్ దెల్య తా లేనిదై
నానాస్థావరజంగమప్రకరముల్ ♦ నాయందె గన్పించుచున్
నానాదేశములెల్ల నేగుచు గలన్ ♦ గన్నట్టు దంతిక్రియన్
నన్ రాకను నేగుచుండు నిదుగో ♦ గాన్పించదో దేశికా! 102

సూర్యాగ్నులు భూమినీరములునున్ ♦ యీవాయు వాకాశమున్
శివాసులు నిందుద్రాదిగ ఋషుల్ ♦ కాకుత్థ్సుడున్ చంద్రుడున్

వాసింగాంచి వెలుంగు చుక్కలును ♦ శంభద్భీమదిక్పాలురన్
భాసిల్లేటివనంబు పర్వతములున్ ♦ బాగా నదుల్ సంద్రముల్
నీసాధారణచూపులే యనుచు దీ♦నిం దెల్పి తౌ దేశికా! 103

శా॥ యేకాలంబున నెల్లవేళలను యే ♦ యేబాధలన్ జెందకన్
రాకల్ పోక లెరుంగక న్నమితయా♦ర్భాటంబుగా నుండకన్
యేకాపట్యములేక నిష్కపటియై ♦ యింపొందుచున్ పొందకన్
నాకాశంబును భూమివాయుజలమున్ ♦ నాతేజమున్ నిండి తా
లేకన్ దోచినబయలునం దెరుక దా ♦ లేదాయెగా దేశికా! 104

ఉ॥ స్నేహితులున్ స్వబంధువులు ♦ శ్రేష్ఠతరాప్తులు పుత్రదార లా
యూహలొసంగు నార్యులును ♦ నుర్వి ధనాఢ్యులు బీదసాదలున్
స్నేహము మానుకొంచు తమ♦చిత్తములందున లేనిపోని ని
ష్ఠ్వాహగ నైర ముంచుకొని ♦ యూఢిగదొక్కరు గడ్డ ఘుష్టు యీ
సాహస మేమి దెల్పుదును ♦ సత్యము దుస్థితి గల్గ దేశికా! 105

ఉ॥ దీటునుజూచి గెల్వవలె ♦ ధీరపరాక్రమశాలు లిద్ధరన్
కూటికిలేక నిత్యమును ♦ కొంపలుబట్టుక నెంతొ తిర్గి యే
పూటకులేక పస్తులతొ ♦ పొద్దులదీసెడి బీదవాండ్ల తా
నూటిని గెల్వ యెంతఘన♦నోము ఘటించునొ చూడు దేశికా!

ఉ॥ ఏమన భిక్షుగాండ్రయి ♦ నింపుగ దాడియు జూపి కొట్టగా
నేమిఫలంబొ భూస్థలి స♦మృద్ధిగుణంబున నారుమాసముల్
సాముచు నేర్చియున్ తనను ♦ సయ్యనబోరెడివారు లే రనిన్
కామముతోటి పల్కుచును ♦ కాంక్షలుమానియు కండ్లులేని బల్
యీముసలమ్మ చిక్కెనని ♦ యెన్నుచు చంపినరీతి దేశికా! 107

ఉ॥ ఈవిధి నన్ను నేల నతి♦హింసయొనర్పగ నేను దీటునా
నావ్యథ నేమిదెల్పుదును ♦ నాయను దిక్కునులేక నొంటినై
నేవిధి డబ్బుధాన్యమును ♦ నింపగు సైన్యములేక నిత్యమున్
తావకదాస్యధ్యానమును ♦ తప్పకజేయుచు మేనుపోక నే
జీవశవమ్ము బోలితిని ♦ జేర్చుకొ నీకళయందు దేశికా! 108

ఉ॥ సూర్యశశాంకదీప్తిగల ♦ సూనృతవాక్పరిపాల దేవ నా
యారితి దుర్గించి నీకరుణ ♦ నాపక నాపయి జూపియుంచవే
నేరములున్న కొర్యమును ♦ నెమ్మది నుంచకుమయ్య దాసునిన్
భారము బూన బోవిదగు ♦ బంధుడ వీ వని యుంటి దేశికా!

ఉ॥ పాలను ముంచు లేక నను ♦ పాపభవాబ్ధిన ముంచు నన్నికన్
పాలనమాని నీరమున ♦ బాగుగ ముంచిన నీదె కీర్తి నీ
శాలకు జేరి నిల్చితిని ♦ సాధులపాలిటి కల్పవృక్షమా
యేల విచారమొందెదవు ♦ యేమియెరుంగనివాడ దేశికా! 110

ఉ॥ ఏపనిజేయ ద్వేషి యని ♦ యెన్నుచునుండెడిదేశమందునన్
నాపగ నేమి కారణము ♦ యార్తశరణ్యులులేనిచోటునన్
మోపుగ దుష్టవృత్తిగల ♦ మూర్ఖు లనేకులునుండి యెంతో నీ
వ్యాపకమెల్ల మాన్పెదరు ♦ వ్యాకులచిత్తుడనైన నన్ను నీ
రూపులో జేర్చవే జనన♦రోగముమాన్పవె నేడు దేశికా! 111

ఉ॥ ఎన్నివిధుల్ స్మరించినను ♦ యేలొకొ నీదయ సుంతయైన రా
కున్నది నాదుభాగ్యమెటు♦లుక్కఱజెందుచు నేగియుండెనో
మన్ననజేరెనో యెచట ♦ మండెనొ తెల్యక బీదనైతి యా
పన్నుడనైతి భర్తమొర ♦ బాగవిమర్శనజేయు దేశికా! 112

ఉ॥ నారదు డంబరీషుడును ♦ నాప్రహలాదపరాశరాదులున్
ధీర శుకుం గజేంద్రుడును ♦ దివ్యమునీంద్రులు నింక నెందరో
కోరి నినున్ నుతించగనె ♦ కోరికలేని వరంబులీగ యే
మేరువ తర్వివ్వి నీ కిడిరి ♦ మిక్కిలి దీనుడ గావు దేశికా! 113

ఉ॥ సారములేక మిక్కిలగు ♦ సాహసమున్ గలిగున్నమేటి సం
సారమనేటిపంకమున ♦ చక్కనిమార్గముగానలేక నే
మీ రిచరించబోవ నిక ♦ మిక్కిలి నాపదయుగ్మమందు లో
కూరుకపోయె గుంజగల ♦ గుంభనశక్తియులేదు నన్ను యే
తీరునలాగెదో దరికి ♦ తీరికజేసుకరమ్ము దేశికా! 114

ఉ॥ వారినిబుట్టి జంతువులు ♦ వారిని బాయకయుండునట్లు లా
తీరున నేను త్వత్క్షణనె ♦ తీరనివారిన నుద్భవించి నిం
జేరియు బాయకుంటి నిక ♦ జేరను నన్యుల నెంతబిల్చినన్
గోరి భజంతు నీయెరుక ♦ కూకటివేరును తీయు దేశికా! 115

శా॥ నేనీవంచును నీవు నే ననుచు తా♦నేయుండి లే కెక్కడన్
గానన్ రాకను నేగి వచ్చుచును యీ♦గారాబమా చేష్టలున్
తానున్ జేయుచు తన్ను తా తెలసెటీ ♦ తత్వంబు యోచింపకన్
నేనన్ చాడుచునుండు యీ యెరుక దీ♦నిన్ దున్చు మోదేశికా!

శా॥ ఆహా యేమి వచింపుదున్ యెరుక తా♦నై జేసె యీవిశ్వమా
యూహన్ మించగజేయుచున్ తనకు యే♦యోర్పేమియున్ లేక నే
మోహావేశముచేతనే తిరిగి బల్ ♦ మోసంబె తా నౌను యీ
స్నేహంబేమిటికయ్య నాకు యెరుకన్♦ జెండింపుమీ దేశికా! 117

శా॥ రాజీవేశ్వర పన్నగాశనవిహా♦రేందాదిమరుల్ బ్రిహ్మయున్
రాజాధీశులు మేటిదిక్పతులు తా♦రంగూడువా డన్నయున్
పూజల్ సల్పెడివిప్రులున్ భువనముల్ ♦ భూతాదులున్ జంతువుల్
రాజీవాక్షులు పక్షులున్ పురుషులున్ ♦ రాత్రించరుల్ ఖేచరుల్
తేజంబంతయు చూడచూడ నెరుకే ♦ త్రెంచంగదే దేశికా! 118

ఉ॥ త్మాతలమందునన్ నరుడు ♦ సాదములేకనె సోలి కూలగా
భూతలనాథు డార్యులగు ♦ భూసురవర్యులు చూచి కుత్తు మే
మీతరి దీర్తుమంచు బహు ♦ మేలగునన్నము పంచభక్ష్యముల్
యీతరిపెట్ట మెక్కగను ♦ యీగయు జేరగ క్రిక్క తాను బల్
రోతగ జూచునావతుగ♦రోశినయెరుకను తోసివేయు నే
యేతరినంటనంటనని ♦ యీవిధి బల్కతి త్రోయు దేశికా! 119

ఉ॥ వేడుకమాటలేమొ యని ♦ వేగిరపాటున రాకయుండినన్
బూడిదె గాలికేగువతు ♦ బోధను వాయువ వీచి లేపు యీ
గాఢతనుండె యీయెరుక ♦ గానగలేకన్ను జేయుమింతె నన్
పాడునుజేయు దీని నిటు ♦ పాదును ద్రెంచగదయ్య దేశికా! 120

ఉ॥ మోసముజేయు నీయెరుక ♦ ముచ్చటజెప్పుచు మించిపోవు మా
వేసటమాన్ప దం చనుచు ♦ వేగిరపాటున దెల్పుచున్న నీ
దాసులప్రార్థనల్ వినుచు ♦ తావకమానసమందె యుంచి యే
కాసుకుపోలన బ్రైరుక ♦ కాల్చుము నుండక పోవు దేశికా! 121

ఉ॥ పోయినవెంటనే తమకు ♦ పూర్తిగ సేవలు జేసి సత్కృపల్
బాయక నీదుధ్యానమును ♦ బాగుగ మానసమందు నిల్పి యే
మాయను నంటనీక నిను ♦ మక్కువతో కడు జేరిగొల్చు నీ
సాయముకన్న మిన్నయగు ♦ సాధనమేదియు గోర దేశికా! 122

ఉ॥ చూపుము నీదురూప మిటు ♦ చోద్యముగా గనుచుండు కోర్కెతో
దాపున జేరి వేడితిని ♦ తావకపాదములాన నాకు యే
వ్యాపితమైన కోరికెలు ♦ యెంచగలేక నశించిపోయె నీ
ప్రాపునయుంచవే యెరుక♦పాదును దుంచవె వేగ దేశికా! 123

ఉ॥ బంధవిమోచనాయ భవ♦బాధనివృత్తినిరంజనాయ స
ర్వేంద్రియదుష్టవృత్తి బహు♦రీతులదుంచెడి మేటికాయ ని
ర్వేదవిచారణాయ నిను ♦ రేబవలెల్ల నుతించుటాయ గ
ర్వాంధత దుంచివేయ తవ♦పావననామము బాయ దేశికా!

ఉ॥ పాములరీతి వెంటబడి ♦ పాశములంటిన భీతి గల్గగా నీ
మము బాతి దుంచగలనే♦ర్పును బూనగ ఖ్యాతి మిక్కిలౌ
కామముబెంచు నాతి కడు ♦ కారణభూతము జ్యోతి న మ్మనల్
బాములబెట్టుజాతి నిను ♦ నమ్మిన పోవుట నీతి దేశికా! 125

ఉ॥ ఏమనుజుండుగాని నతి♦నీమమెలర్పగ పూని నిన్ను నే
ర్యామునవేని ధ్యానమును ♦ జాస్తిగజేసినవాని పాపముల్
యేమియులేనివానివతు ♦ యింపుగ జేయను మాని యున్న యా
నీమము పోని లేక నను ♦ నేలవదేని యి కెట్లొ దేశికా! 126

ఉ॥ నీదగు భుక్తశేషమును ♦ నింపుగ నీపదతీర్థపానముల్
నీదగు శిష్యమండలియు ♦ నేర్పుతో మెక్కినభుక్తశేషముల్

భేదము వీడి గోరిలినను ♦ బేలయిపోదె యనాద్యవిద్యన
మ్మోదము జెంది నాకొసగ ♦ ముందుగ గోరిలితి నయ్య దేశికా !

ఉ॥ నీవను యింగలంబునకు ♦ నేనను కప్పురమంటజేసినన్
పావకురీతి వెల్గినటు ♦ పట్టుగ స్వప్నములో ఫలంబులన్
తావును జూచి జాగ్రితలో ♦ తాను గ్రిహింపగలేనిరీతిగా
నీవును నేను నేను మరి ♦ నీవును నెచ్చట లేము దేశికా ! 128

ఉ॥ శోకతో నేడు నీమెరుక ♦ చోద్యముగా సృజియించినట్టి బల్
భీకరమౌ జనంబనెడి ♦ భీషుగ నున్నవనంబులోపలన్
పాకటమౌ విమర్శనచె ♦ బాగ చరించియు పద్యపుష్పముల్
యేకశతంబు వింశతియు ♦ నేర్పడ సప్తమి పైన యొక్కటిన్
నీకు నఖండమాలగను నేర్పుతో గూర్చి గళంబునందునన్
పాకటభక్తి వేసితిని ♦ పాపకుడన్ గయికొమ్ము దేశికా ! 129

ఉ॥ నేటికి హూణవర్షములు ♦ నెన్నగ నొక్కసహస్రిమున్ పయిన్
మేటిగ నూర్లుతొమ్మిదికి ♦ మిక్కిలి నిల్చిన తారసంఖ్యయున్ 1927
నూటిజనేవరా నెలలో ♦ సొంపుగ వింశతి తేదినాటికిన్
కోటివరాలుకానుకగ ♦ కూర్మితో నిచ్చితి నీకు పద్యముల్
పాటిగ నుంచు సూర్యశశి ♦ భాసిలుచుండెడిదాక దేశికా ! 130

ఉ॥ మంగళ మయ్య రామదుగు ♦ మాన్యుడ శ్రీశివరామదేశికా
మంగళ మందు భాగవత ♦ మానక కృష్ణగురూపరంపరా
మంగళ ఖీలుఖానకుల ♦ మాన్యత జేసిన శంకరార్యకున్
మంగళ మందజేయుటకు ♦ మానసమందున నుద్భవించి శ్రీ
మంగళ మంది నే నొసగు ♦ మక్కువ మ్రొక్కులు జెందు దేశికా !

దేశికశతకము సంపూర్ణం.

ఏతత్సర్వంబును శ్రీసద్గురుచరణారవిందార్పణమస్తు.



# హనుమనపద్యములు.



# హనుమనపద్యములు.

క॥ శ్రీవర గురుచరణంబులు
సేవించుచు మనములోన ♦ శ్రేష్ఠతరంబౌ
భావాతీతుని గనుగొని
భావించరు యెరుకలేని ♦ పద్ధతి హనుమా! 1

క॥ వేచ్చింది చచ్చుజ్ఞానము
చచ్చేదే యెరుకగాదె ♦ చక్కఁగ వినుడీ
చచ్చేది చావకుండునె
యిచ్చక మని నమ్మరయ్య ♦ యిలలో హనుమా! 2

గీ॥ దేహ మస్థిర మనక ♦ మోహంబులెటు లోదలు
మోహ మారకున్న ♦ మోక్ష మెట్లు
మోక్షబంధ మంచు ♦ మొద లెరుగలేరయా
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ! 3

క॥ దేహము బంగారం బని
మోహం బను మెరుగుయిసుక ♦ ముఖ్యము రుద్ధఁ
దేహము గాంచన మగునా
మోహంబున గల్గు మాంస ♦ ముద్దర హనుమా! 4

గీ॥ అంగలింగసంధి ♦ యారయగాలేక
సంగరహిత మెటుల ♦ సల్పునయ్య

సంగ మెరుగకున్న ♦ సరసు లెల్లాదురో
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ! 5

క॥ సంగంబందున దోషము
భంగంబును జేయలేక ♦ ప్రాల్మాలెడి యా
దొంగగురు కేల దెలియును
సంగంబున గల్గు సుఖము ♦ చక్కగ హనుమా! 6

గీ॥ రెంటి లేపి నిలిపి ♦ రెంటి నంటగట్టి
రెంటిసందున బెట్టి ♦ రేపుమాపు
రెంటి నొదలలేక ♦ తుంటరు లైరయా
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ! 7

క॥ ముత్తైదు ముండ కుండే
వ్యత్యస్థము దెలియలేరు ♦ వేషమె గాదా
వ్యత్యస్థమె వేషం బని
యీస్థితి వివరించరోరి ♦ యిప్పుడె హనుమా! 8

గీ॥ మొదలు ముండగాదె ♦ ముఖ్యముగా జూడ
తుదకు నటులె యంచు ♦ తోచదయ్యె
ముండవేష మేయ ♦ ముత్తైదువం చనరు
యిలలో వెర్రినరులు ♦ యేమిహనుమా! 9

గీ॥ ముండ ముండే యంచు ♦ నుండజూచిన చాలు
ముండగాదె జూడ ♦ మోహతనువు
ముండవేష మేయ ♦ ముత్తైదువే యనిరి
యిలలో వెర్రినరులు ♦ యేమిహనుమ! 10

గీ॥ మోహవేషమునను ♦ ముత్తైదు వాయె తా
మోహ మూడిపోవ ♦ ముండయాయె
మోహవేష ముడిపి ♦ మొద లేదో జూడరు
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ! 11

గీ॥ ముండ తానె యంచు ♦ దండిగా నమ్మియు
ముండతోడగలది ♦ ముఖ్యముగను
ముండతోడి పొందు ♦ మోహంబు విడిజేయ
దండివాడు గాదె ♦ ధరను హనుమ! 12

క॥ ముండను చేపట్టక గను
చుండంగా నేది యెరుక ♦ ముండేగాదా
ముండయు ముత్తై దెట్లగొ
నిండుగ నిది నమ్మరయ్య ♦ నేరక హనుమా! 13

గీ॥ ముండమాట వినగ ♦ మోహంబు దీరునా
ముండజేయలేదె ♦ మోహజగము
మోహజగంబంత ♦ ముత్తైదువులె యనిరి
యిలలో నీదుమహిమ ♦ యేమి హనుమ! 14

గీ॥ ముండతోడిపొందు ♦ ముఖ్యంబుగా జేసి
ముండ జగమటంచు ♦ మొదలు దెలిసి
ముండ తానై యుండె ♦ మోక్షనరక మేదొ
తెల్పలేరు నరులు ♦ దేవ హనుమ! 15

గీ॥ వేషభాషలందు ♦ విరాగులైగాని
ద్వేషభావ మెపుడు ♦ దీయలేరు
ద్వేషభావ మున్న ♦ దేవు డెట్లానయ్య
యిలలో నీదుమహిమ ♦ యేమి హనుమ! 16

క॥ రతిజేసిన పాపం బని
మతి నిల్వగ లేనియట్టి ♦ మనుజు లనంగన్
రతి యేది జేయుచుండునొ
రతిమర్మం బెరిగి రతిని ♦ జేయరు హనుమా! 17

క॥ ముండను రమ్మని పిలువకు
ముండే యిట నిల్వ దాను ♦ మోహము పడకన్

ముండను గూడిన పురుషుని
నిండుగ యోచించి తెలియు ♦ నిక్కము హనుమా! 18

క॥ ముండనగ తనువె గాదా
ముండలో యున్నట్టివాడు ♦ ముఖ్యుడుగాడా
ముండకు ముఖ్యునిస్నేహము
యుండదుగద యెన్నటికిని ♦ నుర్విని హనుమా! 19

క॥ ముండే వచ్చును యుండును
ముండే పను లన్ని జేయు ♦ మోహముతోడన్
ముండే నిలువక బోవును
ముండకు మూలంబు లేదు ♦ ముఖ్యము హనుమా! 20

క॥ ముండను నమ్మకు మెప్పుడు
ముండను విడి యుండ నీకు ♦ మోసమువచ్చున్
ముండను విడకుండగనే
యుండే మరు గెరుక ముండ ♦ యుత్తది హనుమా! 21

గీ॥ యుత్తముండ యనుచు ♦ యొత్తిలి నగి తోలు
తిత్తిలోని మరుగు ♦ దెలిసి యంత
చిత్తమందు నిల్పి ♦ శివుని పూజించరు
యిలలో నీదుమహిమ ♦ యేమి హనుమ! 22

క॥ యుత్తదిగద యీదేహము
సత్తును చిత్తులను దెలిసి ♦ సంభ్రమమొప్పన్
బొత్తిగ తనువును రోసియు
యుత్తది జగ మన రి దేల ♦ యుర్విని హనుమా! 23

క॥ ముండైతె మేలుగాదా
యుండిన యుండకను బోవ ♦ వగపులు గలవా
పండిన యొక్కటె పండును
పండదో పదిమంది బోను ♦ పట్టుగ హనుమా! 24

గీ॥ ముండచేత గల్గె ♦ మూడులోకంబులు
ముండచేత నైరి ♦ మూర్తులంత
ముండలోని మాయ ♦ మూలంబు దెలియరు
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ! 25

క॥ ముట్టే మూలము తనువుకు
ముట్టుకు మూలంబు తనువు ♦ ముఖ్యము గనుడీ
ముట్టులుబోవుట జూడమె
ముట్టుతో సమ మనరు తనువు ♦ మూర్ఖులు హనుమా! 26

గీ॥ ముట్టుతనువు నమ్మ ♦ మోసంబె గల్గును
ముట్టబోరు దాని ♦ మోహముంచి
మోహ మున్న ముట్టు ♦ ముంచేసు టెరుగరు
యిలలో నీదు మహిమ ♦ యేమి హనుమ! 27

గీ॥ ముట్టులోకి బోయి ♦ ముట్టులో మునుకిడి
మునుకులోన బెరగి ♦ మోసపడుచు
మునుకుదీయ తనువు ♦ ముట్టటం చనరేల
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ! 28

గీ॥ ముట్టులోన వచ్చు ♦ ముద్ద ముఖ్య మటంచు
ముద్దబట్టిజనులు ♦ ముద్దుబెట్ట
ముద్ద ముట్టుగాదె ♦ ముద్దు ముట్టేగాదె
మూల మేమిలేదు ♦ జూడ హనుమ! 29

గీ॥ చిక్కు చీకటిలోన ♦ చక్కగా దీసియు
నిక్క మేదో జూడ ♦ నీవు లేవు
నీవులేనిజాడ ♦ నిక్కంబె యనరయా
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ! 30

క॥ చీకాకుదేహ మన దగు
చీకాకే నీవు నేను ♦ క్షితిలో జూడక్

చీ కనగ మాయమెరుకే
చీకును విడి జూడరయ్యా ♦ క్షితిలో హనుమా ! 31

గీ॥ బూతుపనులు జేయ ♦ బూతుకు లోబడి
బూతులోన బెరుగ ♦ పుణ్యు డెట్లు
బూతు విడిచి రాగ ♦ పూజ్యు డంచు దలంతు
యిలలో నీదు మహిమ ♦ యేమి హనుమ ! 32

గీ॥ బూతు కరుగువాడు ♦ బూ తటం చనబోరు
బూతువారిపనులు ♦ బూతుగావె
బూతువారిమాట ♦ బూ తని నమ్మరు
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ ! 33

క॥ బూతాయె లోకమంతయు
బూతును నొనరించకున్న ♦ బూ తుండ దయా
బూతుకు నంటని పూజ్యుని
బూతే యన నతడు నెటుల ♦ బూతో హనుమా ! 34

క॥ బూతనగ నేను గాదా
బూ తనగా మమత మేను ♦ బూతే గాదా
బూతుకు లోబడకుండియు
బూతును విడువకను దెల్య ♦ పూజ్యుడు హనుమా ! 35

క॥ బూతగును తల్లిదండ్రియు
బూతగు తాతయును వాని ♦ తాతయు తండ్రిల్
బూతే నీయవ్వయవ్వయు
బూతే దానవ్వతల్లి ♦ బూతే హనుమా ! 36

క॥ బూతు నీసుతులు నీవును
బూతే నీభార్య పుత్రి ♦ పుత్రికలెల్లన్
బూతే నీహితబంధులు
బూతే నీయన్నలంత ♦ బూతగు హనుమా ! 37

గీ॥ బూతులేని దేదొ ♦ బూతున బడ దేదొ
బూతు నంట దేదొ ♦ బూతుగాదు
బూతుగాని దాని ♦ బోధించె గురు గాన
రిలను వెర్రిసరులు ♦ యేమి హనుమ ! 38

క॥ బూతుగద బ్రహ్మ విష్ణుడు
బూతేగద శివుడు జూడ ♦ బూతేగాదా
బూతుగద సరులు మృగములు
బూతే యింద్రుడు మునులు ♦ బూతే హనుమా ! 39

గీ॥ బూతులేనిచోటు ♦ పూజ్యమై దనరారు
బూతుపూర్వమునుంచె ♦ పొసగవచ్చె
బూతునందు భ్రాంతి ♦ బ్రాత్రిగ విడలేరు
యిలలో వెర్రిసరులు ♦ యేమి హనుమ ! 40

గీ॥ బూతుతోడ వచ్చె ♦ భూతపంచకమెల్ల
బూతునందు నిల్చె ♦ పొసగ తెలివి
బూతులేనివాని ♦ పుడమిలో గనియెడి
నీతి యెరుగ రేమి ♦ యిలలో హనుమ ! 41

క॥ బూతే జ్ఞానేంద్రియములు
బూతే కర్మేంద్రియములు ♦ భూతము లై మనా
బూతే ప్రాణము లై మను
బూతే శబ్దాదు లై దు ♦ బూతే హనుమా ! 42

గీ॥ భూమిలోనయున్న ♦ భూతజాలములన్ని
బూతుతోడ బుట్టె ♦ పొందుగాను
బూతుజగము వీడి ♦ పుణ్యుని గనుచుండె
నీతి యిదియె నీకు ♦ నిజము హనుమ ! 43

గీ॥ బూతువానిజేసి ♦ భూతలంబున కంపి
బూతువానిచేత ♦ వ్రాతజేయ

బూతువానివారిత ♦ నీ తెటు జేసెదో
బూతె నీ తొనర్చ ♦ బోలు హనుమ! 44

గీ॥ వాన యుండుచోటు ♦ వానవచ్చెడిచోటు
వానబోయ్యెచోటు ♦ వార్త దెలిసి
వానలోన దిరుగు ♦ వైపు నెరుంగరు
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ! 45

గీ॥ ఆరురుచుల నెపుడు ♦ నణగద్రొక్కియు మరి
యారుగురిని బట్టి ♦ హతముజేసి
ఆరువికారముల్ ♦ యావల ద్రోసియు
ఆరు మీరి నిల్చు♦ మయ్య హనుమ! 46

గీ॥ కొండ లేదు నెక్కి ♦ నిండుమనంబుతో
గండిదూరి లోని ♦ ఘనుని గాంచి
కొండదిగనివాని ♦ కొనియాడుచుండరు
యిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ! 47

గీ॥ కొండపైననున్న ♦ కోర్కెలన్నియు మాను
కొండ నెక్కకున్న ♦ కోర్కె లుండు
కోర్కె లున్నవాడు ♦ కొండెటు లెక్కునో
యిలలో నీదుమహిమ ♦ యేమి హనుమ! 48

గీ॥ ఏడుకొండ లెక్కి ♦ యెరుకచే నుండియు
యేర్లు మూటి దాటి ♦ యెరుకలేక
యెరుకలేనివాడు ♦ యేలోకమున లేడు
యిలలో నీదుమహిమ ♦ యేమి హనుమ! 49

గీ॥ ఎరుకచేతనుండి ♦ యేడుకొండలగూల్చి
యెరుకమీరి లేని ♦ యెరుకచేత
యెరుకలేనివాని ♦ యేపార్ద్దుగలిసిన
ఘనుడ వీవె సుమ్మి ♦ గాంచ హనుమ! 50

క॥ ఎరుకే విశ్వంబంతయు
మెరుకే కులగోత్రములును ♦ మెరుకే కళలున్
మెరుకే భ్రాంతివిరక్తులు
మెరుకే సంకల్ప మంచు ♦ మెరుగుము హనుమా! 51

క॥ ఎ౹ కే విద్యావిద్యలు
మెరుకే మెన్నెన్నొరూపు ♦ లెరుకై యుండున్
మెరుకే తల్లియు దండ్రియు
మెరుకే సతిసోదరులును ♦ మెరుకే హనుమా! 52

క॥ ఎరుకే యన్నయు నప్పయు
మెరుకే బావలును సుతులు ♦ మెరుకే తమ్ముల్
మెరుకే నత్తయు చెల్లెలు
మెరుకే తలిదండ్రి మామ ♦ లెరుకే హనుమా! 53

క॥ ఎరుకే బెట్టును వరసలు
మెరుకే జేయించె పనులు ♦ మెరుకే మమతల్
మెరుకే నీవును నేనును
మెరుకయు విడిపోన వరస ♦ లేవిర హనుమా! 54

క॥ ఎరుకే పురుషులు స్త్రీలును
మెరుకే వనములును నదులు ♦ మెరుకే కొండల్
మెరుకే మృగజలచరములు
మెరుకే భయభ్రాంతులెల్ల ♦ మెరుకే హనుమా! 55

క॥ ఎరుకే నానాభాషలు
మెరుకే భూషణములెల్ల ♦ మెరుకే శ్రుతులున్
మెరుకే శాస్త్రపురాణము
లెరుకే వేదములు చదువు ♦ లెరుకే హనుమా! 56

క॥ మాసం బను పుష్పములో
మాధుర్యము గ్రోలలేరు ♦ మహాదోషు లిలన్

మహనీయులు గోరిలగనే
మడియించును యీషణత్రయంబులు హనుమా! 57

గీ॥ మైథునంబు జేయ ♦ మాయలో బడి స్త్రీలు
మైథునమున బెరిగి ♦ మరల తాను
మైథునమునె మ్రింగి ♦ మైథునము వెలిగొచ్చు
మైథునంబె సాక్షి ♦ మహిమగా హనుమ! 58

గీ॥ అష్టమహిమ లెరుక ♦ అష్టతనువులు యెరుక
నిష్ఠచేత గూడ ♦ నీవు యెరుక
స్పష్టమనుచు నమ్మి ♦ సృష్టిలోపల గల్గు
నష్టమదములెల్ల ♦ నణచు హనుమ! 59

గీ॥ ఏడుద్వీపము లెరుక ♦ యేడుసముద్రము లెరుక
యేడులోకము లెరుక ♦ యెల్ల నెరుక
యేడుమెట్లు యెరుక ♦ యేడు వ్యసనము లెరుక
యేడు యేడు గూర్పు ♦ యెరుక హనుమ! 60

క॥ పనికిరానట్టి తనువుకు
పనికొచ్చే పనులు యేవి ♦ పాటించ దరమా
పనికిరానట్టి తనువుతో
పనులన్నియు జేసి తనువు ♦ బాగుగ హనుమా! 61

క॥ పనికొచ్చేదానికి యే
పను లుండవు చూడగాద ♦ పట్టుకలేదనా
పలుకున్నది పనికొచ్చిన
పలుకును లేనట్టి దోటు ♦ బాగా హనుమా! 62

గీ॥ పండువెన్నెలలోన ♦ నిండుమనసులతోడ
నుండువాని జూచి ♦ యోర్పుగలిగి
యండ నుండు నటంచు ♦ యూహించి మించిన
నుండబోదు యెరుక ♦ యుర్వి హనుమ! 63

మ॥ పరద్రవ్యంబును పానకంబువతుగా ♦ బ్రాల్మాలకన్ గ్రోలకన్
పరకాంతన్ వరియించి కూడకను ♦ బంధస్వాస్థ్యముల్ గల్గు నా
పరభావంబులొ నిల్వజేయ మనసున్ ♦ పాపంబు బోనయ్య యా
పరమున్ జెందను బాట లీవె యనుచున్ ♦ భావించరా మారుతీ !

గీ॥ కీ లెరుంగనిచదువు ♦ చాలచదివిన నీకు
లాభ మేమి రాదు ♦ లాలితముగ
కీడురాకముందె ♦ కీలు శ్రీగురువల్ల
చాలదెలియ నీకు ♦ మేలు హనుమ ! 65

గీ॥ ఏడుకొండలపైని ♦ వేంకటేశునిగలయ
యెంతొ కష్టంబయ్య ♦ వెతలుగాక
వెతలుబడకయున్న ♦ యేడుకొండల నెక్క
యెవరివశము గాదు. ♦ యిలలొ హనుమ ! 66

క॥ వెతకొప్ప వేంకటేశుడు
హితు డయ్యో యుండునయ్య ♦ నేమో యనకన్
వెతకోర్చి వేంకటేశుని
సతతము గలిసుండ నీకు ♦ చాలుర హనుమా ! 67

గీ॥ వేంకటేశు డనగ ♦ వెలసి లోకములందు
యెంచి చూడ మాయ ♦ యేమిలేదు
యేమిలేనిలోక ♦ మెప్పుడు విడిజూడ
వేంకటేశ్వరుండ ♦ వీవె హనుమ ! 68

గీ॥ వేంకటేశు డుండు ♦ విధము నీ కెరిగింతు
నెతలు జెంద నేల ♦ వివిధములుగ
నెనుకముందుపక్క ♦ లను క్రింద పైజూడ
వేంకటేశు డుండు ♦ వేగ హనుమ ! 69

గీ॥ కొండబోలియుండిడి ♦ కోటిసూర్యులకాంతి
మించ వెలుగుచుండె ♦ మేలుగాను

నిండి యందు జాడ ♦ నిల్చి గురుండైన
వేంకటేశు గాంచు ♦ వేగ హనుమ! 70

గీ॥ వేంకటేశులోన ♦ యీ జగంబంతయు
వెలసియుండెగాని ♦ యెరుగడయ్యె
యెరుకలేని లోక ♦ మేహార్ద్ధు విడజేసి
వేంకటేశుగలయు ♦ వేగ హనుమ! 71

క॥ వేంకటరమణుడు దిక్కని
సంకటముల బాసియుండి ♦ సద్గురుకృపచే
పొంకమగు ద్వాదశిని యే
శంకలు లే వనుచు నమ్మ ♦ సామిని హనుమా! 72

గీ॥ ఆరుకొండ లిపుడె ♦ యద్భుతం బగు యుగుణ
ఆరుపైనికొండ ♦ యపుడె యొక్క
యెల్లలోకములను ♦ యెరిగించు యెరుకుండు
యెరుకలేనివేల్పు ♦ వీవె హనుమ! 73

గీ॥ రతి యొనర్చుచుండు ♦ రాత్రిపగ లేమరక
రతిలో తనువు మరచి ♦ రమ్యముగను
రతిని బాయ తనువు ♦ రా దని నమ్మను
రతిని భ్రాంతిలేని ♦ రాజు హనుమ! 74

గీ॥ రతిని గోప్యముగను ♦ రాపిడిజేసిన
రతిని పాప మనకు ♦ రాదు జన్మ
రతినిజేయకున్న ♦ రతిభ్రమబో దాత్మ
రతిని సల్ప మరల ♦ రారు హనుమ! 75

క॥ యేకాంతరతిలో సౌఖ్యము
యే మని వర్ణించి చెప్ప ♦ నే నశమానా
యేకాంత రతియె మేలగు
యేకాంతను గూడబోకు ♦ వెర్రిర హనుమా! 76

గీ॥ రతియొనర్చుటకును ♦ రాత్రియే మేలగు
పగటివేళ రతియు ♦ పాటుతప్పు
పగటివేళరతిలో ♦ పల్కు కాంతులు గల్గు
పల్కులేని రతియె ♦ బాగు హనుమ! 77

క॥ రతిజేయబోవువేళలొ
మతిమతిమారకను గలయ ♦ మాధుర్యంబా
మతిమతి గలసినరతియే
మతభేదము లేక మమత ♦ మానును హనుమా! 78

క॥ రతి యనగా స్నేహంబా
రతి యనగా దేహిదేహ ♦ రమ్యములొనా
రతిరమ్యము దేహము దీ
మితిలేకను మారునిల్వ♦బోదుర హనుమా! 79

క॥ రతి యనగ తనువె దెలియుము
రతికొప్పను తనువె స్త్రీయు ♦ రమ్యంబుగ దా
రతిజేయ పురుషు దేహియె
రతిలో మతి నిల్పకున్న ♦ రాజువె హనుమా! 80

గీ॥ రతికి మానసంబు ♦ రాజుగా దెలియుము
రతియె మేనుజూడ ♦ రా దటంచు
మేనుమనసు లున్న ♦ మిక్కిలి తిప్పలు
మేనులేనివాడె ♦ మేలు హనుమ! 81

గీ॥ తనువు మనసు లున్న ♦ తప్పక రతిజేయు
తనువుబాయ మనసు ♦ తరమె జేయ
మనసు మారిపోవ ♦ మాయమగా తను వనరు
యిలలొ నీదు మహిమ ♦ యేమి హనుమ! 82

గీ॥ ఆలునందు ప్రేమ ♦ నన్నదమ్ములప్రేమ
హితులయందు ప్రేమ ♦ సుతులప్రేమ

మతిలో నుంచకుండ ♦ మంటలో గల్పితే
వెతలు జెందబోకు ♦ వేగ హానుమ ! 83

గీ॥ అండలేని యూర ♦ నుండె దోషముగాను
నార్యు లనగ విందు ♦ సద్భ్యాతముగ
అండ నిల్వనితనువు ♦ నాసించబోకుము
యదియె నీతి నీకు ♦ నయ్య హానుమ ! 84

గీ॥ ఆగు మాలిసతనువు ♦ యనిశంబు నీచేత
యాటలాడజేయు ♦ నవనియందు
నాటలాడజేసి ♦ నాశమించగ యుండి
యాశదీరకముండె ♦ యణగు హానుమ ! 85

గీ॥ ఆశచేత బుట్టె ♦ యాశచే పెరిగియు
ఆశయుండె తాను ♦ ననిపో ముల్ల
యాశతోడి పనులు ♦ యోగికి చేయగ
ఆశ తనను ముంచు ♦ నయ్య హానుమ ! 86

క॥ ఆరాటమైన తనువును
యేరాటము బోక యుంచు ♦ [illegible]
ఆరాటము తనుబాసిన
నారాటంబెల్ల మాను ♦ నవనిలో హానుమా ! 87

క॥ ఆలోచనముల మానియు
నీలోచనములతో జూడ ♦ కిం పని [illegible]
నాలోచనముల చూడ్కియు
యాలోచనలెల్ల మాన్పు ♦ నౌరా హానుమా ! 88

గీ॥ అవనియందు బుట్టు ♦ నన్ని జీవులు జూడ
నశనపశనములకు ♦ నాశపడును
యశనశిశ్న భ్రాంతి ♦ యందరు పడుదురు
యశనశిశ్న పనులు ♦ యణచు హానుమ ! 89

గీ॥ అశనభ్రాంతి బాయ ♦ శిశ్నభ్రాంతియు మాను
శిశ్నయశనములను ♦ చెదరదీసి
శిశ్నయశనభ్రాంతి ♦ చెందనిగురు జేరి
శిశ్నయశనగుట్టు ♦ తెలియు హనుమ ! 90

గీ॥ అన్నితనువు లొకటై ♦ నన్నియోనులు నొకటై
యన్నిపుట్టుక లొకటై ♦ యవనియందు
నన్నిజీవు లణగు ♦ టననిలో యొక టన
రిలలో వెర్రినరులు ♦ యేమి హనుమ ! 91

గీ॥ అన్నియోనులందు ♦ నెన్నొసారులు బుట్టి
యన్నియోను లాశ ♦ యద్భుతముగ
యనిశ మేమరలేక ♦ నాత్మేశ్వరు నిగూడి
మరచి జగము మానుమయ్య హనుమ ! 92

గీ॥ అశనశిశ్నములకు ♦ నాటుమొందుచు
నిశలవేళలందు ♦ నిద్రలేక
వ్యసనపడుచు తాను ♦ పసులవిధంబున
మసలుచుండి తానె ♦ మడియు హనుమ ! 93

గీ॥ అశనశిశ్నములకు ♦ నంటియంటనిపనికి
వ్యసనపడరుగాని ♦ వెర్రినరులు
శిశ్నయశనములకు ♦ చేరి విద్యలు నేర్చి
చెడుదురయ్య జనులు ♦ క్షితిలో హనుమ ! 94

గీ॥ శిశ్నమునను భ్రాంతి ♦ శీఘ్రంబుగా మాని
యశనమునకు క్షుధయు ♦ నణగద్రొక్కి
వ్యసనపడక మిగుల ♦ యావలిపని బూని
నసిగజేయ తాను ♦ సరసు హనుమ ! 95

క॥ అశనంబుచేత పెరిగెను
శిశనంబును వృద్ధిగాను ♦ స్థిరముగ గనగా

యశనంబు నొదలివేసిన
శిశనంబుకు పసయులేదు ♦ తెలియుర హనుమా ! 96

క॥ అశనంబుచేత నుండెను
సచరాచరభూతకోటి ♦ చక్కగ గనుడీ
యశనంబు లేమియైనను
పసదొలగును జీవులకును ♦ పట్టుగ హనుమా ! 97

క॥ అశనము శిశ్నము పనులకు
వ్యసనంబును లేక నీవు ♦ వెర్రిన పడకర్
యశనము శిశ్నము గానిది
వ్యసనంబును లేనిపనిని ♦ బడయుము హనుమా ! 98

క॥ అశనం బన తనువే సుమి
శిశనం బన జీవు డనుచు ♦ జెప్పితి మరి యా
యశనములో జీవున కా
వ్యసనంబులు బాయ నేది ♦ యశనము హనుమా ! 99

గీ॥ అశనశిశ్నసంధి ♦ యనిశంబు గమనించు
శిశ్నగుణము లేవొ ♦ జెప్పు దిపుడు
శిశ్నగుణములెల్ల ♦ చెరుచు కించజ్ఞత్వ
గుణము లంచు తెలియు ♦ కోరి హనుమ ! 100

క॥ కించజ్ఞత్వగుణంబుల
వంచనలేకుండ వాటి ♦ వధయించినచో
మించును సర్వజ్ఞత్వము
సంచితములు లేని సర్వ♦సాక్షివె హనుమా ! 101

క॥ ఆవులు బర్రెలు మేకలు
నావులు గజములును మేటి ♦ మనుజులు మృగముల్
క్రివిగ పక్షులు చీమలు
గావే జన్మంబు లందు ♦ గను మిది హనుమా !

గీ॥ అన్ని యోనులందు ♦ నద్భుతంబుగ బుట్ట క
న్ని యోనులసంగ ♦ మంది తీవె
అన్ని యిన్ని యెన్నొ ♦ యెన్న శక్యముగాని
కళల జీవు డొకడె ♦ గనుమ హనుమ ! 103

క॥ జీవుడు దేవుండే యని
భావించుము యింతె నీకు ♦ పనియే లేదూ
జీవుడు జీవుండే యని
భావింతువొ పరము లేదు ♦ పాపమె హనుమా ! 104

క॥ జీవునిగుణముల దెలిసియు
జీవున కీగుణము లుండ ♦ జేయకు మెపుడున్
దేవునిగుణములయందున
జీవుని నైక్యం బొనర్ప ♦ శివుడౌ హనుమా ! 105

క॥ సతిపతి యెట్లునలె సతతము
హితమతితో నుందు రటుల ♦ యీసదోభేద
స్థితి జెందను గురుశిష్యులె
సతిప్రేమతొ నిల్వ బోధ నందును ♦ హనుమా ! 106

క॥ సతియందు ప్రేమ పతికిని
పతియందున ప్రేమ సతికి ♦ బహు గాన్పించున్
రతిలోన సౌఖ్య మబ్బదె
హితమతి గురుశిష్యభావ ♦ మిదెరా హనుమా ! 107

గీ॥ తనువులేనివారు ♦ తనువు గానవె వాని
తత్త్వ ణంబె గందు్రి ♦ ధాత్రిలోన
తనువుయున్న వాడు ♦ తనువు కందనివాని
తాను గాంచ గలడె ♦ ధరలొ హనుమ ! 108

గీ॥ ఎంతఘనులనైన ♦ నేడ్పించి ముంపగ
పంతగించి నిల్చు ♦ పాడుమాయ

గీ॥ గురుడు శ్రీరామభద్రుండు ♦ కోరి విను మ
తండు వసియించు స్థలము భద్రాద్రి గురుని
పాదపద్మంబు గౌతమీ ♦ బడయు జలము
గురు డొసంగిన ద్వాదశీ ♦ గోప్య మెప్పు
డాత్మ స్మరియింప తారకం ♦ బదెర హనుమ! 116

క॥ గురుడే తల్లియు దండ్రియు
గురుడే దైవంబు జూడ ♦ గురుడే పతియా
గురుడే బంధువు మిత్రుప
గురు డొక్కండె డొరులు లేరు ♦ గుర్తుగ హనుమా! 117

గీ॥ మాయలోన జొచ్చు ♦ మాయగాదా జూడ
మాయలోన మాయ ♦ మాయమాను
మాయమర్మమెల్ల ♦ మాయకు దెలిసిన
మాయ మాయ మాను ♦ మహిలో హనుమ! 118

క॥ రక్తం బన ముట్టేగద
రక్తంబే దేహ మయ్యె ♦ రమ్యం బేదో
రక్తంబు గారుచుండిన
రక్తంబును జూచి రట్టు ♦ సల్పరె హనుమా! 119

గీ॥ రక్తదేహ మీవె ♦ రక్తంబె లోకంబు
రక్తమందు ముట్టు ♦ రా దలంచె
రక్తరక్తములను ♦ రాపిడిజేసిన
రక్తముద్ద వీవు ♦ రమ్ము హనుమ! 120

గీ॥ రక్తముద్ద లగుచు ♦ రట్టేల జనులకు
రక్తగుట్టు దెలిసి ♦ రాత్రిపగలు
రక్తముట్టులందు ♦ రసికత్వ మింపారె
నార్యసమ్మతంబు ♦ నౌర హనుమ! 121

క॥ అయ్యో ముట్టుది తాకకు
మయ్యో యని యరచి కూత ♦ కూయుదు రౌరు లే

మయ్యో ముట్టులు గారే
కయ్యాకుమీ మాట లెప్పుడు ◆ కూర్మిని హనుమా ! 122

క॥ ఆముట్టుదాని గనుగొని
మే ముట్ట మటంచు బల్కి ◆ మూన్నాళ్లకు నా
ముట్టుపయి నీళ్లనిడి యా
ముట్టుతో పొందుజేయ ◆ నేమా హనుమా ! 123

క॥ ఆముట్టు రోత యనకుము
యాముట్టే నన్ను నిన్ను ◆ యవనీస్థలినిన్
నీముట్టు గల్గ జేసెను
నాముట్టులో నున్నమూర్తి ◆ నరయుము హనుమా ! 124

క॥ ముట్టులో మూర్తిని దెలియక
నిట్టేల యసహ్య మంద ◆ నీఘన మేమో
నట్టేల దెల్పు మిప్పుడె
ఘట్టిగ నాముందు బల్కు ◆ గారడి హనుమా ! 125

క॥ అవనీస్థలంత వెదకిన
నాడది మగజాతి గాక ◆ యన్యము గలదా
అహాహా ! కుల మెటు పెద్దదో
కుల మీతకు చెడె నటంచు ◆ కూయకు హనుమా ! 126

క॥ పూర్తిగ వినరా పుడమిలో
పుట్టినపురుషులును స్త్రీలు ◆ పొందుగ జూడన్
పూకులో బుట్టినవారల
కేకులమో యెంచి దెల్పు ◆ యేహ్యమె హనుమా ! 127

క॥ పూకులో కులమని దెలియక
మాకులమే బ్రాహ్మణులము ◆ మేమే మిగులా
మీదే చెడుకుల మందురు
మీమామర్మంబు గనుము ◆ మేలిమి హనుమా ! 128

ఈరెండు పద్యములకు అర్థము తెలియునంతవరకు, పరమేశ్వరుడు వ్రాయించునంతవరకు వ్రాయుచున్నాడ. (1) ఒకటవ యర్థము-'పూకులో కుల మని దెలియక' అను పదములకు పదార్థము:—పూ=పూర్తిగా, కు=కూడియున్న, లో=లోకమందు, కు=కుటిలస్వభావంబును, ల=లావైన, మ=మక్కువను, ని=నీవు, దె=దెంపుతో, లి=లీల లని, య=యూవత్తు, క=కాల్చివేయుము; (2) రెండవ యర్థము-పూ=పూర్వము, కు=కుండరూపమున, లో=లోపలనున్న, కు=కుచిత వేషుని, లా=లావణ్యమును, మ=మంచిబుద్ధితో, ని=నిష్ఠగా, దె=దెలుసుకోనక, లి=లీలలకే, య=యత్నించుట, క=కాదు; (3) మూడవ యర్థము-పూ=పూర్వమునుంచి, కూ=కూర్చియున్న, లో=లోపల వెలుపల, కు=కుండలో అనగా కుండకు లోపలవెలుపల నిండియున్న ఆకాశంబు కుండ కంటని యటుల, జిహ్వకు యాజ్యంబు జిడ్డుయంటని క్రివి, అద్దమందు రూపమంటనివతు, కాయలో నుండు విత్తుకు పైకాయ రూపుగా నున్న పొట్టు అనగా బొబ్బర లేక బెరడు అంటని విధంబున, ల=లాహిరిగా, మ=మకారమం దుత్పత్తియైన, ని=నీశ్వరుడు అనగా మకారస్వరూపుడౌ పరమేశ్వరుడు-యిందుకు లో అర్థము యే మనిన రూపనామక్రియావర్జితమౌ యాపరమేశ్వరుడు, మ=మాయగా రూప నామంబు లేర్పరచుట నిక్కముగాదుగాన పలుకు లేకుండుట విశేషము. ఇటుల దెలియబడక యుండుటయే జీవగుణ మని దెలియుము.

'పూకులో కుల మని దెలియక మాకులమే బ్రాహ్మణులము మేమే మిగుతా' అనుదానికి అర్థము—పసిపిల్లలు తల్లులతో ఒకపుష్పవృక్షమును చూచి, ఆపుష్పములు తమకు కావలయు నని వుద్దేశ్యము లోపలయుండి తమతల్లు లెత్తుకొనియుండ తమతల్లులకు ఆపుష్పముల నంక వానిచ్రేలు చూపుచు 'అమ్మా! పూకులే పూకులే' యని యడుగ వానియుద్దేశ్య మెరిగి తల్లులు పుష్పములను కోసియిడిన సంతోషించుచు ఆడుకొనుట యెల్లరికు విశదమయ్యే యున్నది. కాని పిల్లలు యేమని కాసించి యడిగె నని యెవ్వరును గమనించరు. కాన నే నజ్ఞానదశ

వలన నుడివినమాటలకు నారోత్తమోత్తమోత్తములు నాభావమును గమనించి నా కుపయోగ మగు అర్థమును వెల్లడించి విపులముగా దెలిపి తగు దృష్టాంతం బిచ్చి నిత్యసత్యనిర్మలనిరంజనమా యేవస్తువ యున్నదో నద్దాని దయారసహృదయులై చూప గల రని నాప్రార్థన.

ఇదిన్నీగాక ఆర్యఆరోత్తమోత్తములు యెవరైనా యేతప్పులు గలవాక్యముల నుడివినను నీళ్లూపాలూ గలిసిన చూచి హంస నీళ్ల నొదలి తనకు ముఖ్యము స్థాలిత్యరహితమగు పాలను గ్రోలుచందంబున యేక త్వసిద్ధిపొందిన మహనీయులు తప్పు లున్నను తప్పు లని యెల్లరు నుడువువాక్యములలో మంచి అర్థ మనే పాలను గ్రోలి వారిశోభాయు యితరులకు పోయుట విశేషము. ఇదిన్నీగాక లోకోక్తి 'బూతే నీతి నీతే బూ' తను వాక్యములను గమనించగలరు. దీని మంచిఅర్థమును గమనించక త ప్పనువారు తప్పుగాని, యీ యర్థము తప్పు గాదు. అయినను తప్పు అర్థమునే గమనించువారు తప్పువారేగాని, గొప్పవారు కారు. గొప్పవారు గానియెడల వా రనుమాటలకు వారివంటివారలే సంతోషించుదురుగాని మహనీయు లొప్పరు.

ఇంకొకఅర్థము—'పూకులో కుల మని' యనగా పుష్పములో కులము. అది యే మనిన పుష్పములో సూక్ష్మముగా నొక రంధ్ర మున్నది. అందులో కుల మని. అది యేమనిన ప్రతిపుష్పసూక్ష్మరం ధ్రమం దమృత మున్నసంగతి యెల్లరకు దెలిసియే యున్నది. అది లే దనుటకు తుమ్మెదలు ప్రతిపుష్పముపై వ్రాలి యం దమృతము గ్రో లుట చూచుచునే యున్నాము గాన పుష్ప మనగా కమలము. కమల మనగా తామరకమలము. తామరకమలముబోలు కన్నులుగల పర బ్రహ్మ మని. కమల మనగా కన్ను. కన్ను యం దున్న మెరుపు పృధివి, తెలుపు జలము, నలుపు యగ్ని. అందులో సునీలమైన పాపే వాయువు. ఆపాపలో వెలిగే కళయే ఆకాశము. ఆకళలో నిష్కళే తానైన పర బ్రహ్మము. గాన కళ యనగా నేత్రస్థానమం దుండు మహాసూక్ష్మ రంధ్రము. ఆ సూక్ష్మప్రకాశమువల్ల సమస్తవ్యవహారములు సమస్త

సంకల్ప వికల్పములు జరుగుచుండును. ఆ గుద్దులో నున్న సూక్ష్మ రంధ్రము యెటుల నుండె ననగా 'నీవారశూకవ త్తన్వీ పీతాభాస్వత్యణూపమా, తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః, సబ్రహ్మ స శివ స్స హరిః' అని పెద్దలు బల్కుచుండ అనగా నీవారశూకమనగా యవగింజపై నుండు ముల్లు. అది యెంత యుండునో అంత సూక్ష్మరంధ్ర ముండును. అదే ముక్తి కంత. ఆమధ్య నున్న మహాప్రకాశమాన మగు యేకాంతి కలదో అదే త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు నై యుండగా యివి యన్ని యున్న వని, యివి వేరే లేవని, యివి యావత్తు నాలోనున్న వని యివి యుండువారు, యివి యున్న సంగతి తెలియువా రెవరో వారే బ్రాహ్మణు లని బల్కుచుండగా, సచరాచరజీవకోటికి యావత్తు యిదే ప్రకారము యుండ, యిందులో స్త్రీలు, పురుషులు యావన్మంది సమానముగా నున్న సంగతి యెల్లరకు తెలిసియుండి మేము బ్రాహ్మణుల మని బల్కువారు వారిక్కళ్లకు కనుపించు యితరులు కారనుటకు వారికి పేరికి యుండు తారతమ్యభేదములు చూపలేని హేతువుచే యెల్లరు బ్రాహ్మణు లనబడుదురు. ఇది తెలియక మేము హెచ్చు యనుట యేమి యగునో తామే గమనించగలరు. శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః, వేదపాఠంతు విప్రాణాం బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః॥ ఇందుకు అర్థము—జన్మ రావటముతోడనే శూద్రుడనుట యేల ననగా సూక్ష్మమై మహా పెద్దదా తెలి వనే జ్ఞానమునకు స్థూలాధారము పెద్దదిగాక చిన్నదైన హేతువుచే చిన్నగా నుండి పెద్దదా జ్ఞానమునకు స్థూలాధారము తోడ్పడని హేతువుచే తను రెండూ సమానముగా నుండక హెచ్చుతగ్గులుగా నున్నదునను తెలివికి సహాయములేక యొంటరిదై తా నొక్కటి యేమి పనులు సల్పలేకున్న హేతువుచే జ్ఞాన ముండి యజ్ఞాని యనుపేరు వచ్చినందున ఆయజ్ఞానమే శూద్రత్వముగాని, శూద్రు డని పేరుచే పిలువబడువాడు శూద్రుడు కాడు. 'కర్మణా జాయతే ద్విజః' అనగా

స్థూలము కొంచెము కొంచెము పెద్దదై, ఆస్థూలాధారముచే సుకర్మ దుష్కర్మ చేసినందున ననగా మంచిపనులు చెడుపనులు చేసి యాపను లవల్ల వచ్చు కష్టనష్టసుఖదుఃఖములకు పాత్రుడై తనకన్న పెద్దస్థూలాధారము వారు శిక్షించ దుఃఖించి వా రానందమందిన సంతోషించి పరితాపామృతము జెందుచుండుటచే ద్విజు డని పేరు వచ్చెను. 'వేదపాఠంతు విప్రాణాం' యనగా తనకన్న పెద్దగా యనగా యెక్కువగా విద్య నేర్చి వేదమును పారాయణగా పఠించువారి సాంగత్యముచేసి నా కొనరించు వందనదాక్షిణ్యముల కోర్చి తాను వారినతుగా వేద మును పాఠము నేర్చుమాదిరి నేర్చి పారాయణగా పఠించుచుండి యున్నందున విప్రు డని పేరు వచ్చెను. 'బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః' యనగా బ్రహ్మ జ్ఞాన అంతు అను మూడుపదములలోనున్న, అర్థమును తాను దెలిసి యనగా నేను జీవసంబంధుడగు తనువుతో గూడిన మనుష్యుడను. నేను బ్రహ్మచేత యీఘర నుత్పత్తి యయితి నని నేను యేమి పనిచేసిన యీజన్మరహిత మవునని చింతించుజ్ఞాన మనే అంతు యున్నదో దాని నెల్లప్పుడు స్పృహచే యహోరాత్రు లుంచుకొన్నందున బ్రాహ్మణు డని పేరు వచ్చెను. బ్రహ్మచే తాను తనుస్వరూప ముగా పుట్టినవాడు బ్రహ్మ మెట్లగును? పోనీ బ్రహ్మమే యనుకొనిన బ్రహ్మ జగదుత్పత్తికి హేతుభూతు డగును. రజోగుణము యనే గుణముతో గూడియున్నవా డయ్యెను. అందువలన రజోగుణుడైన హేతువుచే యాగుణసంబంధముచే బ్రహ్మకు మారకదశ గలుగు నని దెలుసుకుంటూ యున్నారు. గొప్పవా డనుకొను బ్రహ్మయే మార్కమై పోవుచున్నందున బ్రహ్మచే బుట్టినవారందరు మార్కమై పోవుట నిశ్చయముగదా! ఇటుల మారిపోవువారందరు బ్రహ్మ మని పేరుపెట్టుకొని పొయ్యేవారుగాని నిలువువా రెవరు లేరు. ఇందుచే మే మెచ్చను నామ మెట్లు నిశ్చయించబడునో దెలుసుకొనుడు. రజోగుణసంపన్ను డగు బ్రహ్మ బ్రహ్మవల్లపుట్టి బ్రాహ్మణు లనువారలు, యితరులు యావన్మంది మారి పుట్టుచుండే బ్రాహ్మణులేగాని బ్రహ్మ

గీ॥ పతితపావను డిల భాగ♦వతకులాబ్ధి
చంద్రుడై కృష్ణపరమేష్ఠి ♦ గురున కిపుడె
పేరు పెంపొందు క్షీల్లాన ♦ శంకరు డగు
పరమగురునకు మంగళం ♦ బాగయొసగి
నిజగురుండైన నిల మాఘ♦వాన్వయాబ్ధి
కులము చెల్వొంద బుట్టియు ♦ కుముదహితుడై
వెలయు వేంకటగురునకు ♦ మంగళంబు
యొసగి వీరికి ఛాత్రుడై ♦ వన్నె కెక్క
నిల్చి నీకును మంగళం ♦ బిలలో హానుమ ! 134

ఏతత్సర్వంబును శ్రీ నిజగురుచరణావిందార్పణ మస్తు.

హానుమనపద్యములు — సంపూర్ణం.



శ్రీ గురుభ్యో నమః.



# గురుశిష్యసంవాదం బను

# కృష్ణశతకము.

ఆనందభైరవిరాగం — ఆదితాళము.

(శ్రీరమాహృదయేశ్వరా । భక్తజనచిత్తజలరుహ భాస్కరా-అను వర్ణమెట్టు)

శ్రీగురూరాయ నీదూ పాదములు । చిత్తములో పూజజేతూ
శీఘ్రింబుగా దెల్పవే నాసంశయం బెల్ల కృష్ణ కృష్ణా! 1

కర్మంబుచేత జన్మ గల్గె నని । ఘనశాస్త్రములు బల్కగా
జన్మంబు లే కెట్టులా తా జేయు । కర్మంబు కృష్ణ కృష్ణా! 2

వేదశాస్త్రంబు లెల్లా యివి యన్ని । వాదులే మాటగట్టూ
భేదంబు వీడి గనరా జన్మంబె । కర్మగద కృష్ణ కృష్ణా! 3

నేను యేజన్మవాడా పూర్వమున । నేను యేజాతివాడా
యేనివాసం బుందునో దెల్పగదె । యిప్పుడే కృష్ణ కృష్ణా! 4

పూర్వమున జన్మ లేదూ నీకు నిక । పుట్టుచావులును లేవు
నీనివాసమె బయలెరా ఛాత్రుడా । నిజ మిదెర కృష్ణ కృష్ణా! 5

జన్మ యాధారమైనా కర్మముకు । జన్మ కే యాధారము
సన్మునిస్తోత్రి దేవా! దెల్పు మిక । సత్యంబు కృష్ణ కృష్ణా! 6

మాతృపితృల కూడికే జన్మకు । మహిలో యాధారంబురా
పాత్రుడా! యిదె దెల్యరా శిష్యుడా! । పదిలముగ కృష్ణ కృష్ణా! 7

మాతృపితృలుకూడినా జన్మలు । మహీ రావు యేమి యైనా
మరు గున్న దెలుపు స్వామీ మొక్కెదను । మమతతో కృష్ణ కృష్ణా!
ఆరువ్యాధులు స్త్రీలకూ గలిగియూ । నందుచే సంతానము
నవనిలో గల్గ దనుచూ దెలియరా । నందముగ కృష్ణ కృష్ణా! 9
ఆరువ్యాధులు యేమిటో । అవి దెల్పు హోగురూ దేవ నాకు
అవి దెలిసి నమ్మియుండీ యానంద । మందెదను కృష్ణ కృష్ణా! 10
కమలముఖమందు కొవ్వు పొరగప్ప । గల్గదుర సంతు జగతి ।
విమలమానసుడ వినరా యిది యొక్క । గుణ మనుచు కృష్ణ కృష్ణా!
యోనిలో కమలమందు దుర్మాంస । మనె దొకటిపెరిగియుండు
యిదె రెండో గుణము దెలియూ శిష్యుడా । యిప్పుడే కృష్ణ కృష్ణా! 12
గొడ్డుపురు గనెది యొకటీ యుండియు । గోళకము దురదజేసి
జిడ్డుసమమైననీరు గారు యిదె । త్రిగుణమున కృష్ణ కృష్ణా! 13
జలపురుగు మర్మస్థళమునను నిలచి । జల మెప్పుడును గారజేయు
జడుడ మణి నిల్వ దినరా యిదె నాల్గో । గుణ మంచు కృష్ణ కృష్ణా!
మారుతం బధిక మయ్యూ పుష్పమును । మరల జేయించి
యుండు నిదె నైదో గుణము పుత్రా।యింకెల్లు సంతౌర కృష్ణ కృష్ణా!
ఉడుకుచే గాఢనిద్రా లేకయు। వచ్చు దుస్స్వప్నములును
ఓశిష్య! శుక్లరక్తం బగు నారో । గుణ మిదెర కృష్ణ కృష్ణా! 16
యొకమనవి గలదు దేవా స్త్రీలకీ । గుణములే గలిగియున్నా
కొంతకాలముకు వీరీ కెటు గలుగు । సం తపుడు కృష్ణ కృష్ణా! 17
నాల్గుదశ లుండు వినరా నరులకు ! నవి మూర సంతు గల్గా
నంతెగా కింకేమియు లేదుర । నవనిలో కృష్ణ కృష్ణా! 18
దశలునా ల్గనిన నేమూ దెల్పుమీ । ధరలో నాస్వామి యిపుడే
దప్పకనె నిను నమ్మితీ నా కింక । దిక్కెవరు కృష్ణ కృష్ణా! 19
కౌమారవార్ధక్యమూ యవ్వనా । బాలత్వ మన నివ్వెరా
రక్తపరిశుభ్రమైనా రాగల్గు । సంతపుడె కృష్ణ కృష్ణా! 20

యిదిగాక సంతివ్వనూ యేహొద్దు । యెవ్వరూ పూన రనుచు
యెరుగరా శిష్యతిలకా! యీమరుగు । యిప్పుడే కృష్ణ కృష్ణా! 21
యీసంధి తెలియలేకా స్త్రీ లెపుడు । యెన్నొ చెట్టుల గుట్టలా
యేమేమొ దేవతలను మొక్కెదరు । వెర్రిచే కృష్ణ కృష్ణా! 22
మంచిక్షేత్రములలోనూ బీజమును । మక్కువతో నాటినానూ
వంచనేమియు లేకనూ వృద్ధియై । వరలునుర కృష్ణ కృష్ణా! 23
ఊసరక్షేత్రమందూ బీజములు । వృద్ధయినమాట యెందూ
దోచునా యెవ్వరికినీ జూడు యిది । సూటిరా కృష్ణ కృష్ణా! 24
యిటువలెనె స్త్రీల కండే రోగములు । పటుతరంబుగ వృద్ధియై
నెటులైన బీజమందూ నిలువదుర । నిదె మరుగు కృష్ణ కృష్ణా! 25
జననిజనకులె యెంచగా నాజన్మమునకు నాధారమైనా
వారి కే యాధారము దెల్పు మిక । వాంఛతో కృష్ణ కృష్ణా! 26
బీజ మాధారంబురా క్షేత్రముకు । క్షేత్రమే బీజమునకు
యీరెంటి సమ్మేళనే జన్మలకు । హేతువుర కృష్ణ కృష్ణా! 27
బీజక్షేత్రంబు లనగా నేమిటో । భేదంబు దెల్పు స్వామీ
నీరెంటి కాధారమూ నే మానొ । నివ్వగదె కృష్ణ కృష్ణా! 28
భ్రాంతియే బీజమౌర నావెంట । చింతయే క్షేత్రమౌరా
యీరెంటికీ మూలమే సంకల్ప । మం చెరుగు కృష్ణ కృష్ణా! 29
సంకల్పమే మూలమూ భ్రాంతికీ । భ్రాంతియే మూలమౌనా
ఇవి యెటుల సమసిపోవు దెల్పగదె । నిక్కముగ కృష్ణ కృష్ణా! 30
అగ్నిచే కాల్చబడినా ధాన్యములు । నవి మొలక లెత్తసేనా
నటువలెనె జ్ఞానాగ్నిలో భ్రాంతులను । నావరా కృష్ణ కృష్ణా! 31
ఒకటి రెండుగ దోచియు నిన్నిటుల । వంచించి బోవుచుండే
ఒక్కటే యుంచు నుండా నణగు నీ । చిక్కులుర కృష్ణ కృష్ణా! 32
తారహారముల మాడ్కి నీ వెపుడు । దాని నంటక యుండుపూ
కర్మజన్మలను జూడా నీరీతి । గనుగొనర కృష్ణ కృష్ణా! 33

కర్మబ్రహ్మస్వరూపం బనియెడి । ఘనులవాక్యముల వినమే
నిర్మలంబుగ నమ్మమిూ నీవిధి । నిక్కముర కృష్ణ కృష్ణా! 34
అంత పరిపూర్ణ ముండే నందులో । వింతగా నెరుక దోచే
సుంతైన లేకపోవ్వా నీ విపుడు । చూడరా కృష్ణ కృష్ణా! 35
గతజన్మ తల్లిదండ్రుల్ వివరించ।గను ముందు జన్మతనయుల్
గాంచు పదేపదె మారుటల్ తనగుణము । జన్మలో కృష్ణ కృష్ణా! 36
దేహమే దేవాలయం యిందులో । జీవుడే దేవు డనగా
సోహంస్వరూపుడౌను యజ్ఞాన । మును విడర కృష్ణ కృష్ణా! 37
కుందేటికొమ్మువలెనే నీ జన్మ।కర్మ లటు దోచబడియే
మాంద్యుడా గానబడునా కుందేటి । శృంగముల్ కృష్ణ కృష్ణా! 38
అంగాంగములును గలసీ మధియించ। నాత్మపుత్రుడుగ వెలసె
నాత్మయే పరమాత్మరా యిది । చెడదు తరగదుర కృష్ణ కృష్ణా! 39
దేవకర్మం బదేమిూ రంగులా। దేవు డా జీవుడౌనా
దేహమా ప్రాణమానా లేక యే । రూపమా కృష్ణ కృష్ణా! 40
పంచరంగులును కాదూ శిష్యుడా । ప్రాణదేహములు కాదూ
వాంఛతో జీవశివులూ యెన్నటికి । కాదురా కృష్ణ కృష్ణా! 41
యేదికానీదానికీ కర్మ మని। యెటుల నామము గల్గెనో
వివరముగ దెలుపువరకూ మిూకాళ్ళు । విడువ నో కృష్ణ కృష్ణా! 42
యేదికానీదానికీ కర్మమని । పేరుమాత్రమె గల్గెరా
కర్మమే బ్రహ్మమనుచూ ఛాత్రుడా । గనుగొనర కృష్ణ కృష్ణా! 43
బ్రహ్మచే కర్మమెనా లేక యిది। కర్మచే గల్గబడెనా
యిమ్మహిని త్రిణిక్షోణుల్ యెటు గల్గె। యిది దెల్పు కృష్ణ కృష్ణా! 44
బ్రహ్మచే నిర్మించెరా కర్మ యిది । బ్రహ్మనే జేయలేదూ
నిర్మలంబుగ దెలియరా శిష్యుడా । నిక్క మిదె కృష్ణ కృష్ణా! 45
బ్రహ్మమే నిర్మించినా కర్మమును । బ్రహ్మకర్మంబె యానూ
యిమ్మహిలో చోరు డెపుడూ దొరయౌన। యిది దెల్పు కృష్ణ కృష్ణా

బ్రహ్మ రజోగుణముచేత కర్మమని । యిమ్మహిలో పేరుగల్గె
సమ్మతిగ గుణ మొదలినా దొరయాను । సత్యముగ కృష్ణ కృష్ణా! 47
కర్మం బదేమొ దేవా దెల్పుమూ । నిర్మలుం డౌదు నిపుడూ
ధర్మములు బోధింపగా నిల్చితివి । దప్ప కివె కృష్ణ కృష్ణా! 48
కర్మ లన పనులె వినరా శిష్యుడా । జన్మ మండె జరుపుచుండూ
జన్మలే కెప్పటికినీ తా పనులు । జరుగవుర కృష్ణ కృష్ణా! 49
పనియె కర్మంబె యైనా నాపనులు। నాగునా యేమియైనా
పనులె మారిన బ్రహ్మతో భువనములు । మారుగద కృష్ణ కృష్ణా! 50
భువనములు మారు టరుదా యీక్షితిలో । బ్రహ్మకల్పములు మారే
బ్రహ్మమే కాదు వినరా హరిహరులు । మారురా కృష్ణ కృష్ణా! 51
హరిహరులు బ్రహ్మ మనగా నెవ్వరో । నెరిగి చవలెను స్వామీ
నాపకను మీదుకరుణా నాపైని । నాపవలె కృష్ణ కృష్ణా! 52
యిడపింగళసుషుమ్నలకా వెలసిరీ । యిలలో త్రిమూర్తులయ్యా
వీరలే యుత్పత్తియూ వృద్ధిలయ । మొనరించు కృష్ణ కృష్ణా! 53
మూడు నాడులె యనగనూ యెవరెవరో । ముఖ్యముగ దెల్పుదేవా
ముగ్గురూ మూర్తు లుండే మూలమును । మొద లివ్వ కృష్ణ కృష్ణా!
వాత్రనాడీ బ్రహ్మరా ధాతుృడా । పిత్తనా డీశ్వరుండూ
శ్లేష్మనాడీ విష్ణువూ యివియే । త్రిమూర్తులా కృష్ణ కృష్ణా! 55
బ్రహ్మమొదలైనవారల్ మారినను । మారనిది యేదొ దెల్పూ
మారె దానిని నమ్మినా యుపయోగ । ముండునా కృష్ణ కృష్ణా! 56
యుపయోగ మేమి లేదూ యూహించ । యుండు పరిపూర్ణబ్రహ్మం
విపరీతములు లేనిదై యెప్రొద్దు । నిల్చురా కృష్ణ కృష్ణా! 57
విపరీతములు యనగనూ యేమిటో । నివరముగ దెల్పు దేవా
యెపుడు పరిపూర్ణమందూ బ్రహ్మమని । పలు కెట్లు కృష్ణ కృష్ణా! 58
పలుకున్న పరిపూర్ణము బ్రహ్మమని । పలుక పనిలే దెప్పుడూ
పలుకులే దెన్నటికినీ అది పెరిగి । విరుగదుర కృష్ణ కృష్ణా! 59

విపరీత మనె మాటనూ వినచితివి । యేది చోద్యంబుగా దేవా!
నిపుణత్వముగ దెల్పుమీ। మొరిక్కెదను కృష్ణ కృష్ణా! 60
వినువతే దా మాటనూ యిప్పుడే । వినరింతు వినర సిస్సు
చలనవికలత్వ మనుటా విపరీత । మనబడుర కృష్ణ కృష్ణా! 61
పలుకున్న పరిపూర్ణమూ బ్రహ్మమని । పలుక సని లే నంటివి
పలు కనెది నేమిటానో దెల్పుమీ । ధాతుద్రిడను కృష్ణ కృష్ణా! 62
పలు కనగ మాటమాయ యెరుక యని । బలునామములు యుండను
పలుకున్న పరిపూర్ణము బ్రహ్మ మన । బని లేదు కృష్ణ కృష్ణా! 63
మాట లేనట్టిబయలూ నందు నా । మాటున్నదనుట వినిన
మాయగా దోచబడురా మాటాడి । మానుదను కృష్ణ కృష్ణా! 64
మాయయన నేమి లేసి దని తెలసె । మంచిమీకరుణ చేతా
లేని యీమాయ అచలంబం దెటుల । దోచబడు కృష్ణ కృష్ణా! 65
యెండమావుల జలముగా దోచియు । వినరించనేమి లేక
యెటుల గాన్పింప నటులే యీయెరుక । యేర్పడెర కృష్ణ కృష్ణా! 66
దెల్పెదను శిష్యతిలకా! యింకొకటి । నూటందియుండి లేకా
చపలంబె జూడ కోడిపాలవలెను । యెరుకండు కృష్ణ కృష్ణా! 67
పరిపూర్ణమందు యెరుకా తద్వశముగ । ప్రభవించినటుల దోచు
పరికించ నచలమందూ బుట్టదుర । యీయెరుక కృష్ణ కృష్ణా! 68
చలంబునందు యెరుకా బుట్టదని । యంటివి వింటి స్వామి
చరాచరములతోటి భూతములు । యెటులాయె కృష్ణకృష్ణా! 69
భూతములు మాయయగురా మాయయన । సర్వతోహాస్యంబె యగురా
తలిదండ్రితాత తెట్లో భూతములు । నటులౌర కృష్ణకృష్ణా! 70
భూతంబు లనగ నేమీ వినరముగ । బోధించవలెను స్వామీ
తలిదండ్రితాత లనుచూ నామములు । యుండుగద కృష్ణకృష్ణా! 71
భూమిలో దిరుగుకొన్ని దిరుగనివి । భూతంబు లని తెలియురా
తలిదండ్రితాత లనుచూ నీవుండి । దలతువుర కృష్ణకృష్ణా! 72

స్త్రీపురుషరూపుగాకా బ్రహ్మంబు । స్థాపించె తనదుకళలూ
కళలచే పురుషస్త్రీలూ గల్గిరా । బ్రహ్మమై కృష్ణ కృష్ణా! 86
బ్రహ్మచే బుట్టి రనుచూ దెలియరా । బ్రహ్మస్వరూపులేరా
బ్రహ్మ ప్రజాపతేరా నంతయూ । బ్రహ్మనర కృష్ణ కృష్ణా! 87
అంత బ్రహ్మంబె యైన భూమిలో । భూతజాలంబు లన్నీ
స్త్రీపురుషరూపమంతా బ్రహ్మంబు । గాద గురో కృష్ణ కృష్ణా! 88
జీవకోటులు యన్నియూ బ్రహ్మంబె । భావమందున నిల్పరా
అంత బ్రహ్మంబె తా నదియు । గాకుండు కృష్ణ కృష్ణా!
అంత తానయ్యుగాకా యెటులుండు । వింతగా నాకు దోచె
మంతనంబున యుంచుదూ యీమరుగు । మరి దెల్పు కృష్ణ కృష్ణా!
రూపుచే నామంబులూ గలిగి యా । రూపులో తా నుండియూ
రూపములు తాను గాకా వ్యాపించి । యుండురా కృష్ణ కృష్ణా! 91
యుండు నెందెందు దెల్పా శ్రీగురురో । నిండుప్రేమను నిల్పియూ
దండిసూత్రము దెల్పనూ మీకన్న । దా తెవరు కృష్ణకృష్ణా! 92
విత్తుఒక్కటియుండియూ యెన్నెన్నొ । రూపులై తాను గాక
విత్తుచే ఫలములయ్యూ తా ప్రథమ । విత్తౌర కృష్ణకృష్ణా! 93
యిటువలెనె బ్రహ్మమందూ జగమంత । యేర్పడియు వేర్వేరుగా
పటుతరంబుగ దోచియూ తిరిగి యా । బ్రహ్మమా కృష్ణకృష్ణా! 94
బ్రహ్మచే సచరాచరా భూతములు । నిర్మింప సత్యమైనా
యిమ్మహిలో నరజాతికీ । కులభేదములు యెట్లు కృష్ణకృష్ణా! 95
హాంకార మేకులమురా ధాత్రిడా । యది దప్ప యేది లేదూ
హాంకారమును వదలినా కులమంత । యొక్కటిర కృష్ణకృష్ణా! 96
బ్రహ్మచే గలిగినట్టీ భూతములు । బ్రహ్మంబుగాక యేమా
వేరైన నే నెవరిచే బుట్టితినో । యిది దెల్పు కృష్ణకృష్ణా! 97
భూమియాకసమందునా యున్నట్టి । భూతంబులన్ని నీవూ
బుట్టితివి బ్రహ్మవలనా నందుచే । బ్రహ్మ నీవే కృష్ణకృష్ణా! 98

నేనె బ్రహ్మంబైయైనా దేశికా । నిల తల్లిదండ్రితాతల్
మాయమై బల్కరైరీ నే । మాయమాదుగద కృష్ణ కృష్ణా! 99

నే మాయమైనగానీ నావెంట । బ్రహ్మ తా మాయమాటా
నిక్కమే దేలుచుండే లోకముకు । దిక్కెవరు కృష్ణ కృష్ణా! 100

సత్య మాధారంబురా సత్య మన । స్పష్టంబె పరమాత్మరా
పరమాత్మ జగము యయ్యా తానదీ । గాకుండు కృష్ణ కృష్ణా! 101

నీవె పరమాత్మలోనా యుందువు । నీచె యుత్పత్తిస్థితియూ
లయమాట నీకె దోచీ యిది విడచి । యుందువుర కృష్ణ కృష్ణా! 102

కనుపించె లోకమంతా కల్లయని । ఘట్టిగా జనులు బల్కా-
కారణం బేమొ యున్నా జగము లే।దను టెట్లు కృష్ణ కృష్ణా! 103

కత్తి నొరగప్పి నటులా బంగారమును । మురుగు దాచినటులా
అజ్ఞానమును కప్పియూ జగమున్న । దని దోచు కృష్ణ కృష్ణా! 104

తామరాపత్రిమందూ బడ్డ జల।బిందువులు ముత్యములుగా
దోచ నాణెమును జేయా । గానిసతు జగమార కృష్ణ కృష్ణా! 105

పదిమంది పనులుజేయా వాటినీ । పలుమారు జూచి దెలియూ
పట్టదు తనువు గుర్తూ లేనటులె । జగమార కృష్ణ కృష్ణా! 106

కలలో ఫలముల జూచియూ వెంటనే । ఘట్టిగా దాచుకొనియూ
మేల్కొచ్చి ఫలము తిననూ । లేనివతు జగమార కృష్ణ కృష్ణా! 107

యిల కలతో సమమంచునూ దెల్పితిరి । యిది యెటుల సమముజెందూ
జగమున్న యనుభవంబు నిల్చు యిది । దెల్పు గురోకృష్ణకృష్ణా! 108

జగమందె యనుభవంబూ గాదురా । కలయందు యనుభవంబు
గట్టిగా యుండు శిష్యా! దెల్పెదా । గుట్టినర కృష్ణ కృష్ణా! 109

అనుభవం బిదియు గాదా నీకలలో । కాంతొచ్చి కలసియున్నా
స్ఖలనమై సఖియలేనీ చంద మిా । జగమార కృష్ణ కృష్ణా! 110

యిది నిజంబైన గుర్తే శ్రీగురో । యిచట సఖి లేదు గానీ
నే నొకటి స్ఖలన మొకటీ రెండు । యివి యేమియా కృష్ణకృష్ణా ! 111

నే ననేది నీవు గావూ నే ననే । దేదియో తెలియబడవ్రా
నే ననేదిగాక యున్నా యింకేమి । నిల్చురా కృష్ణకృష్ణా ! 112

నీటిపై బుగ్గజూడా యెన్నెన్నో । చిత్రరూపములు జూపి
నేమైన లేకబొయ్యే నీవిధం । బీజగము కృష్ణకృష్ణా ! 113

నీరె పరిపూర్ణంబురా నీజగం । బినుము వాడిగళ్ళె వినరా
వడిగండ్లు యెటుల లేవో యీజగం । బడెయారా కృష్ణకృష్ణా ! 114

అన్నిరూపములలోనూ నేనుండి । రూపములు నేమిగాకా
రూపము కతీతమైనా జగ మింక । యేదిరా కృష్ణ కృష్ణా ! 115

గాఢనిద్రలో జగములూ యేమైన । గాంచితివ నామరూపం
బొడకా డెల్పు శిష్యా జగ మింక । లేదనుము కృష్ణ కృష్ణా ! 116

మాయమ్మ మాయ య్యనీ సుతు బిలచె । మాటలో మరుగు దెలియూ !
మాయమ్మ మాయయ్యా నా జగమేది । మాయనర కృష్ణ కృష్ణా ! 117

దేశికా యిలలో బ్రహ్మ క్షత్రియా । వైశ్యశూద్రులు పంచముల్
యిన్నిజాతులకన్ననూ బ్రాహ్మణులె । బ్రహ్మాన కృష్ణ కృష్ణా ! 118

అన్నిజాతులవారలూ బ్రాహ్మణులు । బ్రహ్మచే బుట్టి రవనీ
యెరుకచే నామంబులూ యేర్పాటు । గలిగె విను కృష్ణ కృష్ణా ! 119

జాతులన్నియు యొక్కటే జాతనిన । గను పురుషస్త్రీలె యారా
రెండురూపులు బ్రహ్మగా యేర్పాటు । యాయెరా కృష్ణ కృష్ణా ! 120

బ్రాహ్మణులు యనువారలూ హెచ్చైన । పురుషులే స్త్రీలె యానూ
హెచ్చైన వేరె వర్ణం లేదురా । యిలనెచట కృష్ణ కృష్ణా ! 121

స్త్రీపురుషవారలకునూ యుండురా । స్థిరకళయు ముఖము నందూ
కళయు లేకున్న వారీ గానమురా । ఘను లెవరో కృష్ణ కృష్ణా ! 122

పనులచే జాతులనుచూ గలిగెరా । పనులందు కులములేదూ
మునుపు యేకులమువారో వివరించు । ముఖ్యముగ కృష్ణ కృష్ణా! 123
శుక్లరక్తములకులమే చూడరా । సృష్టిలో యున్నవారూ
శుక్లరక్తముల మార్పుగను యేది । ఘనకులమొ కృష్ణ కృష్ణా! 124
శ్రీగురో వీరందరూ బ్రహ్మచే । బుట్టిరా బుట్టలేదా
బ్రాహ్మణులె బ్రహ్మవల్లా । బుట్టంద రెట్లయిరో కృష్ణకృష్ణా! 125
సర్వభూతంబులన్నీ బ్రహ్మచే । సత్యముగ గలిగె వినరా
భూతములలోన పైనా బ్రహ్మమే । ఖ్యాతిగను కృష్ణకృష్ణా! 126
జన్మగల్గినతోడనే శూద్రులా । జగతిలో జనులందరూ
కర్మంబుజేయ ద్విజులై ధాత్రిలో । గనుపడుర కృష్ణకృష్ణా! 127
వేదంబు పఠియించగా విప్రు డని । యెన్నుదురు జనులు వానీ
యిదివినర శిష్యతిలకా యింకొకటి । దెల్పెదను కృష్ణకృష్ణా। 128
బ్రహ్మజ్ఞానంబునం దా బ్రాహ్మణుం । డా ననుచు రిల బుధోక్తుల్
బ్రహ్మ మను జ్ఞాన మిడినం యొజ్ఞులార । బ్రాహ్మణులు కృష్ణకృష్ణా!
యెల్లసంశయములన్నీ దెల్పితిరి! యింకేవి యెరుకపోయె
భవబంధ మీడి నీలో లీనమై । భయమిడితి కృష్ణకృష్ణా! 138
మంగళము శ్రీగురేంద్రా యెల్లపుడు । మంగళము వేంకటేంద్రా
మంగళము హనుమద్దాసూ మీ కొసగె । మంగళము కృష్ణకృష్ణా! 131

ఏతత్సర్వంబును శ్రీ నిజగురుచరణారవిందార్పణ మస్తు
గురుశిష్యసంవాదం బను కృష్ణశతకము సంపూర్ణం.



వేంకటేశ్వరగురుని పాద । కింకరుడనై నిన్ను గొలచితి । శంకలేకా హనుమద్దాసుని చారదీసిన శ్రీగణపతే॥ ఏకదంతుని॥

---

ఆనందభైరవిరాగం. సరస్వతీ ప్రార్థన. ఆదితాళము.

నన్ను గన్నతల్లీ — అను వర్ణమెట్టు.

ప॥ నన్నుగావా రావే । వోనలువరాణీ । నిన్నూ నమ్మితిగాదే వోమృదు పాణీ ॥నన్నుగా॥

అ॥ కన్నతనయుని గానా । కరుణేల లేదే । కనుమూయ పుత్రూడు । కములూను గాదే ॥నన్ను॥

చ॥ తప్పున్న పుత్రూని । దండింపరాదా । చెప్పిన వినకున్నా । శిక్షింపరాదా । ముప్పూతిప్పలబెట్టా మొహంబులేదా । వొప్పూలకుప్పా నే। నొప్పీతి గాదా ॥నన్ను॥

నవరసములనెల్లా । నా కివ్వ రావే । నవ్వుచు యిట నిల్చి । ననుజూచి పోవే । నలువ నిను సేవించ నను బిలుచుకోవే । ననువిడనాడీన । నగుబాటుగాదే ॥నన్ను॥

మూడూ వింశతిపైగ । ముదమొప్ప నాల్గూ । పేరూగల విద్దెలకు ప్రభు వీవె గావే । నేడు నిను వర్ణించ నే బూనినానే । నెల్లావిద్యల నొసగి నేలూకొన నీవే ॥నను॥

మహిని శ్రీమాధవా । రాజావంశమునూ । మాన్యతనొందించ । మహి నుద్ధహించీ । మానక భక్తూల మరి నేలుచున్నా । మాగురు వేంకాట మాన్యూని గొల్తూ ॥నను॥

వసుధ శ్రీజూపూడి । వంశాసంభవునీ । వాంఛాలెల్లా । దీర్చవచ్చియు పూనీ । వరము లొసంగావే । ఓవీణాపాణీ । వాదేల హనుమద్దాస్ । వాక్యూన నిల్చి ॥నన్ను॥

తోడిరాగం — రూపకతాళము.

గానలోలా గావవేమిరా — అను వర్ణమెట్టు.

ప॥ నాదుచెంతా జేరి బ్రోవవే । నవయము నిను సేవించుచు । నార్తితో నమ్మితి బాలా ॥నాదు॥

అ॥ నాదుచెంతా జేరవేని । నలినలోచని । నా కెవ్వారె మోదమందనేక సుమములపాదములందున యుంచీ। భక్తితో పూజలొనర్చెద॥నాదు॥

చ॥ నీదుమహిమ నెన్నగల్గా । నేశ్వరీకానె జననీ । వాదభేద ముంచు జనుల । నీధర గూల్చె సెదవా । నిక్కముకాత్యాయని శ్రీ ॥నాదు॥

కాళీ మహేశ్వరి వాణి । కమలా త్రిపురసుందరి । కావు దుర్గా జాగాజ్జని । ఘనమగు నామము లెన్నో । గల్పించిన స్వయంభువ ॥నాదు॥

యెట్టి మానఘనులనైనా । రట్టుజేయు నీదుయుక్తి । గట్టిగా యింద్రాదిమునుల । గుట్టలపాశ్రసితివా । నెట్టిదో నీదాశక్తి ॥నాదు॥

త్రిగుణభావసహితనయ్యా । చిగురుబోణి నీవు ముందూ । త్రిగుణ రూపములుగ జేయుటా।తీవ్రవిధాతా విష్ణుని।శివుని నొనర్చినతల్లీ॥నాదు॥

వృద్ధిస్థితిలయకర్తగ । నరలుచుంటిపినె యంబా । దిద్దివేయు నాయఘముల । క్రొద్దిదె యీపని తల్లీ । బద్ధుడనైతిని వేగా ॥నాదు॥

వేంకటేశ్వర గురుని గొల్చు । కింకరుండ నంటి మాతా । శంకలేక హనుమద్దాసుని । యింకను బ్రోవక యున్నా । యెవ్వారె యీస్థలి నీవే ॥నాదు॥

---

శహానరాగం — రూపకతాళము.

ప॥ నీదయరాని । దదేమొ కల్పవల్లి । యంబ-ఐం ॥నీదయ॥

అ॥ భేదముసేయుటా । కాదది నను గన్నతల్లి-క్లీం ॥నీదయ॥

చ॥ యీధరమానవా । సాధుజనులలో । బీదను నేననీ ప్రీతితో ధ్యానము । నేమర కార్తితో జేసియు మ్రొక్కితినో-సౌ ॥నీదయ॥

యెల్ల హృత్కమలములలో । కొల్లగనిల్చియూ । చల్లనిచూపు నెగజల్లుచు।కల్లలుజూపకసత్యము।గొల్లగనిచ్చితివంచనినమ్మితి-సా॥నీదయ॥
పాపలలోపలా జ్యోతిరూపమై । యేతరియుంటివో జూతును నీ మోము । నాపక ముందరనాడుచు । యీతరిపల్కులు నోల్కుచు । ప్రీతితో నిట నిల్చుండుము । యీతరి నమగనిన తల్లి-క్లీం ॥నీదయ॥
సంకటభేదునీ । వేంకటశ్రీగురునీ । నింక నర్ధాంగివై । బింకముతో నున్నా । శంకే హనుమద్దాసుని । నింకను నీలో జేర్చుట । సంకోచించకు మనసున । సంకటహరరాణీ । త్వరజేర్చుము నీలోనఙ । సరగున నిక నెటుబోఙ రాఙ-ఐం ॥నీదయరాని॥

---

## గురుస్తోత్రము.

హిందూస్థాని సారంగ - ఆదితాళం.

బ్యాండు — వర్ష మెట్టు.

ప॥ మనస గురునీ స్మరియింపుచుండావే నీ । మతినీ దుర్మగ్నాతమానా ॥మనస

చ॥ మాయమాటలాడబోకు । వోమనసా యిల । మాయాలో జిక్కా వోమనసా ॥మనస
యెట్లుగల్గే నిలజన్మమంచానీ । నాగుట్టూదెలియావె । గురునీ ॥మనస
దిక్కులేనీ నరయడవి లోపాలా । నీటక్కులు జూపూట న్యాయా ॥ మనస
యిలలో వెలసిన మాధావ । రాడ్వంశా । అలవేంకా టేశ్వరుని ము క్తిత్రోవ ॥మనస
దీనుడగు జూపూడి హనుమ । ద్దాసుమాట నిక । హీనాముగా జేవలదంచూ ॥మనస

---

నాదనామక్రియారాగం-ఆదితాళము.

ఆహాపరాత్పరా । నపరాధినై తిరా అనువర్ణమెట్టు.

ప॥ శ్రీశంకరయ్యా । శ్రీవేంక । టేశ్వారయ్యా ॥శ్రీశంకర॥

అ॥ సేవకూడ నయ్యా । శీఘ్రమే । బ్రోవ్రూమయ్యా ॥శ్రీశంకర॥

చ॥ సంకటదూరుడా । వేంకటాపతిభూవరా నా । సంకటాపూలా దుంచీ నీ । సరిదరీ జే ర్చంటిరా ॥శ్రీశంకర॥

చ॥ హరిహరి నావంటీ । అంధకుడులేడంటీ । ఆపరాత్పరబ్రోవుమంటీ । యాలస్య మొద్దంటీ ॥శ్రీశంక॥

భవమరణ మనెటీ వ్యాధీ । బాధకు తాళాజాలా । పరమౌషధం బిచ్చీ । పాలించ రావేలా ॥శ్రీశంకర॥

నేరమ కోరుటా । భారమ బ్రోచుటా । దారిజూపుటా । నీదాటా దండించు దోషామటా ॥శ్రీశంకర॥

సామజము నీ కేమీ । సౌందర్యహారా మిచ్చే । తామసాని ర్వృత్తూలై దయతో నేలినదీ డెలసే ॥శ్రీశంకర॥

అలనాడు విభీషణుడూ । యాపద్బాంధావా యనినా । కలకాలబారీ మేనూ । గట్టవే పట్టాముూనూ ॥శ్రీశంకర॥

యిందరిని బ్రోచినా । డెందుకో డెలియగా । సందియములేకా నుతి । సల్పెద గావా రాదా ॥శ్రీశంకర॥

నాభావమందూ । నమ్మి భజించెద । నాపరంధాముడ । నన్నెటు జేసెదో ॥శ్రీశంకర॥

మాధావరాజావంశా । మాం పాలన వేంకాటేశా । హనుమద్దాసూ నీపోషా । ఆర్యాస్తుతావేషా ॥శ్రీశంకర॥

## సురటరాగం — జుల్మతాళము.

ప॥ మోసపోకుమా మనస । మోసపోకుమా
అ॥ మోసపోకు నీవిహ । వాసనలనుదగిలియుండి । భాసురముగ గురుని
జేరుట । బాగావినవె కనవే మనస ॥మోసపోకుమా॥
చ॥ ద్వాదశాబ్దమూలాలు నిలచి । బోధవిడక సేవసల్ప । వేధలన్ని దుల్పి
గురుడు । వేగా హరియై । హరుడా మనస ॥మోస॥
స్వస్తిస్వర్ణరోహణలను । వస్తుత్రివిధ మందగోరి । శిస్తుసాధుమార్గ
మందు జేరీ । నడువూ చెడవూ మనస ॥మోస॥
ఎంతజెప్పినాను ధరలో । పంతముడుగజాలవేమి । భ్రాంతివిడచుటెల్ల
నీకు । భారీ యఘమా సుఖమా మనస ॥మోస॥
మెరుకపూర్ణ భావములను । మరుగుడెలిసితేను చాలు । పరము
జెంద గలవు నమ్మ । భక్తీనిలుపూ సలుపూ మనస ॥మోస॥
వేంకటేశగురునిపాద । పంకజముల గొల్చుచున్న । బింక మలర
హనుమద్దాసు । నింకా విడదా పడదా మెరుక ॥మోస॥

---

## మధ్యమావతిరాగం - ఆటతాళము.

ప్రియబంధుజనులార । పోయీవచ్చెదమూ - అను వర్ణమెట్టు.

ప॥ శంకార నీకూ నే । శరణూ జేసెదరా ॥శంకార॥
అ॥ శరణూజేసెదరా నీ । చరణములే గతిరా ॥శంకార॥
చ॥ నిను వర్ణించుటకూ నే । నెంతా జాలనురా । ఘనమౌ సంసా
రాబ్ధి । గడువా జాలనురా ॥శంకార॥
ఖేదామోదములాను । పాదూ దుల్పుమురా । వాదాభేదములేని ।
పాదూ డెల్పుమురా ॥శంకార॥
యీషణత్రియములచే । హింసా జెందితిరా । వాసావార్చిత నీ ।
దాసదాసుడరా ॥శంకరా॥

అష్టమదములు నన్నూ । నారాడిజేసే । శిష్టాసంరక్షాక । చేపట్టవేరా ॥శంకార॥

వాసనత్రియములలో । వరలూచుంటినిరా । ద్వేషాదోసములాను తెగటార్చవేరా ॥శంకార॥

వేంకటేశ్వరరూపా । వేదావిచారా । శంకేల దాసూని । చేర రావేరా ॥శంకార॥

చూపులో జ్యోతీని । చూపించవేరా । చూపూ జ్యోతికి మించు। సూటి దెల్పుమురా ॥శంకర॥

సాధనలు నాల్గిటిని । సరిజేసుకోరా । మోదావహా నీరూపు । మును జూచినారా ॥శంకార॥

మాధావరాడ్వంశ । మణి వేంకటేశా । సాధూరక్షణదీప । సకల స్వరూపా ॥శంకరా॥

అగ్గజేంద్రునిబాధ । నణచాగా లేదా । హనుమద్దాసునిబ్రోవ వదియేమి వాదా ॥శంకార॥

---

జంఝూటిరాగం — ఏకతాళము.

గోపీనందన । గోపరిపాలన అను వర్ణమెట్టు.

ప॥ లక్ష్మీరమణా । మోక్షాభరణా ॥లక్ష్మీరమణా॥

అ॥ దీక్షవహించియూ । నీనునిబ్రోవవే ॥లక్ష్మీరమణా॥

చ॥ పక్షీవాహానుడ పాతకదూరుడ । యీక్షణమందునా । నెటువలె బ్రోతువో ॥లక్ష్మీరమణా॥

పరులధనంబును । పానకమునువలె । నిరతము గోరెడి నీచుడ నన్నూ ॥లక్ష్మీరమణా॥

ఖేదమోదముల । పాడును దుర్బ్వటి । భేదము దెలియకా । బేలనై యుంటిని ॥లక్ష్మీరమణా॥

వాసనత్రియ మను । వార్ధిలో మునిగియు । ద్వేషదోసములా ।
దేలుచు నుంటిని ॥లక్ష్మీరమణా॥

షడ్వర్గచయములు । సంచితజ్ఞానము । సరగున గొనుచునూ । చాల
బాధించెను ॥లక్ష్మీరమణా॥

జననంబనియెటి । జ్వరము జనించియు । మరణంబనునొకా ।
మత్తులో యుంటినీ ॥లక్ష్మీరమణా॥

వేంకటప్రిభురూప । వేదపరాత్పర । శంకరుసేవక । సాధునుపోషకా
॥లక్ష్మీరమణా॥

ధరతాళపురామందున । నిలచిన । దాతవు హనుమద్దాసుని నేలిన
॥లక్ష్మీరమణా॥

---

ఫీల్ రాగం. మోడివాట. ఏక తాళము.

శ్రీనాథా కరుణించరా - అను వర్ణ మెట్టు.

ప॥ గురురాయా । కరుణించరా నీ । మరుగూ జేరినాడనూ ॥గురు॥

చ॥ నాపాపాములన్ని । ద్రుంచుమీ । నీపాద్రిపూజేర్చి బోధ్రివుమీ ॥గురు॥
తల్లిదండ్రీ వీవె యంటినీ । కల్లగాదూ । నమ్మ్యాకొంటినీ ॥గురు॥
అల్లకృష్ణూడ వీవేగా । యిల నన్నూ । బోధ్రివరావుగా ॥గురు॥
అక్కజముగా మరుగూ । జొచ్చితీ । మక్కువతోబోధ్రివుమి త్తరీ
॥గురు॥

జననమరణావనాధీ । యందూ జనక । మునిగీదేలుచుంటిని ॥గురు॥

అహామా వర్తన దుల్పియూ । యిహాపర । సౌఖ్యమిచ్చి బోధ్రివుమా
॥గురు॥

మాధావారాడ్వార్నిధీ । యిందునీభా । వేంకటేశ్వరా ॥గురు॥

హనుమద్దాసూనీమొరా । విని । యాదారించూ ప్రిభువరా॥గురు॥

గీ॥ యెరుక పరిపూర్ణములు రెంటి ♦ నెరుగజేయు
సట్టి శ్రీవేంకటేశ్వరు ♦ నంఘ్రియుగము
పూజసల్పుము నెపుడు బ్రి♦పూర్ణమతిని
శంకలన్నియు విడిపోవు ♦ నింక నీకు.

---

మలయమారుతరాగం — ఏకతాళము.

జన్మ మెందుకు । భక్తిలేని నారా — అను వర్ణమెట్టు.

ప॥ యిట్టిజన్మమూ । యెట్లూగలిగె మనసా ॥యిట్టి॥

అ॥ మట్టూమీరి యిట్టి । వట్టి మాయలాలో । పట్టూబాడి గురునీ
గుట్టూ దెలియలేని ॥యిట్టిజన్మమూ॥

చ॥ మాయ్యాలోజిక్కాకా । మహానీయులను గొలచీ । న్యాయమైన
పరమూ । నందాలేనిబొంది ॥కిట్టిజన్మమూ॥

యోగులా మనుచూవి । యోగామూ దెలియాకా । రాగాద్వేష
మూలా । రంతూలాడుచుండే ॥యిట్టి॥

సంతతంబు గురునీ । స్మరణా జేయుచున్నా । చింతా దీర్చి నిన్నూ ।
చెంతా జేర్చి బ్రోవ్రా ॥యిట్టి॥

విపులమాధవరాజూ । వేంకాటేశ్వరు నెంతో । చపల ముడిగి భక్తి
సలుపనేరనట్టి ॥యిట్టిజన్మమూ॥

హనుమద్దాసుపల్కా । లాదారించి నీవు । మనసూన నిజతపమూ ।
మానాకున్న చాలూ ॥యిట్టిజన్మమూ॥

---

హిందుస్థానితోడిరాగం — ఆదితాళము.

ప॥ శ్రీవేంకటేశ్వరా । సేవకూని గావరా ॥శ్రీవేంక॥

అ॥ శ్రీశంకరా కృష్ణా । శీఘ్రమే బ్రోవుమూ ॥శ్రీవేంక॥

చ॥ వనమూన నకా్రిమూకూ । వశమై గజేంద్రుడూ । పనిబడి వేడా
తా । ద్బాధాను బాపినా ॥శ్రీవేంక॥
దశమూఖు బాధాలకూ । తాళలేక వేడుచూ । నశమా విభీషణునీ।
వసుధీశు జేసినా ॥శ్రీవేంక॥
త్రివిధదీక్షా లెసగా । త్రిప్రసాదా మూసగీ త్రివిధ । త్రివిధాత్రి
వీధా । త్రివిధాము దుల్పుమూ ॥శ్రీవేంక॥
పంచభూతామూలకూ । పరు డంబరీషునీ । వంచానసల్పినా । వాని
నుక్కడించినా ॥శ్రీవేంక॥
వసుధమాధావాన్వయా । వనధికై రావాహితా । భుశ్రీశమొప్ప హను
మద్దాసా । పోషాక సర్వేశ్వరా ॥శ్రీవేంకటేశ్వరా॥

---

దర్బారురాగం — ఆటతాళము.

ప॥ గురునీ స్మరియించావె మనసా నీ దు । ర్గుణమూలు బాయూనే
మనసా ॥గురునీ॥
చ॥ గురునీ స్మరియింపూచూ । పరిపారివిధమూలా । పరుగూలొందిన
నీకు । పర మెటుల ఘటియించు ॥గురునీ॥
యెంతాజెప్పిన విన వదేలా లక్ష్మి । కాంతూడే గతియనవే చాలా।
చింతలన్నియు మానీ । యెంతో వేడుచున్నా । తంత్రావకా యెరు
కాబ్ధి । దాటించు నవలీలా ॥గురునీ॥
పంచతన్మాత్రిలను గూడీ ప్రపంచామాయెను వినవె మనసా ।
పంచావన్నెలుగాకా । మించీ వెల్గెడి పరమూ । గాంచీన నీజన్మ
కడతేరు నిజమూగ ॥గురునీ॥
శంకలన్నియును విడును గాదా గురుడా । వేంకటేశ్వరు జేరరాదా ।
పొంక మలరగ నెంతో । కింకారత్వముసేయూ । ఝుంకువిడు మని
హనుమద్దాసూనీ బోధ్రిచేను ॥గురునీ॥

---

సురటరాగం — చాపుతాళము.

ప॥ యింతకన్న సుఖ మేమె మనసా । చింతనొందనేలా మనసా ॥చి॥
అ॥ సంతతమును శ్రీ కాంతుడె దిక్కనీ । మంతనమున భావంతము విడచితే ॥యింతకన్న॥
చ॥ భేదమేల నీవాద ముడిగి యా । నాదమందు మనసా । మోదఖేద ముల పాదు మల్పి యే । భేదములేని వివాద మొదలిన ॥యింత॥
పెట్టలేదనియు కొట్టినారనా । చట్ట మేదె మనసా । తిట్టుదీవెనలు పుట్టుగిట్టుటలు । గుట్టుగురునిచే । గట్టిగ దెలసితే ॥యింత॥
నిశ్చయంబనకు కాయమదెప్పుడో । నిలువ కేగు మనసా । చెప్ప లేద విను షోడశిమంత్రము । చొప్పున గనియా । చోద్యము దెలసితె ॥యింతకన్న॥
తప్పక జేయుము ద్వాదశిమననము । యెప్పు డేమరకు మనసా । తిప్ప లన్నియును । చెప్ప కేగు యే । తిప్పలజెందని దిప్పుడె దెలసితె ॥యింతకన్న॥
మాధవరాట్కుల సంజాతుండై । మహిని వెలసే మనసా । మేదిని వేంకటప్రభు గురుసేవయె । బాధ నుంచ దని బాగుగ జేసితె ॥యింత॥
ఘుంకరయేలనే హనుమద్దానుకు । శంకదీరె మనసా । కింకరత్వమును జేసిన పెద్దలు । వంకరయెరుకను । వసుధగూల్చె రిక ॥యింతకన్న॥

---

హిందుస్థాని తోడిరాగం — రూపకతాళము.

సామగానలోలా మంచి । సమయము గోపాలా అను వర్ణ మెట్టు.

ప॥ మాటవినవె మనసా నీ । మమత లుడుగు మనసా నా ॥మాట॥
అ॥ వాటమాను మనసా గురు। బాట విడకు మనసా నా ॥మాట॥
చ॥ కాయ ముండు ననుచూ న । పాయ మొందదనుచూ । న్యాయ మార్గమానా నీ । కాయ ముండ బోనా నా ॥మాటవిన॥
నీటిపైని బుగ్గ యిది । నిలువ దనుట యెగ్గా । కోటిమాటలేలా యీా । కూట విడువదేలా నా ॥మాటవిన॥

దేహభ్రాంతివిడచీ యీ । మోహవార్థి గడచీ । సాహసించి జూడా । సహపాటె నీకు యీడా నా ॥మాటవిన॥

నిజముగాదు జగమ్మూ నీ । గజిబిజేల వినుమూ । సుజనబృంద మెల్లా । నిజసూత్రి మంది రెల్లా నా ॥మాటవిన॥

నిక్కమేమి లేదూ నీ । చిక్కుదీసె పాదూ । మక్కువాతో గనుచూ నీ । దిక్కు నీవె ననుచూ నా ॥మాటవిన॥

మూల మేమి లేనీ । స్థూలంబు వదలుకోనీ । మేలుజెందెదానీ । కీలు దెలియు పూనీ నా ॥మాటవిన॥

పలుకపలుకు లేని యే । తలపుకందరానీ । చలువవేడిగానీ యీ । చలనరహితమూనీ నా ॥మాటవిన॥

చింతలన్ని దీరీ యే । చింతలేని దారీ । అంతు దెలుపగోరీ గురు । చెంత జేర రోరీ నా॥ మాటవిన॥

వేంకటేశ్వరగురునిన్ । బలువేడ్కమీర గొలువన్ । శంకేలను హనుమద్దా స్కంక । యెరుక దృంచెన్ నా॥ మాటవిన॥

---

ముఖారిరాగం — ఆదితాళము.

యెపుడు కృపా గల్గునో । యినకులా తిలకా — అనువర్ణం.

ప॥ దశరథరామునీ । దలచవే మానాసా॥ దశరథా॥

అ॥ విను కేలనే మనసా । వినుతిసేయగా రాదా । ససిగాద సేవా సల్పా । సర్వాంతర్యామీ యైనా॥ దశరథ॥

చ॥ పుత్రులు లేనీ వ్యధచే । మిత్రబంధువులు తానూ । పాత్రులై హరినీ గూర్చి । పుత్రికామేష్టి వ్రతమూ । పూర్తిగ దశరథుడూ । పాలుపొంద జేయా గల్గె॥ దశరథ॥

మునిజనాసంఘామూను । మొట్టితిట్టుచూ నుండె । ముఖ్యాఖర దూషణాలా । మొనలంట దృంచియూ । మునియైనగాధిసుతునీ । మోహయాగమునూ కాచే॥ దశరథ॥

ాతినాతీగా జేసీ। ఖ్యాతినొందీనా యట్టీ। భూతలనాథుండైనా।
ురుషోత్తమూనీ పాదా। జ్ఞాతము లెదలో నీతిగా నిల్పుచూ॥ ద॥
శకంఠకుంభాకర్ణా। దండిబలశూరులా। తనయులా పుత్రా
ుత్రా। తగుబంధువర్గామూనూ। ధరణి కర్పాణాజేసీ। దనుజ
ుజూనీ బొరిచే॥ దశరధ॥
వనిజా మాయానీతా। అలసటా లెల్లా మాన్పీ। ననుజ కపిసేనా
ానూ। నవలీల నయోధ్యా। నగరమూ జేరీ ప్రజలా। వగపు
్చి పాలించూ॥ దశరధ॥
వజనులానూ గావా। దివి నుద్భవంబందీ। దీక్షైన వేంకటగురుదా।
్యనామమునూ జెంది। దీనుడౌ హనుమద్దాసుకు। దెలించె నట
వబంధములూ॥ దశరధ॥

---

బేహాగ్ రాగం — ఆదితాళము.

చల్ మోహానరంగా — అనువర్ణ మెట్టు.

ునసా నీతలపు। మానాగదవే। బల్ మోహా మదేల॥ మనసా॥
ునసా నీతలపుమాన। మహిలోనా నీకుసాటీ। మాన్యాల గాంచ
ుకబోనా। బల్ మోహా మదేల। మానాకా బూన పాడి
ానా॥ మనసా॥
్కనీ బోధ నోట। మక్కువాతోటి దెల్పుచు। నెక్కడో
వి తిరిగెద వేలా। బల్ మోహా మదేలా। నిక్కామ తనువు
తోడా బల్ మోహామదేల॥ మనసా॥
ుచాగా యెరుకజగము। మంచీగ నీకు దోచ। పంచాభూత
ె సాక్షి జూడూ, బల్ మోహా మదే। వంచానా లేక నిల్చి
డూ బల్ మోహా మదేల॥ మనసా॥
ో సామానమెనా। యిలగూడా నిలుచుననుటా। కలయందూ
। కాంచన మేదే। బల్ మోహామదేలా। కలకూ యీ యిలకు
ు లేదే బల్ మోహా మదేల॥ మనసా॥

యీావృత్తబట్టబయలై । యేమీా లేదనుచు యెప్పుడు । యేమారా
కాను నుడువు చాలా బల్ మోహ మదేలా । యెరుకాకూ చోటు
లేదూ యీాడా బల్ మోాహ మదేల॥ మనసా॥
మూాలంబూా లేనీ గుర్తూ, మేలూాగా నెరుగు తనువు । నేలీలా
నెరుగ లేనె లేదూ, బల్ మోాహ మదేల । చాలూాగా తెలుసు
కొనుట మేలూా బల్ మోాహ మదేల॥ మనసా॥
మెప్పైనా ద్వాదశీనీ । చెప్పాకా గురుడు జెప్పా । ఛప్పునా తెలిసి
దెలివి లేకా బల్ మోాహమదేల । యిప్పూాడే యేమిలేకపోక బల్
మోాహమదేల॥ మనసా
సంతాకూాటంబె యెరుకా । యింతే నే తెలుసుకుంటే । నంతాలో
లేకపోవ్వూా గదరా బల్ మోాహ మదేల । చింతేలా మేను లే దను
కోరా బల్ మోాహ మదేల॥ మనసా॥
మహినీ శ్రీమాధవరాజూా । మహనీయు వేంకటప్రభునీ । మాానా
సామందు నిల్పి వేగా బల్ మోాహ మదేల । మాటాడాకున్న మేలే
బాగా బల్ మోాహ మదేల॥ మనసా॥
లేకా నే లేనేనానీ లేదే । నా వోటు యీానీ ! లేనికల్లా లేనిపాట
బాడీ బల్ మోాహ మదేల । లేనివాడై హనుమద్దాసు లేడె బల్
మోాహ మదేల॥ మనసా॥

గీ॥ ఆయుధమ్ముగను లేక ని । రాయుధముగ । బవరమందున నిల్చిన ।
బంటుభంగి । కష్టదినములు ఘటియించు । కాలమందు । ధనము
లేకున్న దుఃఖంబె । దాల్చు బుధుడు॥

---

## మనసు బుద్ధి సంవాదం.

నాదనామక్రియ రాగం — ఆదితాళము.

మగడ నీ కేల యీాగండుతనమూా అను వర్ణ మెట్టు.

ప॥ మనస నీకేల యీా వెర్రితనమూా । నీజూటభాటవేమిసూాచె । నా
కేమి భయమూ । నీకేల యీా వెర్రితనమూా॥ మనసా॥

చ॥ పొ్ద్దూ పొడవక మున్నె । పెద్దాభారము బూని । గద్దాచందము
దిరిగె దేలా । మందబుద్ధిలో దూరూ టదేల ॥ పెద్దలాహ్యాల
దూషించ మేలా । కొద్దిగొప్పా నెంచక దిరుగుటేల । బుద్ధిమం
తూల తూలేదవేలా । కర్మబంధంబులో జిక్కి దుర్మరణ మొందూట
॥నీకేల యీవెర్రి॥

మేడీపందూబోలు । చేడేదేహాలాకై । వాడావాడలు దిరుగనేలా ।
దొడ్డమోహావార్థిలో మునిగి చాలా । యెడ్డెదేహంబు విడనాడ
వేల । చెడ్డస్నేహితుల గనుచుండ వేలా । మొండిమొద్దూల సేవించి
గోల । పడ్డ లాభంబు నీకేమి మేలా । గడ్డిపాపైన చవిజూచి కడు
కష్టమొందూట నీకేల॥ యీవెర్రి॥

యెన్నీ జెప్పిన వినక । వున్నా వొస్తువు జాడ । నెన్నా డెరుగావూ
దున్నీలా । మున్ను యెన్నో జన్మలందు చాలా । గన్న ఘన మేమొ
జెప్పూ జాగేలా । పన్ను గడలేవొ తెలిసుండి చాలా । అన్న నీ
వున్న పోకాడ జాడ । లన్ని మన్నన్న మాటాలు జూడ జన్మ ।
లెన్నైనో సాటాగలేరా । అన్ని యన నేల నా మాట । నన్ను
సారించి వినవు నీకేల॥ యీవెర్రి॥

మాయగదా లోక । మాయాచె యిల్లాలు । మాయగదాజూడ
తనయులు । న్యాయభావామ ధాన్యాదిధనములు । వెయ్యి వేలైన
గనరావు కోటలు । నెయ్యి యిల్లన్న రీతౌను తోటలు । కాయ
మేరీతి నిలుచూ నీమాటలు । అయ్య నీరాక పోకాడ యేకాడ
సున్నానో నీకేల॥ యీవెర్రి॥

నిండీయున్నా మురికి । కండాదేహాముాలో । నుండే మర్మము
దెలుపలేదా । ఛండివాసానల్ గనకుండ లేదా । మొండీ యీ
పాణత్రియ మిదువ లేదా । దొడ్డకోటా లేదును గూల్చలేదా ।
దండినదులామూటెని ధాట లేదా । బండసరియైన శతూ్రిల ఛండీ
వేసీ యుండి । కొండాలో నున్నా యూ । కుండాలెందు్ని గంటి

నా కేలనే వెఱ్ఱితనమా । నీచీకాకు విడజేసి చిద్రూపు
నాకేల॥
గనుమా॥
పంచాభూతామూల । పంచాశక్తూలాతో । పంచాకోశాల్. గాన
లేదా । మించి పంచాకర్మల దెలియరాదా । మంచిజ్ఞానాపంచక
మరయ వాదా । నంచి యింద్రియంబుల నణచలేదా । గాంచ
ముద్రాత్రైదింట మేలు రాదా । ద్రుంచ యెరు కేడ నీల్వాదు
గాదా । సంచితంబూల నందాక సర్వంబు తాగాక । యెంచా
వెఱ్ఱి॥
శక్యముగాని యేకాము నొందీన నాకేలనే॥
మిథ్యాగదా జగము । తథ్యామ స్వప్నాము । నిద్రామె సర్వశాస్త్రం
బులు। పెద్దగద్దేసుమీ యెరుక వింతలు । హద్దు గనలేకయున్నార
పెద్దలు । వద్ద నిండున్న యాపూర్ణసాజ్ఞలు । కద్దు ననలేని గనరాని
కొనలేని యీగుర్తు।గన సంతసంబాయె ఘనులేమొ యనుకొనుట
వెఱ్ఱిత॥
నాకేలనే॥
దృశ్యాదృశ్యామాయె । ద్రుక్కూలో ద్రుక్కాయె । వేశ్యా
సాఖ్యంబె యెరుకచేతలు । గాని హాశ్యామహా విను దీని పుట్టుట ।
లేని భాష్యాలె గద దానిగుర్తులు । కాని నభపుష్ప మంచనిరి
వేత్తలు । గాదు విద్యుల్లేఖే యనిరి మాన్యులు । లేనికుక్కుట
దుగ్ధం బనిరి వీరులు । కాదు మేడిపుష్పా లనిరి భావ్యులు । జూడ
యాడాలే దనిరి పెద్దలార్యులు । కూడ యేడూ సంద్రముల మధ్య
ఆడీడ గనుపించి । గనుపించ కేడాకు బోవ్వూనో । యీరేడుజగము
వెఱ్ఱితనము॥
లలో నా కేలనే॥
పరిపూర్ణమందూ యీ । యెరుకున్న దనుకొనిన । పరికించ ఫల
మివ్వరాదా । ధర సరిగా నిల్వాబోదుగాదా । సురవరులా స్వప్న
మంతెగాదా । మరు గెరిగించ తెలిసుండరాదా । చరచరమూలు
యెరుకౌను గాదా । స్థిరపదమే యీయచలంబు గాదా నీ । వరసీ
యరయాకున్న । యమనస్కమే యాను నావాలి పై మాట । నాడే
వెఱ్ఱితనమా॥
టందుకు రాదు । నాకేలనే॥

వసుధా మాధవరాజు । వంశాబ్ధిచంద్రుడా , వరవేంకటపతిభువు లేడా । వారిచరణములు సేవించి వేడా । మరణజననాము లెడ బాప రాడా । భక్తవరులాపాలిట వేల్పు గాడా । యుక్తియెంతో నేర్పు జూపు మూఢా । భక్తిమక్కువతో జేయించు గాఢా , వ్యక్తి లో నినుముంచు ప్రౌఢా । సక్తిగ జూపూడి హానుమద్దాసూ । నాకు దేహీదేహము గాని తెర విట్టుదెల్పిన । సోహామభావామై నుక్కనుక్కకున్న । నాకేలనే వెర్రితనమూ నీ చీకాకువిడజేసి చిద్రూపుగనుమూ॥ యీవెర్రి॥

---

జంఝూటిరాగం — ఆటతాళము.

ప్రాణనాయకా దీనజన శుభదాయకా- అను వర్ణ మెట్టు.

ప॥ మాయ మీాటెడీ । మరుగు గనవే మానసా॥ మాయ॥

అ॥ మాయ యల్ల జగమ్ములు తనమహిమజూవుచు ముంచెగా॥మాయ॥

చ॥ పంతముబూనుకా । పరమగోప్యము జెందకా , సంతతము శ్రీగురుని దలచీ । చింత దొలగెటి సూత్రి మెరుగక । దంతివిధమున విరవీగుచు । దంభ మెక్కువ జేసెయీా॥ మాయ॥

దేహము తానయీా । దేహీ సంబంధించి యీా । మోహారూపక మైనజగమును । వ్యూహాతో గల్పించి చివరకు । దేహీ దేహము విడచి తా నెటు , నేగునో గుర్తించియూ॥ మాయ॥

అండముమొదలుగా । పిండాండమును తాజేసెగా । అండపిండాండ ములును బ్రహ్మాండమంతట నిండి తానే । యుండి యెన్నో పను లమర్చుచు । మండిపోవు టిదేమొ యీా॥ మాయ॥

కోటిసూర్యులా । దీటుగా కనుమిం చిలా । మాటిమాటికి సృష్టి వృద్ధియు । బాటుదప్పక జేసి లయమై । మేటిగా శ్రీహరిని గానక చేటు నొందుచు నుండె యీా॥ మాయ॥

మంతనమందు నా । మార్గమును పొడజూచినా । చింతలనె కోట
లలో జిక్కియు । సంతు దెలసెటి దారి గానక । గంతులేయుచు
చచ్చి బుట్టెడి । వింతజేయుచు నుండె యీా॥ మాయ॥
భేదములేకయూా , ద్వాదశిని జపియించియూా । మోదఖేదములెల్ల
జెందెను । పాటుగా షోడశి యిదే యని। వాద ముడిగియు । పంచ
దశి యను । సాధుసాక్ష్యము వుంచి యీా॥ మాయ॥
బాటను దప్పకా । మేటి నిజగురు జేరుకా । చేటుపాటుల జెందు
యెరుకను । నాటనివ్వ డటంచు దలచుచు । మాటిమాటికి వేంకట
ప్రభు । మాన్యుని సేవించి యీా॥ మాయ॥
వెక్కస మందడే । చిక్కులో బడి గుందడే । గ్రక్కునా పరిపూర్ణ
మిదె యని । నిక్కముగ గురుసాజ్ఞచే గను , మక్కువతో యీా
హనుమద్దాసుని । చక్కగా వీక్షించి యీా॥ మాయ॥

---

ఆనందభైరవిరాగం — ఆదితాళము.

ప॥ గోవింద గోవిందా యనవే । కోర్కెలన్ని వీడీ మనసా॥ ॥గో॥
అ॥ గోవిందుని మది , గోరుచున్నయే । గోలలేదుగద , గోప్యం
బుగ శ్రీ॥ గోవింద॥
చ॥ పంచభక్ష్యముల । పాలుపెరుగులతో । పెంచిన దేహము । మం
చిది గాదని॥ గోవిందా॥
దేహపటిమ చెడి , పోవకమున్నే , వూహాపోహాలు , యుడుగక
ముందే॥ గోవింద॥
యింద్రియవర్గము , వేరే చెరించక । చంద్రసూర్యు లెటో । చద
రక ముందే॥ గోవింద॥
పంచవాయువులు , పాదులు తొలగియు , వంచనజేయుచు । వద
లక ముందే॥ గోవింద॥
భూతము లైదును । భోరున లేచిన । దాతువు లెనుకకు , దా
టని పూర్వమె॥ గోవింద॥

యిడాపింగళల । వివర మెరింగియు, చెడుఘోరణి మది । చేరని సమయమె॥ గోవింద॥

నపరిమితం బగు । నతిపైత్యంబున । కఫముఁ కుత్తుక । కంటక ముందే॥ గోవింద॥

మాట లుడుగు నని । మను స్యులు బల్కే । పాటలు చెవులలో నాటక ముందే॥ గోవింద॥

మంచి తార గా । దంచు బల్కుచును । పంచకో పైటనో । పట్టక ముందే॥ గోవింద॥

యేమి జెప్పెదవు । యెటు వెళ్లెద వని । యేడ్చుచు త్రిప్పెటి । వెత లే నప్పుడె॥ గోవింద॥

తులసిదళంబుల । తోయము దెచ్చియు । త్వరగాతనయులు । పో యక ముందే॥

ఆలుపుత్రిలును । ఆప్తులు బంధులు । నయ్యో యాగదు । యనక పూర్వమె॥ గోవింద॥

గోమయంబును । గొబ్బున దెచ్చియు । సీమముగను క్షితి । నెర పక ముందే॥ గోవింద॥

నలుగురు పట్టియు । నారాయణ యని । యలకువ నవనిని । యూ పక ముందే॥ గోవింద॥

మస్తక మెనుకను । మరి జొన్నలపై । వాస్తువదీపము । వుంచక మున్నె॥ గోవింద॥

యేడుకట్ల మే । నాలో । బెట్టుక । యరుకను చితిలో । వేయక మున్నె॥ గోవింద॥

యెప్పటికైనను । యీలా గా నని । దింపుడు స్థలమున । దింపక ముందే॥ గోవింద॥

కాటిలో తనువును । కాల్చుచుండగనె । కూటిని కాకులు । కుడు వక ముందే॥ గోవింద॥

ద్వాదశి మననమె । దొడ్డగ జేయుచు । షోడశిభావమె । శూన్యం
బనుచును॥ గోవింద॥
పంచదశాక్షరి । పాదుదెల్సుకొన । సంచితజన్మము । యెంచను
లేదని॥ గోవింద॥
వేంకటేశగురు । వీరరూపమును । కింకరతను గస । కీర్తివిస్తరిల
॥గోవింద॥
అహా మొదలియు । యానందము జెందిన । హనుమద్దాసుని । యనం
టిన తనువే॥ గోవింద గోవిందా యనవే॥

---

దేవగాంధారిరాగం — జుల్మతాళము.

యేదిరా బాలకృష్ణా సాధువర్తనంబు నీకూ - అను మాదిరి.

ప॥ వాదమా మానసా । కాదులేదంటినా ॥వాదమా॥
అ॥ భేదమే గురుసేవజేయ । పోదటే నీకరములంటకు ॥వాద॥
చ॥ ఒద్దికాతో జేరి గురూ । సుద్దులెల్ల వినుచునుండీ । కొద్ది గొప్ప
తెలసితెలియక । హద్దుమీర కుండరాదా ॥వాద॥
చక్కనయ్యా నాదూ పలుకూ । మక్కువాతో వింటీవేనీ ।
నిక్కముభవమరణములను । గ్రక్కునా వీక్షింపకుందువు ॥వాద॥
తొల్లి గర్భనరకమందూ । తల్లడిల్లి పొందలేక మళ్ళిజన్మ పొంద
ననుచు । మరిమరి ప్రార్థించి వచ్చీ ॥వాద॥
చాలు నీసరస మింకా । మూలమంతు గాంచితీనీ । బాలకా నిన్ను
బట్టీ । చాలగా బాధింతు జూడూ ॥వాద॥
స్వప్నతుల్యా జగమే యనుచూ । చెప్పి చెప్పి వేసారితీ । చెప్పకేగ
జూచునపుడు । అప్పు డేమి చేయగలవు ॥వాద॥
రద్దివలదూ నీవూ నేడూ । బుద్ధిలో సుబుద్ధిచేతా । పెద్దలు పొడ
గనిన మ్రొక్కా । రద్దుజేతురు నీదు యఘము ॥వాద॥
పండువెన్నెలకన్నా మిగిలీ । నిండి వెల్గుచుండె దానీ । కుండలాగ్ర
మందు గాంచి । యుండె దేవో తెలియలేకా॥ వాద॥

పాడుగా ద్వాదశీనీ । పద్ధతి యేమరక యుండీ । ఖేదమోదమందె షోడశి । పాదు లేదు లేదు యనినా॥ వాద॥
నాగాంతకవాహన మెక్కి । నాగభూషు నుతులొనర్చే । స్వామి కన్న మిన్నయయిన । స్వామి వేంకటగురుని గొల్చు॥ వాద॥
తళుకు బెళుకూ పలుకూ లేనీ । తత్వమె గని తనను మరచి । బహుళమావాస్యశశిగ । బరగు హనుమద్దాసు జేరక । వాదమూ మానసా । కాదు లేదంటినా॥ వాద॥

---

హిందుస్థాని ముఖారిరాగం — ఆదితాళము.

భళిభళీభళీభళీరా శ్రీరామచంద్రా - అను వర్ణ మెట్టు.

ప॥ నిన్నె నమ్మితినయ్యా । శ్రీరామయ్యా । నన్ను విడనాడకయ్యా॥ నిన్నె॥

అ॥ నిన్ను నే నమ్మితి । నీలవర్ణస్వరూపా । కన్ను లెత్తి జూడయ్యా । కరుణించావయ్యా॥ నిన్నె నమ్మి॥

చ॥ సంతతమును నీ । స్మరణ జేయూచూ నున్నా చింతలాబ్ధిలో ముంచగా జేరేనా మనసు॥ నిన్నే నమ్మి॥
మక్కువతో నాకూ। చక్కని వ్రూహాలిచ్చీ। గ్రక్కునా । బ్రోవరావా ఘనశాంతా భావా॥ నిన్నె॥
మంచిమల్లెలలోనూ । మరిజాజిపూలా నుంచి । వంచన లేకా పూజింతూ । సంచితమూ ద్రుంచూ॥ నిన్నే॥
మరువకా నాహృదయూ । మందిరమూన నిల్చి । మరణజననములా బాపవా । మహానూభావా॥ నిన్నె॥
కంటికి రెప్పవతుగా । గాచి నను బ్రోవాకున్నా । నంటి నెవ్వారి వేడకా । నినుగూడుకా॥ నిన్నె నమ్మితి॥
చిక్కచీకాటీ కవలో । చుక్కలకాంతిమించే । చక్కనీ యూపో జ్యోతినీ। సరిజూపీ బ్రోవా॥ నిన్నె॥

యరుకమరుపూల రెంటీ । నెగరజిమ్మీ వేసీయూ । బిరబిరా
నీస్వరూపాము । భేషూగ జూపు॥ నిన్నె॥
ఖండఖండాములూగ । గనుపించె బ్రహ్మాండామూ । యుండదు.
నిజా మనూచూ । చెందూచూ దెల్పా॥ నిన్నె॥
మేనుమూలంబులేకా । మిక్కిలి వెలిగీ మలగా । దేనిని జెంది
యుండూ । దె హెచ్చట నుండూ॥ నిన్నె॥
యిలలోన నీరూపూ । వేంకటగురులే యనుచూ । వేనోళ్ళ నుడు
వూచుంటీ । విడువబో కంటీ॥ నిన్నె॥
డిక్కెవరు హనుమద్దాసుకు । నిక్క మీవసుధయందూ । నెక్కన
మెందుకయ్యా । విడువాలే నయ్యా॥ నిన్నె॥

---

నాదనామక్రియరాగం — ఆదితాళము.

తనయ నే నెటూ లోర్తురా — అను వర్ణమెట్టు.

ప॥ యెచ్చటా నుంటీవో । వోగురూరాయా నీ॥ వెచ్చట॥
అ॥ యెచ్చటా నుంటివో । స్వచ్ఛమా రూపముతో । వచ్చి నా
కనులాపడ । వుచ్చరించూచూ నున్నా నీ॥ వెచ్చటా॥
చ॥ భూమియగ్ని వాయు । వాకాశజలమూలూ గాకా । స్థావరా
జంతూజాలా । సర్వస్వరూపుండావై నీ॥ వెచ్చటా॥
సకలవృక్షములాయందూ । సర్వపర్వతమూలాలో । చలనరహితూ
డావై । చెలియించుచుండి నీ॥ వెచ్చటా॥
సకలవ్యాపకుడావై నా । వికలత్వమొదలింపా । నిక రావే గురూ
రాయా । నెలమి నక బ్రోవాకుండా నీ॥ వెచ్చట॥
అంత నీరూపా మానీ । సంతతము నమ్మియుండా । యింతేమి
పాపమో । యిట నన్ను యీడ్చితెచ్చి నీ॥ వెచ్చటా॥
వేంకటగురురూపమునా । శంకోదలి వైకుంఠ నగ । మింక వీడి
రావా । హనుమద్దాస్మిగుల బ్రోవకా నీ॥ వెచ్చట॥

శ్రీ విభవనామసంవత్సర ఆశ్వీజ బ ౩౦ సోమవారం పగలు 2 గంటల సమయమున వైకుంఠము కొండపై నిల్చు వేంకటేశ్వర స్వామి నా గురుస్వరూప మటుల బొడగన మనవితో సమర్పించుకున్న కీర్తన.

---

దేశీయతోడిరాగం — రూపకతాళము.

గానలోలా గావ వేమిరా — అను వర్ణ మెట్టు.

ప॥ నిన్నుజూడా నోపవై తివా । వో గురురాయా॥ నిన్ను॥

అ॥ నిన్నుజూడా నోపవై తివ । నిఖిలభువనసంరాక్షకా । కన్నులిచ్చి మార్చ్చిబూనుట । కారణ మేమో దేవర । గనుగొన నే నోపు దునా॥ నిన్ను॥

చ॥ నీదుస్మరణజేయుటాకై । నిల నుద్భవింపజేసి నన్నూ । నెల్లదుఃఖం బొనరింపా । నేమీా న్యాయము నీ కిది । నిర్గుణ నిరంజన హరి॥ ని॥
కట్టెలేక పిడక లేక । నెట్టు నిల్వదో యగ్నియటులె । చట్టువలెను నాదుతనువు । గట్టిగ నిల్పకయున్నా । నెట్టుల నిక జేరుదునో॥ ని॥
పాదనేత్రిపాణిచెవులే । పనులు జేయ గల్పించితో । బాగనుంచు వాటిబలము । భవమొందను నే నిక వో । భయరహితా భవ ఘారణా॥ నిన్ను॥
తొల్లి నాదుజన్మంబులె । కల్లగావ నుల్లసిల్లా । నెల్లవేళ నిల్చు భ్రాంతి । చెల్లను జేయక దానిని । మెల్లగ దీసేసితినో॥ నిన్ను॥
మాధవరాజోత్తమ యీా । మహిని వేంకటేశ్వరప్రభో । భేద మేల హనుమద్దాసుని । ప్రేమతో బ్రోచీ నీయం । దేమర కెప్పుడు నిల్పూ॥ నిన్ను॥

విభవనామసంవత్సర ఆశ్వీజ బ ౩౦ సోమవారం సూర్యగ్రిహణపర్వము లగాయతు. కంఠ్లకు పూర్తియైన మనక లేర్పడ యీా దాసుడు శ్రీగురుమూర్తిని ధ్యానముచేసి వ్రాసుకున్న కీర్తన.

## మధ్యమావతి రాగము — ఆదితాళము.

మాధవామామామాసుందారదనా — అను వర్ణమెట్టు.

ప॥ కృష్ణానీవేలారావె । కృష్ణా దేవాకీతనయా॥ కృష్ణా॥

అ॥ కృష్ణకృష్ణ యని , కోరి పిలిచితే । కష్ట మేల నను గాంచి పలుకవు టకు॥ కృష్ణా॥

చ॥ నీలాస్వరూపా దివ్యాతేజా । నిం కేల జాగూ , పాలూమీాగాడా దె స్సీదేరా । నీ కేలూ జాచీ చాలూ చాలానీ మొక్కావేరా । నీ లీలా సూపూ బాలా శ్రీవేణూగానలోలా , మేలుచూపి భవ జాలము దుంచను । మూలమీావెగద ముద్దులకృష్ణా॥ కృష్ణా॥
కన్ను లిప్పాకామున్నె వేగా , చన్నూబా లివ్వా । నిన్నూ భూ తాకి జేరరాగా । తిన్నాగాజూచీ । మిన్నాసుండీనా దానవి బాగా । అన్న తాగు మని । చన్ను లివ్వగా , చన్నుగోరిలి దాని ప్రా న్నన జంపిన కృష్ణా॥ కృష్ణా నీవేలా॥
మూడూనెలాలా । పూర్తివయ్యా । ఖండీ శకటూనీ , పిండీగ భూమీా బడదన్నియూ । యాడాదీరాగా , మండీ తృణవర్తుని మెడ చీల్చియూ । బండా నిగ్గట్టా । దుడీ మద్దూలా ధర గూల్చియూ । మెండుగ గోవుల మేలని గాచుచూ । మొండి బకుని జీరి । తుండలుజేసినా కృష్ణా॥ నీవేలా॥
దాటీతీరికూటస్థానసూటీ । దప్పాక నిన్నూ । నాటీ ననుదినమూ గొలువా మేటీ । వాటీగా నీదూ పాదాపద్మము లందెలు నేబెట్టి । మాటీకి నీదూ మహిమా నే కనులా జూచీ యిట్టి । బాటతప్ప కను బాగుగ గొల్చుచూ । తేటగు హారతి తీవరిత నివ్వా కృష్ణా॥
వర్ణానా జేయూచూను నీదూ । కర్ణంబులాకూ । భర్మంటు జోడూ । బెట్టితిగాదూ । కంఠంబూనందూ । కంటే కాసూలూ నిడగ వాదూ । మర్మం బదేలా మొలకూ । మొలతాడూ వుం చితిరాదు । మణులా కిరీటం । మస్తాకమందూ నిల్పితి లేదూ ।

రట్టుజేయుచును । గట్టిగ నిల్వా నికా । కొట్టితిట్టితిన నెట్టితినె శ్రీకృష్ణా॥ నీవేలా॥

దాసోహ్మా త్కమలాపురనివాసా । సంతాతా సుప్రకాశా । శ్రీ గురూవేంకటేశా । దోసా మేమయ్యా । దోసీ లొగ్గితీ నీకు యీశా। వేసాటామాన్పా క్లేశా । భవబంధావినాశా । ఆశపాశముల దీసి వేయు నీ దాసుడ। హనుమద్దాసుని నేలను కృష్ణా॥ నీవేలా॥

---

జంఝూటిరాగం — ఆదితాళము.

చల్ మోహనరంగా — అను వర్న మెట్టు.

ప॥ పను లున్నా వనుచు మిమ్ముల । పలుమారూ సౌజ్ఞజేయా పంతం బాదేల । పక్కకు జేరా. వోగోపికలారా । పరకాంతాగూడ మేలనుకోరా॥ పనులున్నా॥

చ॥ పణతూల్లా జూచి యింతా । పలచానా జేయబూనా । పదముల కూ పైన మబ్బెనయేరా । వోముద్దులకృష్ణా పణతులమే మాతో పనిలేదేరా॥ పనులున్నా॥

పను లేమీ గల్గకున్నా । పల్కేమీ లేదటంచూ । పతిసతులా జూడకుందుర యేమే । వోగోపికలారా । పరభావా మేము దెల్య రదేమే॥ పనులున్నా॥

యేమేమీ మించిపల్కా । యిలలో నీమాటలన్నీ । యిల దోచీ నెటుల జేరెద మోయీ । వోముద్దులకృష్ణా । కలపోల్కే కాంత సుఖ మనవోయీ॥ పనులున్నా॥

కలలో గన్పట్టు కాంతకు । యిల కాంతా కెంచిజూడా । యేమేమీ హెచ్చుతగ్గులు లేవా । వోగోపికలారా । యిల కాంతా నెంచ గూడీ పోవా॥ పనులున్నా॥

గూడుగూమం చను టదేమో । గుట్టూ దెల్పాకయున్నా । గోప్యౌ సౌఖ్యమ్ము నీ కెటుగల్గీ । వోముద్దులకృష్ణా । గోపీవల్లభులు గాంచెదరేమో॥ పనులున్నా॥

గాంచాగల్గాన దేమొ । గనుగొన్నా నిల్చే దేమో । ఘనవేంకట
గురుడ నంచని వినరే । వోగోపికలారా । ఘట్టిగా నన్ను జేరా
లేరే॥ పనులున్నా॥
జూటామాటాలు గావ్వా । జూపూడీ హనుమద్దాసుని । సూటి
దప్పాక బోధించినవాడా । వోముద్దులకృష్ణా । సుఖమేమో జూపి
నిల్వావె మీాడా॥ పనులున్నా॥

---

జంఝూటిరాగం — జుల్మతాళము.

మానరయ్యో మానరయ్యో — అను వర్ణమెట్టు.

ప॥ హరిహరా యనవె మనస । యనిశమూ యేమరక నీవు॥ హరి॥
అ॥ హరిహరులకు భేదమనెడి అల్పజనులపొందుజేయక॥ హరి॥
చ॥ భుజగశయనూ డనగ నెవడో । భుజగభూషుం డెవడో వీరి ।
నిజము దెలియనట్టి సుజన । బృందామూతో కలసిమెలగక॥ హరి॥
వైష్ణవమత మెక్కు వనుచు । వాంఛతో చక్రాంకితముల । వరు
సగాను వేయు శ్రేష్ఠు । వరులచెంత జేరక నీవు॥ హరిహరా॥
విష్ణ్వీశ్వరభేద మున్నా వీరవైష్ణవం బదేమొ । సృష్టిస్థితిలయపను
లకు చోద్యం బగు నెవ రుందురో॥ హరిహరా॥
హరిని గొల్చేభక్తులకూ । అన్యభేద మెటులగల్గూ । సరసంబున
భూతదయా । సరిజూడని జనులగూడక॥ హరిహరా॥
అంతవై దీకంబెగదా । మంతనమున తరచిచూడా । వంతులకై
స్వయంపాకము । వొండితినే దొరల గలయక॥ హరిహరా॥
శివమతమే మాదిగొప్ప । శివశివ హరి దలచ మనుచు । శవము
లావలె నోరుమెదప లని। శైవజనులగూడి చెడక॥ హరిహరా॥
పంచరంగులరాతిగుండ్ల । పనివాండ్లే జేసియుండా । మంచిదీశ్వర
లింగ మానీ । మమతతో ధరియించబోక॥ హరిహరా॥
చేతిలోనా నిల్పి లింగము । చిత్తమునకు సిద్ధిలేకా । రాతి గడుగ
నీరు దాగె । నీతిపరులస్నేహముంచక॥ హరిహరా॥

మతభేదము లుంచక నీవు । సతత మెంకట గురువు దెలిపిన ।
హితమా ద్వాదశినియందు । యేపార్ద్దును గలసియుండియు॥హరి॥
ఇప్పుడూ మరెప్పుడైనా । యెన్నకు హరిహరులభేదము । చెప్పి
నాడు హనుమద్దాసుడు । యెప్పుడు యిది మరువక నీవు॥ హరి॥

---

బేహాగ్ రాగం — ఆటతాళము.

పరమేశ రక్షించవే పాపవినాశ — అను వర్న మెట్టు.

ప॥ స్థలమేదో దెలియలేవే మనసా నీవు॥ స్థలమేదో॥

అ॥ స్థలమేదో దెలియా । స్థిరమేది నీకూ । నిలనమ్మిదిరుగుచున్నా ।
నిశ్చయమూగ॥ స్థలమేదో॥

చ॥ ఆరింటిగెలచీ । యారింటివిడచీ । యార్గూ రేటుల నేగిరో । యది
స్థిరమె యనక॥ స్థలమేదో॥
అయిదూనమ్మకనూ । అయిదు నివుగాకా । అయిదింటిజూచి విడ
కా । యానంద మొందక॥ స్థలమేదో॥
మూటీని విడచీ । మూటీని గెలచీ । మూటీలో రెండుగాకా ।
మొద లెరుగలేక॥ స్థలమేదో॥
రెంటిజూడకనూ । రెంటీనంటకనూ । రెంటీసందున నిల్పకా ।
రేబవలుగాకా॥ స్థలమేదో॥
వకటి నమ్మకనూ । వకటీ వొప్పకనూ । వకటేమి గానీ దనీ । వద
లక యున్న॥ స్థలమేదో॥
జాతీని విడకా । జాతీ నేమరకా । జాతీభేదము లుంచకా । జాతంతు
గనకా॥ స్థలమేదో॥
మాధావరాజూ । మావెంకట గురునీ । మరిమారీ గొల్చు
చున్నా । మర్మంబు గన్నా॥ స్థలమేదో॥
ఆ రీతిగోడుతనూ । హామమన్నందు నీవూ । రక్తితో నిలువకున్నా ।
రాకున్నా యున్నా॥ స్థలమేదో॥

జంఝూటిరాగం — జుల్మతాళము.

నరకబాధ కోర్వజాల నోపరాత్పరా — అను వర్ణమెట్టు.

ప॥ గర్భనరక మందజాల । నిర్గుణాకరా యీ । దుర్భరంబు గీసివేరా హరాహరా నే॥ గర్భనరక॥

అ॥ గర్భనరకముంచీ నా । యార్భాటంబు ద్రుంచీ నీ । దర్భస్థలము కంచి బల్ । నిబ్బరంబు వుంచి నే॥ గర్భనరక॥

చ॥ యెంతో వేడినారా నా । చెంత నిలువ వేరా నీ। కెంతో పంతమేరా నీ । యంతు దెలియ లేరా నా । చింతదీర్చిపోరా యీ।దెంతో భారమేరా నే॥ గర్భనరక॥

మాయదేహమయ్యా నా । కాయ ముండదయ్యా యా।న్యాయపు మాదు నయ్యా నన్ । బాయకుండ నయ్యా యీ । సాయ మీవు జెయ్యా । వెయిసార్లు మొక్కెనయ్యా నే॥ గర్భనరక॥

పచ్చిచర్మపుతిత్తి । పసలేని తనువు యెత్తి నే । వచ్చి నిన్ను బత్తి యొనరించకున్న మిత్తి । నన్ బాటి దుంచె కత్తి నే॥ గర్భనరక॥

యొంటివాడ నంటి నన్నుంటి యుండు మంటీ ము।క్కంటి వేల్పు నంటి నా।యింటికే రమ్మంటి నిన్ । నంటి నిల్పు మంటీ నే॥ గర్భ॥

మోహవార్ధి ముంచ యీ । ద్రోహము నా కుంచా నీ । స్నేహా లేమొ గాంచా నా।కూహ లేదు మించా నా । సాహసంబు దెంచా । సరిదైన మీవే నెంచా నే॥ గర్భనరక॥

ఆర్తజనులపాల యా।కర్తవా సుశీలా నీ । కీర్తనలే చాలా నే । నర్తన జెయ్యాలా నా । వర్తన యేమాలా । వర్తించునో నీలీలా నే॥ గర్భనరక॥

దండివాడవుండీ నీ । యండ జేర్చకుండీ యీ । కొండితనమే మండి యీ । రండి మొరక ఛెండి లే।కుండ చేయరాండీ యమ । దండ కోర్వ నండీ నే॥ గర్భనరక॥

వేంకటగురురూపా దుస్సంకట హర దీపా నీ । కింకరుని రాపా
యే । వంక లేను భూపా నీ । పంకజముల జూప । పని చాలులే
ప్రతాపా నే॥　　గర్భనరక॥

చూపు నీదు శక్తి నీ । ప్రాపు నా కనురక్తి నన్నే । లేపి నీదు
భక్తి నే । జేయు మంచి వ్యక్తి హానుమప్ప కొసగు ముక్తి । హరి
హరి లేదా । సక్తినే॥　　గర్భనరక॥

శ్లో॥ సప్తకోటిమహామంత్ర । చిత్తవిభ్రమకారకః
ఏక ఏవ పరో మంత్రో । గురు రిత్యక్షరద్వయం.

---

మధ్యమావతిరాగం — ఆదితాళము.

పువ్వులు ముడిచేటి పుణ్యాత్ములారా — అను వర్ణమెట్టు.

ప॥ యీయిల్లు నమ్మకే । యిల వెర్రిమనసా॥　　యీయిల్లు॥

అ॥ యిల్లూ నమ్మిన నీదు । హితు లేరె మనసా ఛీ॥　　యీయిల్లు॥

చ॥ ఏకో నారాయణునీ । యెన్నావె మనసా । యెన్నినా నీజన్మ ।
సున్నానె మనసా ఛీ॥　　యీయిల్లు॥

నేత్రాయుగచలనామూ । నిలుపావె మనసా । నిల్పీన నీ వెందూ ।
నిలువావే మనసా ఛీ॥　　యీయిల్లు॥

నాతల్లి నాతండ్రి । నాతాత లవ్వా । నాభార్యా సుత హితూలు
నవనీలో గలరా ఛీ॥　　యీయిల్లాలు॥

అష్టా పుష్పము లాతో । యర్చించు మనసా । నిష్టాగ పుష్పంబు
ల।నీకూ దెల్పెదనూ॥　　యీయిల్లా॥

హింసా జేయకు ప్రథమా । యీపస్నిత పుష్పా । కంసారికర్పించి।
కడురోయు తనువూ ఛీ॥　　యీయిల్లు॥

యింద్రియ నిగ్రహామె । వెదకూ రెండవదీ । వెదకి యీపుష్పంబు।
విజ్ఞాన కొసగీ ఛీ॥　　యీయిల్లు॥

సర్వాభూతములా దయ । సల్పూ మూడవదీ । సాంబశివ్వాని వేడే ।
పరసూన కిచ్చీ ఛీ॥ యీాయిల్లు॥
నాల్గో పుష్పంబౌను । ననయూము క్షమయూ । నవనీత-చోరునాకు ।
నందించి మ్రొక్కీ ఛీ॥ యీాయిల్లు॥
శాంతాపుష్పం బైదు । చింతేల మనసా । మంతానంబున వేగ ।
మాధవున కొసగ ఛీ॥ యీాయిల్లు॥
దానాధర్మం బేల । దమ మారో పువ్వ । దానామర్మము దెలసి ।
ధర్మంబె యొసగీ ఛీ॥ యీాయిల్లు॥
తర్కించ పనిలేదు । తప మేడో పువ్వూ । తర్కించకు గోవిందుకు ।
తత్త్వాల మిచ్చీ ఛీ॥ యీాయిల్లు॥
యిడుమూ లెన్నొచ్చీన । విడకూ సత్యంబూ । యిదే యెన్మిదో
పుష్పం । బెయ్యేల మనసా ఛీ॥ యీాయిల్లు॥
యీాపుష్పములతోడ । యింపూగ గురునీ । యేప్రొద్దు పూజిం
చుచు । యిహభ్రాంతు లొసగీ ఛీ॥ యీాయిల్లు॥
అచలూ లెల్లాదూరో । అతిజీవ్వుల జంపా । అన్ని జీవులె యాత్మ ।
యతడే దేవుండూ॥ యీాయిల్లు॥
మతభేషజముతోడ । మడిగట్టితి ననుచూ । వెతజెందె జీవులాను
యిన్నినీళ్ళయవా ఛీ॥ యీాయిల్లు॥
కన్నాది తిన్నాది । విన్నాది సున్నా । వున్నా దేమో జూడు వట్టిది
యెరుకా ఛీ॥ యీాయిల్లు॥
అభిమానమ్మూలు । జ్ఞానాగ్నిలో పేల్చి । యావాలిముచ్చాటలు ।
యేలే గమనించా॥ యీాయిల్లు॥
తరువ్వూలు నా త్రైపుడు । తనకూ లే వనుచూ । తప్పక శోడాశి ।
తలపూ గమనించీ ఛీ॥ యీాయిల్లు॥
నాలూగుచేతూల । నైక్యంబు జేసీ । నామూరూపగోత్రాములు
నట్టేట గల్పీ ఛీ॥ యీాయిల్లు॥

వేంకాటగురుడై న । యీాద్వాదశి యుండే । యేడే హానుమద్దాసు ।
వెదకీ జూపించా ఛీ॥                                                యీాయిల్లు॥

ఉ॥ నీదయ గల్గగాదె యిపు ♦ డెన్ని యపాయము లుద్భవించినన్
పాదును లేపి వాటి నెటొ ♦ బారగదోలితి వౌగదయ్యా నీ
మోదము జూపి యిప్పుడె మ♦ముర్కి దయ నేలగ రాదటయ్యా నీ
పాదముల్కి నుతింతు కడు♦పాపుడ గాను నృసింహ ధీవరా!

---

నాదనామకిృయరాగం — జుల్మతాళం.

యోరందకాడ బంగారిమాామా — అను వర్న మెట్టు.

ప॥ మెరుకగుట్టూా దెలసీ చచ్చీ । యెల్లకార్యము లెల్ల జేయ । యేమి
రా యా పాపపుణ్యములూా । వోమాాయజీవా । యేమిరా యా స్వర్గ
నరకములూా॥                                                మెరుకగుట్టు॥
మాాయతనువూా । జేయుపనులూా । మాాయమాానని తలచకున్నా ।
న్యాయమైనా మార్గ మబ్బేవా । వోమాాయజీవా । మాాయపను
లకు భీతిజెందేవా॥                                                మెరుక॥
లేవురా సుఖకష్టమూాలూా । లేవురా మోాదఖేదమూాలూా । లేవురా
యా భేదభేదములూా । వోమాాయజీవా । లేవురా పరధాతిృ సౌఖ్య
ములూా॥                                                మెరుక॥
అండలేని జగము యెప్పటి । కుండబో దని యెంచలేకా, దండి
భాృంతుల కెల్ల జిక్కేదవా । వోమాాయజీవా । మొుండిమమతల,
మొుదలె దుృంచావా॥                                                మెరుక॥
మొుద్దుముండకు బుద్ధిజెప్పా । పెద్ద లెంతో శృద్ధజేయా । మొుద్దు
ముండకు బుద్ధిగల్గూనా । వోమాాయజీవా । మొుద్దుముండకు మొుదలె
జెప్పకురా॥                                                మెరుక॥
ఖేదభేదము యుంచబో కని । మోాదమూాతో । ముండను గలయ ।
ముండభేదము లొాదవి గలసేనా । వోమాాయజీవా । ముండజన్మమె ।
ముండకొాచ్చునురా॥                                                మెరుక॥

ముండగర్భము ద్రుంచివేసే । మూలమేదో దెలియలేకా , నిండు
భ్రాంతిలో । నిలచియుండెదవా । ఓమాయజీవా , మొండికర్మము
యెరుక॥
లెల్ల విడలేవా॥

బుద్ధిలేనీ దానితోనూ । హద్దుమీరే పనులు జెప్పా , హద్దుమీరక
రద్దిజేసునురా । ఓమాయజీవా । దిద్దజేసే పద్ధతుంచకురా॥ యెరుక॥

మూటిమూటీ మీటివేసీ । మూటిగలసేబాట దెలిసీ । మూటి
మూటికి భీతిజెందకురా । ఓమాయజీవా । మూటిదాటీ బోటిగల
యెరుక॥
యూరా॥

మింటిమంటీ కంటి కెన్నటి । కంటకున్నా యింటిదానిలో । జంట
లేదని । నంటియుండారా । ఓమాయజీవా । తంటబాసీ యుంట ।
॥యెరుక॥
నిజమూరా॥

ముండ మోహమూ । పండిలేచీ । దండిగానూ గాంచెవాడూ ।
పుండరీకాక్షుండెయాగాకా । ఓమాయజీవా । నిండు ఘటములె
యెరుక॥
నిక్క మొ చ్చనుచూ॥

చక్కగా శాస్త్రంబులెల్లా । నిక్కమానని బల్కుచుండెను ।
నిక్కమే యాముక్క గాదనుచూ । ఓమాయజీవా । నొక్కి
యెరుక॥
దెల్పిన । మక్కువతో వినదూ॥

గాంచవల దని పల్కెపల్కూ । లెంచ నీకూ మంచిలే దని । మించె
ప్రేమతో మెలగబోయిననూ । ఓమాయజీవా । కించగుణములె
యెరుక॥
యెంచె । ముండౌరా॥

ఆగుమాలినముండతోనూ । బాగుగానూ రతిని జేయ । రాగద్వేష
ము లందె నిలచునురా । ఓమాయజీవా । రాకపోకలె । దాని
యెరుక॥
కుండునురా॥

రాకపోకలు లేనిదానితో । రాత్రిపగలును గలసి యుండా । నాక
సౌఖ్యమె నందబోవూనా । ఓమాయజీవా । నాకసుఖములు నమ్మ
యెరుక॥
బోకూరా॥

నిలలోగల్గూ భ్రాంతులెల్లా । నిక్కముగా దీర్చి పోగా, మక్కువాదే నందు నిలువదురా । వోమాయజీవా । మక్కువదలుచె మిక్కిలౌ పనిరా॥ మెరుక॥

బట్టబయ లని గుట్టుదెలసీ । చట్టువలెనే గట్టిగాను, దిట్టముగా యున్న చాలూరా । వోమాయజీవా । బట్టబయలే స్పష్టమౌ గదరా॥ మెరుక॥

లేనిషోడశిగుట్టు దెలసీ । పూని ద్వాదశి యందె నిలువా । లేని షోడశి లేక పోవ్రూరా । వోమాయజీవా । లేనిదే లేదనుచు నమ్మారా॥ మెరుక॥

సాటిసాటీ గురుడు దెల్పిన మాటయిదెరా । బాట దప్పక కోటిసా ర్గిదె తేటపరచారా । వోమాయజీవా । కోటిమార్గకు । మేటిజ్ఞ ప్తుంచూ॥ మెరుక॥

కులముచెడ్డది గుణము లేదని । గుణముగల్గూ వార లనగా । గుణము లుండిన । చెడని కులమేరా । వోమాయజీవా, చెడ్డకులములు । చెడును దావ్రూరా॥ మెరుక॥

లోకమందరు మెచ్చ రనుచూ । లోభగుణముల మానకున్నా । లోకతీతుని జేరి నిలచేవా । వోమాయజీవా । లోకదూరులు రాక యుందూరే॥ మెరుక॥

లోకనడవడి తోటి నడువక । లోకనడతను మించినడువక, లోకమందరితోటియుండీనా । వోయమాజీవా, లోకమునకే । రాక యుంటావే॥ మెరుక॥

రానిపోనీదానిలోనూ । లేనిదానీ లేక జేసీ, రానిపోనీదానిలో గలసీ । వోమాయజీవా । లేని దిప్పుడె లేదనీ దెలసీ॥ మెరుక॥

యొంటి స్తంభము మేడపైనా, జంటనాగాస్వరము యూదే । చంటి పిల్లను కంట జూడకురా వోమాయజీవా । కంటిచూపులె మంట గలయును రా॥ మెరుక॥

వేడ్కలేకా వేంకటగురునీ। కోర్కెవీడీ గొలువకున్నా వేడ్క జగ
ములు। యెటుల దొలగునురా। వోమాయజీవా। చూడ్కిచూ
డ్కలకంద కుండునురా॥ యెరుక॥

హద్దుపద్దూ హనుమద్దాసుకు। వద్దయుండీ యుండకేగా। శుద్ధిబుద్ధీ
యేల నిల్చునురా। వోమాయజీవా। హద్దుయుండని, పద్దు దెల
సెనురా॥ యెరుక॥

---

మోహనరాగం — ఆటతాళము.

దాశారథివంటిసరిదైవమేడే — అను వర్ణమెట్టు.

ప॥ నారాయణ నీనామము। పారాయణ జేసేదను॥ నారా॥

అ॥ ఘోరదురితములనెల్ల। బారాదోల రాదా వేగా॥ నారా॥

చ॥ యిలభ్రాంతులలోనా జిక్కి। యెంచానైతి నీనామము। కలకాల
మీమాటలు నీ। కడుపూలో నుంచాకుము॥ నారా॥

నొందజాల భవబాధ నా।డెందామున భీతిగల్గే। మందిమాట
లినకా నన్ను। తొందారగ నేలా వేరా॥ నారా॥

యెట్టి ఘోరపాపీయైన। గట్టిగ నీనామమే। పట్టి స్మరియించె
వానీ। దిట్టాముగ బ్రోతూ వట॥ నారా॥

ఆశాలెల్లదీసి నీకు, దోసిలొగ్గితి నో, యీశా। జన్మనొందాకుండ,
నాశానము జేయూ తండ్రీ॥ నారా॥

చింతలెల్లా వీడి నీ।చెంతా నే నుంటినీ। పంతమేలవీడి రా। యింతా
జాగేలానుర॥ నారా॥

శ్రీ వేంకటగురురూపా, చిత్ప్రకాశా భూపా। రావే హనుమద్దా
సుని, రక్షించను యీక్షణమె॥ నారాయణ॥

---

జంఝూటిరాగం — జుల్మతాళము.

బ్రాలు డెందూ గానరాడె కాననంబునా — అను వర్ణమెట్టు.

ప॥ మాయతనువు నమ్మబోకుమా । జీవమా యీ॥ మాయ॥

అ॥ పాయరానీ భ్రాంతులాలో । బడీ పోకుమా యీ॥ మాయ॥

చ॥ భేదభేద మేదె సేదు । భయము బాయుమా । మోద ముంచకె
పనులయందు । మోహ మీడుమా యీ॥ మాయ॥

చపల త్రిపుటిరహిత । మందియుండుమా । విపరీతపు భ్రాంతి
చర్య । విడచి యుండుమా యీ॥ మాయ॥

పదిరెండూ బీజములలో । పండియుండుమా । పదియారూబీజము
లను । పలుకాబోకుమా యీ॥ మాయ॥

కలలో జూచు తనువు లెపుడు । గట్టిగుండునా యీ । యిలసామ్రా
జ్యమింతెగాదె । యెరుగు నాయనా యీ॥ మాయ॥

బయలులోన బయలు దెలియ । బయలు పీవెగా । బయలు బ్రహ్మ
గాదె జూడ । భ్రాంతిదోచెగా యీ॥ మాయ॥

వేంకటగురుసేవ సీవు । విడువ బోకుమా । శంక లేదే హనుమద్దా
సుకు । నింకా జూడుమా యీ॥ మాయతనువు॥

---

శంకరాభరణరాగం — ఆదితాళము.

యేర తనయా లోహితాస్యా — అను వర్ణమెట్టు.

ప॥ మాట వినవే । మాయమనసా । బూటకంబున కురికెదేలా॥ మాట॥

అ॥ చేటుగల్గూ తెలియు మనసా । మాటిమాటికి జెప్పనౌనా॥ మాట॥

చ॥ కంటిపాపలోన యుండే । నంటి సూక్ష్మద్వారమూలో । వొంటి
చిన్మయు గలసి నీవై । తంటబాయుము । తాల్మితో నా॥ మాట॥

ఆరుమేడల యెక్కు మెట్లూ । దారి గురుచే దెలిసి నీవ్వూ । మేలుగా
యా । యేడో మేడలో । బాల నందీ భ్రాంతివిడ నా ॥ మాట॥

పాపహారమా । కోప మిడచీ । యాపాజ్యోతిలో । నైక్యమండీ ।
తేపకును వైరాగ్యముండే । దివ్యస్థలమూ । దెలియు కొరకై ॥
మాట॥

నిదరివిడి నీనిర్నిదరిలోనా । భదరిమూతో భయము లేకా । నిదరి
లోకం బిపుడె విడినా । సద్గురునియెల్లపుడు గలయా॥ మాట॥

వేంకటేశ్వరప్రభుని మించు । వేల్పు లెందూ లే రటంచూ ॥
శంకలేకా హన్మమద్దాసనె । చక్కనీ పలు కిపుడె వినినా॥ మాట।

---

ఫీల్ రాగం — జుల్మతాళము.

బంతులాడుదాము రావె । పణతి జానకీ — అను వర్ణమెట్టు.

ప॥ దైవమా మమ్మెల్ల నిపుడె । దయతో బోధివరా । నీవుగాకా
వేరెవ్వారీ । యిలలో లేరు రావో॥ దైవమా॥

చ॥ బాలుర మేమయ్యా మాకు । భయము బాపరా । చాలగా నిను
నమ్మియుంటిమి । సామీ వేగ రావో॥ దైవమా॥

యెన్నోసార్లు నిన్నరాత్రి । యెల్లపాఠముల్ । నెంతోజదివి యుండి
వాని । నెమ్మదుంచరావో॥ దైవమా॥

మేలుగుణము లందు మమ్ము । మెలగజేయరా । చాలవిద్యలొసగి
మమ్మూ । సాకి బోధివరా వో॥ దైవమా॥

యుదయమందు బడికివెళ్ళె । యూహ లివ్వరా । ముదముతో నీ
పదములాకు । మ్రొక్కెదమయ్యా వో॥ దైవమా॥

దేహబలము మాకు నిచ్చి । దీనుల గాచీ । యూహామారకుండ
జూచీ । యోర్పుతో లేచీ వో॥ దైవమా॥

హనుమద్దాసురక్ష ణార్థ । మవతరించినా । వయ్య వేంకటేశ్వర
గురో । వదలము మేమూ వో॥ దైవమా॥

జంఝూటిరాగము — జుల్మతాళము.

దశకంఠా నామానవీ వినుమా దోరా — అను వర్ణమెట్టు.

ప॥ వినుడీ యోజనులారా, వెళ్ళిరా నికనూనే॥ వినుడీ॥

అ॥ వేడ్కతో నాగురుమూర్తిని, యెన్నో విధములా, వినుకులేక। ధ్యాన్నించియు, నెంతో గొల్వగా నింక॥ వినుడీ॥

చ॥ కల్లయుగం బనుచు గురుడా। కల్లదెల్పగా, నుల్లమందు నిల్పుకొనీ యుల్లసిల్లితీ నే॥ వినుడీ॥

జీవు డెవడో దేవుడెవడో, జెప్పి జూప నా। భావగుణములెల్ల। దీశా, భయము బాసితీ నింక॥ వినుడీ॥

మూలముండని తనువటంచా, మూల మివ్వగా। మూల మరసి సాక్షి జూచి। కీలుదెలియగా నింక॥ వినుడీ॥

భయము బాయు బాలయంచు, భ్రాంతి బాపి యీ। యిలను నమ్మబోకు, కలతో నెంచు సమ మనానె॥ వినుడీ॥

ద్వాదశీ భావార్థ మొంతో। బోధజేయ నే బాధలేని। పరిపూర్ణ భావమందితీ నే॥ వినుడీ॥

నల్లగుడ్డులోన యున్న తెల్లదేవునీ నే, నెల్లవేళ గాంచిమొ్రెక్కి। నేర్పెరింగితీనే॥ వినుడీ॥

వాదభేద మందెదాని, పాపు దుల్పియూ, ఆదిమధ్య చివరలేని దేదో దెల్పగానె॥ వినుడీ॥

అటుల యిటుల నెటుల జూడ। పటుతరంబుగా। పావనగురు వేంకటేశ్వరు। ప్రాపు గల్గగానే॥ వినుడీ॥

హానుమద్దాసు। లనెటిమాట లన్ని శూన్యమై అందు నెందు యుండెదాని। యందెగలయ గానే॥ వినుడీ॥

హిందుస్థానితోడిరాగము — ఆదితాళము.

ప॥ పరిపూర్ణ భావ మిదె గనరా । జీవ॥ పరిపూర్ణ॥
అ॥ యీయెరుకె జగంబెల్లా । యేమీ లేదను చాలు॥ పరి॥
చ॥ ఆత్మానాత్మలసంధి । యనిశమ్ము గమనించీ । అహం బ్రిహ్మను పల్కు । నణగా దొక్కిన వేగ॥ పరి॥
నిర్గుణసామికి । నే నే గుణంబూలు । నిందారోపిత మాయ । నింకేమి లే దనుము॥ పరి॥
నామారూపములేని స్వామీ। మెవరో యనినా। నీవూ నిష్ఠలులేని। సోహం బంసోహ మన॥ పరి॥
వట్టిరజ్జువునందు । గట్టిగ దోచు సర్పం । బెట్టు లడంగు తెలియు । నిట్లే జగద్భ్రాంతి తొదల॥ పరి॥
మెన్నో నామములాతో , యేర్పడి యీయెరుకే । సున్నినంచని దెలసి । చూపులేకుండీన॥ పరి॥
పల్కుపల్కనిముందూ । పల్కి నొదలిన వెనుక । పట్టా నేముండూనో । దిట్టాముగా దెలియ॥ పరి॥
నిక్కముగా నీవు । నెంచీ తెలియలేవ్వూ । నిద్రా కలవరింత , నీ భ్రాంతి యని గాంచు॥ పరి॥
శుక్తి రజితంబౌనా । చూచేది నిల్వూచునా। యుక్తి యని తా గనిన , యుక్త దని తెలసీన॥ పరి॥
వంధ్యాసూనుం డెంతో। స్థాణూ పురుషునిగూడీ , తర్కంబు లాడీ రన । తథ్యం బెట్లో దెలియ॥ పరి॥
నీవూ నే నను పల్కు । నీమది లేకుండి । భావించి పైదాని । భద్రాపరచూ చాలు॥ పరి॥
హనుమద్దా సను పల్కు । అంతా శూన్యం బాదు । హాయిగా గురువెంకటాఖ్యాసం డైక్యమైన॥ పరి॥

బిలాహరిరాగం — ఆదితాళము.

ప॥ క్షణకాలములో । సమసిపోవు తను । సాయ మేదె జీవా॥ క్షణ॥

అ॥ కలికాలము నీ । కల్పన । కథలను । కాల్చివేయలేవా జీవా॥ క్షణ॥

చ॥ ధనగృహధాన్యము । దారపుత్రులకు , ధావంతమునేలా । జీవా ।
మనము బోవుసమయంబున వీరలు , మరివత్తురె జీవా॥ క్షణ॥
పాపపుణ్యములు । బ్రాపించును భువి , భ్రాంతిపడకే జీవా । వ్యా
పిత మెరుకను । నెగరగొట్టగా । పాప మేదె జీవా॥ క్షణ॥
యెరుకబయలులను । నెంచిచూడ నా । యెరుక కేదె జీవా ।
మరువక గురునీ । మరిమరి గొలచీ । మరుగుదెలియు జీవా ॥క్షణ॥
అష్టతనువుల కవ్వలదానిని । నిష్టగాంచు జీవా । స్పష్టముగా యీ।
గుట్టుదెలియవా । భ్రష్టువౌను జీవా॥ క్షణ॥
ద్వాదశిమంత్రాభావము గురుచే । పాదు దెలియు జీవా । మేదిని
షోడశి । యేదో దెలుసుకొని । మోద మిదువు జీవా॥ క్షణ॥
కలకు బులకు యే భేద ముండ దని , పలుక వేమె జీవా । తెలుప
లేదె గురు । పంచదశిని యిది । వలసి తెలియు జీవా॥ క్షణ॥
వేంకటగురు నేపొద్దు దలచకా । వెతలుబడకు జీవా । యింక
హనుమద్దా సిపుడు దెల్పా సీ । శంకనొదలు జీవా॥ క్షణ॥

---

శ్రీరాగము - ఆటతాళము.

నే డేలర యీజాలము - అను వర్ణమెట్టు.

ప॥ చాల్ చాలుర నాసామిర చాలించర నీసౌజ్ఞలు॥ చాల్॥

అ॥ పాలుమాలాకా వెంట । పదేపదే రానేలానుర॥ చాల్॥

చ॥ మొన్నాడైన నీతో నాకు , చిన్నాసుఖ మున్నాదిర । చవ్వనంపు
పనిమాటకు । చివ్వావ్వ నిట కొచ్చ్చాటేర॥ చాల్॥
నీకూటమి నా కెందుకు । నీకూ యది లేదని విన్నా । చీకాకుగ
నాతో వారు । ఛీకొట్టుచు నవ్వారటరా॥ చాల్॥

స్నానసంధ్యాజపతపములు, సంపర్కమునంద నీ। వేళ్ళాగోళ్ళు
గిల్లుకుంటు। యెన్నోసార్లు నావెంటరా॥ చాల్॥
పై సామాను జూచుకోని, పైసాలేని మాటా నాతో। పల్క
దవు నీచిత్రముకు, వొల్కి మెచ్చి వొచ్చెదర॥ చాల్॥
శ్రీవేంకట గురుసేవయు। శ్రేష్ఠామూగ జేయూ మని। చెప్పూ
హనుమద్దాసూ పల్కు। లిప్పూ డింటి నే నొప్పర॥ చాల్॥

---

తోడిరాగం - ఆదితాళము.

ప॥ సామి నే గోరితిరా, సరసకూ రావేమిరా నా॥ సామి॥
అ॥ నేరమే గూడాదురా। నెమ్మి నాయం దుంచూమురా॥ సామి॥
చ॥ మిక్కిలీ సొక్కితిరా। చిక్కులూ బెట్టాకురా॥ సామి॥
వెక్కసం బెందూకురా, చక్కనీ నాసామిరా॥ సామి॥
కాము డా పాపాత్ముడూ। గాసిలా జేసేనురా॥ సామి॥
సుందరాస్వరూపాక నా। యందు కోప మెందూకురా॥ సామి॥
హనుమద్దాసూనీ జేరా। అయ్యరా గురువేంకటా॥ సామి॥

---

శంకరాభరణరాగం - ఆదితాళము.

నిన్నే నామ్మినారా - నీరాజా నాయానా - అను వర్ణమెట్టు.

ప॥ నీయందు వలపూ। నెంతో నిల్చెరా సామి॥ నీయందు॥
అ॥ నీరాజాక్షు యొక్కా, నిముషా మోర్వలేవా॥ నీయందు॥
చ॥ యింతాసేపులో నీ। కెంతో తొందరేరా। పంతాగించి నన్నూ
పట్టారా మేలౌరా॥ నీయందు॥
సమయ మెంచి జూడూ। సందా డెంతో యుండే। సరస మాటే
రాకు। సామీ నే మొక్కేదా॥ నీయందు॥
పందె మేల నాతో। బ్రితిమాలాడుచుంటి। సుందరాంగ నాకూ।
సుఖ మెచ్చో టుండేరా॥ నీయందు॥

దాగూమూతలౌనా । దాగీ చూక నీవు । ఆగా మేల కొంతా
అగివ్వా డొచ్చేదా॥ నీయందు॥
చక్కానీ మోపీ చు । రుకూ్కానా నొక్కేవు । వెక్కసం బదేలా।
వేంకటేశ్వరార్యా॥ నీయందు॥
హనుమద్దాసు నెంతో । అర్తితో బోత్రివాను । అయ్యా నిల్చి
యుండగా, అనుమానా ముంచాకు॥ నీయందు॥

---

కళ్యాణిరాగం - ఆదితాళము.

సోమూ యింతా పామూరామూ - అనువర్ణమెట్టు.

ప॥ నామూనోహారా, నిన్నే నమ్మి యున్నాదానారా॥ నా॥
అ॥ యేతీరూ నన్నిడువా వనుచూ । వేడ్కా మది పురికొల్పేరా॥నా॥
చ॥ చక్కానీవాడావే యనీ, మిక్కిలీ నిను గూడితి నీ । వక్కామా
టా బల్కాకర్ణ విడి, కెక్కుడి మోహామొ గూడితివీ॥ నా॥
పంచాశరు డేయూ బాణములకు, కొంచా మూగా జాలనురా ।
పంచాదారె నీమో విచ్చీ । పట్టీపొందూ చుండారా॥ నామా॥
పూలాచెండ్లాబోలూ కుచముల, పోకాముడి విడు తంటారా ।
చీరారెవికె జూడాబోవా । సిగ్గూ దాగబోదూరా॥ నామా॥
బంధానములా సంధీ దెలసీ । బాపరా నాతాపములా, పందే
గాడా వీవేరా యూ । పట్టూవిడువా బోకూరా॥ నామా॥
హనుమద్దాసూ నేలూవాడా, ఆర్యా వేంకటేశ్వరుడా । అలకా
లేలా నాపొందూకూ । అందీయిందే గలయూరా॥ నామా॥

---

శంకరాభరణరాగం — ఆదితాళము.

ప॥ పరాత్పరా విను నీదయా। నాపత్రిజ్ఞావిశేషమె లేదయా వో॥ పరా॥
అ॥ దొరా నాదేహము । బిరాన దీయుము । పరాకు మానుము ।
పాలించి బోత్రివుము॥ పరా॥
చ॥ ముల్లోకములనూ। ముఖ్యంబు జేయను। మెల్లనీ హృదయమూను।
మిక్కిలి మెలగగను॥ పరా॥

యాలస్య మెందుకు । యసహ్యాతనువుకు । మేతా సీ దెబ్బకు ।
మెలగంగ జేయకు॥ పరా॥
యున్నాళ్ళి దుండునో । యెప్పూ డి దెళ్లునో । తిన్నాగ జూడానో।
దీటా నీతేజమూనో॥ పరా॥
యింతా నను బాధించ । యెవరీదో జేయించ , అంతేమి జూపించ।
వెంతో నిను ధ్యాన్నించ॥ పరా॥
గురువెంకటేశ్వర । గోప్యా మహేశ్వర । హనుమత్కవి నే లీశ్వర ।
ఆపాకు విశ్వేశ్వర॥ పరా॥

---

కాంభోజిరాగం - రూపకతాళము.

ప॥ ఆనందమె జెందు మనస । యవనిలో గురుధ్యానసేవచే॥ యానం॥
అ॥ ఆనందమె బ్రిహ్మం బని । ఆర్యోత్తమోత్తములె యనరా ॥నంద॥
చ॥ రెండుకొండల నట్ట నడుమా । దండిగా వెల్గేటిపరమా॥ యానంద॥
ఖండతేజా లీన మేదో । దండిగురుచెం తుండి సీలో॥ నానంద॥
చేసిచేయని దేదో దెలసీ । గాసి జెందా నేదో గాంచీ । పేచీలేకా
రెంటిపై నే । దోసమందక యున్న పరిపూర్ణా॥ నందమె॥
నేననే నహంకారమెల్లా । నిల్పియుంచక నీటగలిపీ । గాన నేనూ
లేదటంచా , పూని షోడశి పొందు మరచీ॥ యానందమె॥
భేదవాదుల మోద మడచే । గాథలేసీ యచలబ్రిహ్మ పాదు
దెలియూ । కొరకు యెపుడూ । ద్వాదశిని స్మరియించి యాత్మా॥
యానంద॥
నిత్యసత్యానిర్మలంబై । నిండి నెందూ నెలతిలేక మై । యుండు
శ్రీగురు వేంకటేశ్వరు । నండయుండే దండి నిర్గుణా॥ నందమె॥
స్వప్నతుల్యా సమమె జగ మని । వప్న భావమె తను వటంచా ।
జెప్పెహనుమద్దాసు నాజ్ఞలో । యిప్పుడే నిలుచుండి యెపుడా యా॥
॥నందమె॥

దేశీయతోడిరాగం - ఆదితాళము.

ప॥ చరణములే నమ్మితీ శ్రీగురు నీ॥ చరణము॥

అ॥ చరణములె నమ్మ్మితి । స్థిరముగ నీమ్మాదు । జలజాయుగ్మము
హృదయ। స్థలమూన నిల్పియు॥ చరణములే॥

చ॥ మనసు నిలుపుట యనేటి । మల్లేపుష్పము దెచ్చి । మక్కువతో
గురుని । మరిమరి పూజించే॥ చరణములే॥

మోహంబు విడుమనేటి । మొగలీచెండులతోటి । మురయుచు
పూజించె । ముద్దూపాదములానే॥ చరణములే॥

పూర్ణవైరాగ్యం బనె । పొద్దూతిరుగుడుపూత్తో । పొలుపుగ
సేవించి । పూర్తిగ మొ్రొక్కేటి॥ చరణములే॥

చిత్తనిశ్చయమానే । శ్రీసంపెంగలాతో । శ్రీహరియె గురు
వంచు । చెప్పుచు యర్చించే॥ చరణములే॥

యీర్ష్యానొదలుట యనెటి । యెర్రికలువలాతో । యెప్పుడు శ్రీ
గురుని। విడువక పూజించె॥ చరణములే॥

అంతా శ్రీహరి యానె । అతినిశ్చయం బనెటి । ఆత్రీపుష్పము
లాతో। ఆర్తితో గొల్చేటి॥ చరణములే॥

కోపంబు విడు మనెటి । గులాబిపుష్పమూతో । కోర్కెతో ప్రతి
దినము। కోరి నే పూజించె॥ చరణములే॥

దాసోహ మనియేటి । దాసాన కుసుమముల । దప్పక సమకూర్చి।
దయనిల్పు మని మొ్రొక్కె॥ చరణములే॥

నిర్వికారుండయ్యు । నిల హనుమద్దాసూడు । నెమ్మదిలో నిల్పి।
నీ వేంకటాగురుని॥ చరణములే॥

భైరవిరాగం - ఆటతాళము.

ప॥ శ్రీవేంకటావాసు । శ్రీతిరుపతి నివాసూ । సేవాజేయుచు నుండవె, వోమనసా । సేవాజేయుచూ నుండవే॥ శ్రీవేంకట॥

అ॥ చేతులెత్తుచ్చు చిత్తమూలో । శ్రీహరే నరహరి యటంచును, శ్రేష్ఠముగ మన । సిపుడె లయమును । జేసియుండవె మమత మానునూ॥ శ్రీవేంకట॥

చ॥ యేడూకొండలపైనీ, యేరూపకుడు గాకా । యేప్రొద్దూ నివసించియూ । యెల్లాలోకములందు । యెక్కాడ జూచినా । వక్కాడే ప్రిభువయ్యా, పిక్కాటిల్లుచు యున్నా॥ శ్రీవేంకట॥
చూపూల కందాక । ప్రిపూ లేకుండాక । దాపులోన జిక్కా । దీపాము యిరుప్రిక్కాల । దాపైన బయలూవలె । వ్యాపించినం దెందూ । ప్రాప్రి సండియె యుండు॥ శ్రీవేంకటా॥
భ్రిమచె గల్పించిన । భ్రాంతేగద జగ మనుచూ । భ్రిమలేని వాడామెనే, భ్రిమచే యుత్పత్తయ్యు । భ్రిమచే వృద్ధియు పొంది। భ్రిమచేత లయమయ్యా। భ్రిమసీయుండకయున్నా ॥శ్రీవేంకటా॥
మాయగద లోకంబూ । మాయగద నరులెల్లా, మాయగద పశు పక్షులూ । మాయగద మృగమూలూ । మాయే సచరాచరములు। మాయే జలచరమూలూ । మాయె తరువులు గిరులూ । మాయ యన యేమని । విచారణ జేయలేనిది । మాయ గద యీలేని దానిని నమ్మకను । లేశమ్మైయెనను మరువ కెప్పుడు॥ శ్రీవేంక॥
పరిపూర్ణమును దెల్పు, పదిరెండు బీజములా । భావామే ధృడ పరచియూ । పదియారు బీజములా । పదభావమును దెలసీ । పదిహేనుసాక్షీని । పట్టూగ దెలసీయు । పదిల భావుడ వగుచు । వీటిని పట్టుగా నమ్మకను। విడచియు పదిలపరచుము। ద్వాదశాంతమున । భావమే లేకుండజేయును॥ శ్రీవేంకటా॥
నైకుంఠపుర మీాడి । వసుధలో ఆక్కోన్। పురమందు నివసించియూ వరమూ లొసంగెద । వరభక్తులకు యనుచూ । వాంఛాతో

బల్కా శ్రీ। వరవేంకటేశ్వరుని । వదలకను మానసిక పూజలు ।
వరుస దప్పకజేయు సుజనుల । వదల కెప్పుడు వెంబడించియు ।
వైఖరిగ బ్రోచెద నటం చనె॥ శ్రీవేంకటా॥
మాభావారాట్కాల ।మణి యన బరగినా । మావేంకటాగురుని ।
మతభేద మిడచీయూ । మంచీగ మ్రొక్కుచునూ । మము పాలన
జేయావే । మాధావా హరి యనుచూ । మరువకను జూపూడి ।
హనుమద్దాసు నెమ్మనమందు । స్మరణయు ననిశ మేమరకుండ
జేయగ । నావహించిన మెరుకదుంచే॥ శ్రీవేంకటా॥

---

శ్రీరాగం - జంపెతాళము.

ప॥ వెతజెందె జన్మము యెందు కిచ్చితి వోతండ్రి నే॥ వెత॥
అ॥ అతిరోగములచేత । అలసాట జెందేటి॥ వెతజెంద॥
చ॥ మతినిబ్బరములేకా । మందుమాకులు లేక । గతులుగల్గిన వనే ।
మతిహీనజన్మానే॥ వెతజెందె॥
హితులు బంధువులెల్లా । యెల్లపురుషస్త్రీలు । మతి నిబ్బరము
చెరచీ । మందే తిను మన వినే॥ వెతజెందె॥
యెన్నివిధంబూలా । నెంతో పోషణజేయ । యెపుడో జెప్పక
పోయె । యీ దేహమం దుండె॥ వెతజెందె॥
శ్రీవేంకటగురు డిచ్చూ। దివ్యౌషధం బొదలీ। దినున హనుమద్దాసు ।
శ్రీమాతితో మందు॥ వెతజెందే॥

---

మధ్యమావతిరాగం - ఆటతాళము.

ప॥ యింతా కఠినమేమి రామా। నన్నేమీ జేసెదో సుగుణధామ॥ యిం॥
అ॥ సంతతము నీధ్యానసేవయు । నెంతో జేయుచు నుండె దాసుని ।
మంతనంబున జేరియుండక । మాయలో బడవై చిచూచుట॥ యిం॥
చ॥ పతితపావన బిరుదు లేదా నన్నూ । పరిపాలనజేయరాదా ।
గతివి నీవే నా కటంచును । నతు లొనర్చుచు। నమ్మియున్ననూ ।

మతికి యేమాత్రింబు దోచక । మరచెదవు నామాట యెప్పుడు ।
॥యింతా॥

తనయునీ దుందుడుకు జూచీ, తండ్రి దరిజేరు మని సుతుని బిలచీ,
మతిలో నెంతయు ప్రేమయుంచక। మహదహంకారముతో శిరసును,
మట్టుజేయూచండ మమరగ । బట్టి కుతుకయు గోసిచంపున॥ యింతో
కఠినమేమి॥

నెపుడూ నన్యుల దలచబోనూ నే। నెపుడూ నిను విడువాడ గాను ।
కపటభావము బూని నన్నూ । కన్నులను నివు గాంచకుండిన ।
నెపము నీదగు సుమ్మా । దాసుని నీళ్లముంచెదో । పాలముంచక॥
యింతా॥

యెల్లాలోకములందు నెందూ నీవూ । యెపుడూ యుందువటంచు
విందూ । కల్లగా దామాటలన్నియు । నెల్లవేళల నీవె యున్నను ।
నెవ్వరికి గనరాక దిరుగు ట । దేమొ దొంగవొ దెల్పు నాతో॥యిం॥
ముచ్చుతనమున యుండి నీవూ । యిటులా మోసాగించుటా ,
నీకా గావూ । పచ్చిచర్మము మాంసరుధిరము । పిచ్చిదేహాము
లందు నుంచియు । నుచ్చరించిన బల్కుకుండుట । సచ్చరిత్రమే
సార్వభౌమా॥ యింతా॥
భవబంధముల గోయలేవా నీవూ । భక్తాపాలన జేయూరావా ।
నెవ్వ రెరుగ రటంచు నెప్పుడు । నీవు నాలో నిలచియుండియు ।
నెల్లపని జేయించి నాపై । నేరముంచుట నెటుల తగినదో॥యింతా॥
వెంకటేశ్వర వేషరూపా , నీకింకరుని విడదీయ రాపా । నింక నెందరి
నిటులజేసితో , ఝుంక డని విను హనుమద్దాసుడు , శంకలన్నియు
దీర్చి నీలో । జేర్చుకో నీ బిరుదు చెడదా॥ యింతా॥

---

బేహాగ్ రాగం — ఆదితాళము.

ప॥ యిదిగోరా ముక్తికి మంచి త్రోవా॥ యిదిగోరా॥
అ॥ యిదిగోరా యిదెదారి బోవా॥ యిదిగోరా॥

చ॥ చూడూ సద్గురుని జేరి గూడూ । చోద్యం బిదేమో వేడూ । చెదరాక నిల్చేవాడు । శ్రీహరి నెవరో నేడు । శ్రేష్ఠంబె గురుని పాడు । జన్మంబు నొదల నోడూ । తలపండూ దినుచుండూ లేకుండూ॥ యిదిగోరా॥

కట్టూ లక్ష్యాము గురుపై పెట్టు । కిడలాక మనసుపట్టు । నొదలీన గల్లు రట్టు । యిదియేమొ యనక కొట్టు । పదిమంది యుండ నెట్టు । లక్ష్యంబు తగలబెట్టూ । యిదిగుట్టూ విడనొట్టూ చెర కెట్టూ॥ యిదిగోరా॥

హద్దూ గురువాజ్ఞ మీర సద్దు । గురుసేవే మిగు లేపొద్దు । గురు స్మరణరుచియె కద్దు । గురునుతే నీకు ముద్దు । యికజన్మ లేదు రద్దు । యిదెగద్దూ యిదెపద్దూ విడ కెడ కెద్దూ ॥యిదిగోరా॥

యీావు తనుఘనమన గురున కీవూ । దురితంబులెల్ల బోవు । దుర్గాత్తిజెందలేవూ । పరిపూర్ణముండెతావు యెరుకెట్టు లుండు పోవూ । యీాగుర్తుజూడగావు । యీాజన్మ లింకరావు । యిక లేవూ యికరావు యిదె పోవూ॥ యిదిగోరా॥

సారం హనుమద్దా స్మాట బేరం । శ్రీ వేంకటప్రభు వాధారం । జగ మెల్ల తనదె భారం । జగద్భ్రాంతెల్లా నిస్సారం । యీాగుర్తె సువిచారం । యిది మరువ కెపు డేవారం । యీావివరం చోరనగరం గన కితరం॥ యిదిగోరా॥

---

ఫీల్ రాగం — ఆటతాళము.

కాశీ విశ్వనాథా । కామవిరోధా - అను వర్ణమెట్టు.

ప॥ నే నెవ్వరో నెరుగాకా । నెనోన్నే జన్మము లెత్తితి । నికలేదు జన్మంటి । నిశ్చయము గురురాయా॥ నే నెవ్వరో

నిండూపరిపూర్ణంబె । నిఖిలాదిక్కులయందూ । నే నంత అదే యూడె । నీ కన్ను సొజ్ఞాచే॥ నే నెవ్వరో॥

అంతర్బాహ్యములందూ । ఆత్మాస్వరూపామే , యతడే నారాయ
ణుం । డని దెల్పితిరి నిజమూ॥ నే నెవ్వరో॥
నణువూలో యణువయ్యా । యధికంబుకు మిగులయ్యా । వెల
యూ వాడవు నీవె । వే డ్కా-దలి జూడన్నా॥ నే నెవ్వరో॥
నీరె ద్వైవం బనుచూ । నీవూ వాడిగం ళ్లనుచూ । నీస్మితంబుతో
నెరుగు , నీరెంటి మరు గనినా॥ నే నెవ్వరో॥
నేనే ద్వైవం బైతి । నే నది గా నైతీ । నేద్వైవము విడనై తి
యది యదె యిపుడ్వై తీ॥ నే నెవ్వరో॥
చావూపుట్టుకలేని । చదువెల్ల జదివించి । సయ్యాన నను నీలో ।
చక్కా-గ జేర్చితివి॥ నే నెవ్వరో॥
శ్రీవెంకటప్రభుని । చిత్తంబులో నిల్పు । చేరే హనుమద్దాసూ
శ్రీవిష్ణుసన్నిధిలో॥ నేనెవ్వరో॥

---

సాదనామక్రియరాగం — ఆదితాళము.

మందయానా వోమందయానా- అను వర్ణమెట్టు.

ప॥ వుండదు దేహామూ । వ్రూడుట నిజమూ॥ వుండదు॥
అ॥ వోగుండగొయ్యా రామస్మరణ । వుండిజేతామూ యి॥ దుండదు॥
చ॥ వ్రుండిలేకానూ తా । మొండి గాకానూ । కుండా బగులాగొట్టె
లోసీ , పండూ దిండామూ యి॥ దుండదు॥
ఖండితముగా గురు । మెండలిలో వేగా । నుండె మరుగంది మనమే ।
నిండి యుందాము యి॥ దుండదు॥
వుండిపోదామూ పో । కుండా యుందామూ । వుండిపామ్యోదాని
యిపుడే । వ్రూహాతో గందామూ యి॥ దుండదు॥
లేకయుండామూ యూ । కేక మానుదమూ । పోకలేకయుండే
శ్రీగురు । దాపూ జేరుదమూ యి॥ దుండదు॥

జననీజనకూ లానా । తనయసోదరులా । మనమునందే ప్రేమవీడి । మనమె యుందామూ యి॥ దుండదు॥
వేంకట శ్రీగురునీ । విడువక దలచివనూ । శంకలన్నీ హనుమద్దా సుకు । యింకా వొలగెనూ॥ వుండదు దేహమూ॥

---

ఫీల్ రాగము — జుల్మా తాళము.

అపనా తనాఘనా మూరోరీ బైరన్నా- అను వర్ణ మెట్టు.

ప॥ అననా నే నన్నానా, విననా నే విన్నానా॥ అననా॥
అ॥ గననా నే గన్నానా, జననా నేజనీనానా॥ అననా॥
చ॥ లేనూ నే లేకున్నానా, పోనూ నే పోకున్నానా, రానూ నే రాకున్నానా । తేనూ నే తేకున్నానా॥ అననానే॥
తినవా నే తినుచున్నానా । మనవా నే మనీనానా, కానూ నే కాకున్నానా। విడనా నే విడి యున్నానా॥ అననానే॥
పడనా నే పడియున్నానా । ఆడనా నే నాడీనానా । నోడనా నే నోడీనానా । గూడనా నే గూడున్నానా॥ అననానే॥
యీసంధీ తెలయు సుజన । బృందంబు లెల్ల నిపుడే । యీప్సితంబు లెల్ల బాసి । యీజన్మం బంధ రనీ॥ అననానే॥
అందాం శ్రీవేంకటగురు నన । కుందాం యీతనువు స్థిరమా । నందాం యీ హనుమద్దాస్ను । గందాం గని గనపుం డుందాం॥
అననా నే నన్నానా॥

---

బేహాగ్ రాగం — ఆదితాళము.

ప॥ వికలత్వము నీ వందకె మనసా । వికలయోపధులు యె న్నొసం గినా॥ వికలత్వము॥
అ॥ సకలము దెల్పిన । సద్గురుమూర్తిని । ప్రకటించవె మనసా॥ వి॥
చ॥ సత్యాసత్యములా । సూజ్ఞదెల్పినా । సౌజ్ఞందవే మనసా । నిత్యముక్తుడా పీనని దెలియుము । నిశ్చయముగ మనసా॥ వికలత్వ॥

యెంచరాని యీజగ మనిత్య మని । యెఱిగి తెలియు మనసా । కొంచె
మనుచు యిది । కొదువగా దనియు । నెంచబోకే మనసా॥ వికల॥
దేహి దేహములా । తెరవుదెలసి వి । దేహియౌ నేమనసా । మో
హబ్రుందమును । ముంచివేసి తని । మురయుచుండె మనసా॥ విక॥
లింగమాంబ యని । సంగ తెరిగి ని । స్సంగుడౌ వే మనసా । దొంగ
గురుడ గానంచు దెలిపి యా । లింగమందే జీవా॥ వికల॥
కై పాసంగెటే । ఘనయోషధులకు । గంపమొందకె మనసా । కై పు
కై పు లాగని । గనకుండె కై పు దెలియు మనసా॥ వికల॥
శంక లొదలె హనుమన్న కనుచు దు । శ్శంక ఫీడె మనసా । యింక
శ్రీ గురూ వేంకటేశు దయె । యిదిమరువకె మనసా॥ వికలత్వము॥

---

సావేరిరాగం — ఆదితాళము.

ప॥ నీలోనే గనరా వికారరూపం॥ నీలోనే॥

అ॥ నీలో నీరూపమంతా । నెపుడూ నేమరక జూడా । నీవే నేనాదు
వేగా । నీ వెట్లూ నన నుందూవో॥ నీలోనే॥

చ॥ నీవున్నా నేనుందును । నేనున్నా నీవుందువు । నీవుండవు నే నుండను ।
నేనుండను నీవుండవు॥ నీలోనే॥

నీవనినా నేననుదూ । నేననినా నీవనుదూ । నీవనవూ నేననూ ।
నేననూ నీవనవూ॥ నీలోనే॥

నీరూపమె నారూపము । నారూపమె నీరూపము । నీరూపంబును
బాయగ । నారూపం బదె యగునని॥ నీలోనే॥

నీపాటే నాపాటా । నాపాటే నీపాటా । నివుబాడవు నేబాడను ।
నేబాడను నివుబాడవు॥ నీలోనే॥

నీనిష్టే నానిష్టా । నానిష్టే నీనిష్టా । నీ వానిష్టను నొదలిన । నే నా
నిష్టను నొదలుదు । నే నొదలిన నానిష్టను నీ వొదలుదు వానిష్టను॥
నీలోనే॥

నీవాడిన నేనాడుదు । నేనాడిన నీవాడుదు । నీవాడవు నేనాడను । నేనాడను నీవాడవు॥ నీలోనే॥

నీవినినా నేవినుదూ । నేవినినా నీవినుదూ । నీవినవూ నేవిననూ । నేవిననూ నీవినవూ॥ నీలోనే॥

నివుజూచిన నేజూచుదు । నేజూచిన నివుజూచుదు , నివుజూడవు నేజూడను । నేజూడను నివుజూడవు॥ నీలోనే॥

నీవు నవ్విన నేనవ్వుదు । నేనవ్విన నీవు నవ్వుదు । నీవు నవ్వవు నేనవ్వను । నేనవ్వను నీవు నవ్వవు॥ నీలోనే॥

నీకోపమె నాకోపము , నాకోపమె నీకోపము । నీకూ కోపము బోయిన । నాకోపంబును బోవునూ । నా కోపంబును బోయిన । నీకోపంబును బోవును॥ నీలోనే॥

నీయాకలె నాయాకలి , నాయాకలె నీయాకలి । నీకోరికె నాకోరికె । నాకోరికె నీకోరికె॥ నీలోనే॥

నీ నా భేదము లేదూ , నా నీ భేదము లేదూ । నీభేదమె నాభేదము । నాభేదం బేదిలేదు॥ నీలోనే॥

రంగంబె రంగంబా , సంగంబె మంగంబా । రంగం సంగం మంగం। లింగంబే గంగమ్మని॥ నీలోనే॥

వెంకట శ్రీగురు వుండెను , బింకముతో జగమంతయు , నింకా హానుమద్దాసా । యిది వినరా నే లే నని॥ నీలోనే॥

---

జంఝూటిరాగం - ఆదితాళము.

ప॥ నిన్నే నమ్మితీ నీరజనాభా॥ నిన్నె నమ్మితి॥

అ॥ నమ్మివిడచితినీ నాగురుదేవా॥ నిన్నెనమ్మితి॥

చ॥ యెట్టులైన మీా రేగతి చేసిన । కొట్టిన తిట్టిననూ యిపుడే ।కోయ బూనినానూ॥ నిన్నెనమ్మితి॥

వెరి వానివతు చిరుగ్గినీ జేసియు । బురుగ్గిన నవ్విననూ । నినేను కుర్రైగ్గినను విడనూ॥ నిన్నెనమ్మితి॥

మోహనరాగం — ఆదితాళము.

ప॥ బొక్కలో బెట్టే । చిక్కులుబాపే । టక్కరివాడనో నే । టక్కరి వాడనో॥

అ॥ నిక్కము నమ్మిడి । మక్కువ నొదలిం । క్కెడివాడనో ॥బొక్క॥

చ॥ కామక్రోధ మోహాదులనెల్లా, కాల్చినాడనో । నీమనిష్ఠ లనే । నిష్ఠామంటలో, నీరేబోయుదునో॥ బొక్కలో॥

పణతిదరివ్యమును । పాతాత్తే యని పల్కువాడనో । కుల్కుపలు కులకు । నొల్కులు పడకను । కుల్కేవాడనో॥ బొక్కలో॥

మామా మామా మా మనె పల్కు । మాటెవాడనో, రామం రా మని రామస్థానా, లాహిరినందితినో॥ బొక్కలో॥

రాముని రాముని దేముని దేవనె । దిద్దియు దెల్పెదనో । లేమని లేమని దేవుని జూపగ । లేనని నమ్మితినో॥ బొక్కలో॥

జాతిభేద మనె లోతు నూతిపై । మూతె వేయుదునో, పాతక భీతిని మూతిని గోసీ । పంద్లై నాడనో॥ బొక్కలో॥

పుట్టదు హనుమన । ఘట్టిగ విను మన । నెట్టేవాడనూ । పెట్టు పేరిదీ వొట్టిదిరా యని । గుట్టుగ వేంకటగురులో గలయుగ॥ బొక్క॥

---

మధ్యమావతిరాగం — ఆటతాళము.

యెంతటీవాడే రాముాడూ - అను వర్న మెట్టు.

ప॥ ఎంతటీ వాడే నాగురు డీ, తంతు లన్నీ వింతా లనియే॥ ఎంతా॥

అ॥ అంతు దెలియారాదే కొమ్మా । మంతనములో నంత్రైనాడె॥ ఎంతాటీ॥

చ॥ చూపులోనా చూపూ జూచీ । చూపూరూపూ మాపూజేసీ । చూపూ లేపే, చూపూలోనా, దాపైనా డమ్మా॥ ఎంత॥

వాడవాడా యాడా । జాడా । యీడువాడై యున్నా డమ్మా । జోడుగూడి వీడా కమ్మా । నేడవాడై యాడే నమ్మా॥ ఎంత॥

నన్ని నెన్నై గన్నా సున్నై । మన్ను మిన్నై నెన్నా గన్నై॥
తన్ను తా నన కున్నా వానీ । తాన తానే తానై తానా॥ ఎంత॥
యిందుడే నీకన్నా మిన్నా । అందుడే వోకుందారదనా । యిందు
కే నీడెందామందే । నంది యందే పండై యున్నా॥ డెంతటీ॥
సుందరీ యీమందీ మీరీ । అంది అందాకున్నా డమ్మా । మంద
మతితో నందాడమ్మా । ముందు తానై యుండూనమ్మా॥ ఎంత॥
పక్కలో నా డొక్కాచించా । నొక్కడై యున్నాడే యమ్మా ।
చక్కనీ శ్రీవేంకటగురుడై । నొక్క డుండే హనుమన్న లేడే
॥ఎంతటీ॥

---

### రేగుప్తిరాగం - ఆటతాళము.

ప॥ రామా జగాదభిరామా । నన్ను రక్షించరా పరంధామా॥ రామా॥
అ॥ కామాజనక ముని । స్తోమా సద్గుణధామా॥ రామా॥
చ॥ అందారిలో యున్న వంచూ జను । లెందారో జెప్పాగ వించూ ।
ముందు దాసుడ నీకు నేనై । మందిమాటలు వినక నా । డెంద
పీఠముపైన నునిచీ । తొందరగ పూజించ నిల్వవు । తొందర
యేమిా । నీకుండిన పందె మదేమిా । నను బోధవను । చిందర
దేమి । యీా నిందెను పొంను టదేమిా । యే సుందరి బోధో ।
నాతో ముందుగ జెప్పుము నిప్పుడే । సందిట బట్టియు బంధన
చక్కగ భక్తితో గట్టి । పొందుగ నాలో యుంచగ । తండ్రి రానీ ।
లేక నీతాతే రానీ । భయముతో నీ భార్యే రానీ । నిను గనినా
తల్లియె రానీ । యెందరో వచ్చియు జెప్పిన । సం దే మివ్వక నీ ।
నందిపొంది ముచ్చటాడక । యెందుకు విడుతును । విడువను॥ రామా॥
ఆత్మత్వం బనుమాటా నే । నమ్మితి ననుకొనుట జూటా ।
కమ్మకొని బ్రహ్మండ మంతయు । దొమ్మిజేయూ వానివలె నీ ।
ఇమ్మహిని నను । స్థూలదేహము । సమ్మతితో గల్పించి నాలో ।
శిరసే నీవై । తనుపరి నా మోహమే నీవై । నావెంటనె కన్నై పన్నై ।

యూవెనుకను జిహ్వామాత్రై । నంతలోనా గొంతై గుండై । వేగి రముగ మెముకలు వెన్నై । సత్వరములో గోళ్లై కాళ్లై । గుండెలు రొమ్ములు చేతులు దండిగ । పొట్టయు డొక్కలు నాడెటి నర ములు । వేళ్ళను ఆడను పాడను వోడను । వేడను కూడను జూ డను వేడుకలన్నియు నీవై । వాడవాడ యాడజూడ । నేడకూడ నీవెగాక । అన్యము లేదని యంటీ యీ । గుట్టునె గట్టిగ గంటి నే । నెచ్చట లేదని యంటి । నాముచ్చట నణచియె యుంటి । యిది యందరు విను మని యంటీ । మందుడ నేనై తెలియక నందముగా నావల్లా । నెందరినో పోషణ నా । డెందమందు జేసి తంచు । పొందుగ మురసి తింక మురవను॥ రామా॥

వాదంబుచేయూట తగదూ నాపై । మోదంబు వీడూట కాదూ । శ్రీధారా గోవిందా శ్రీజనార్దన కృష్ణా । మాధావా హరిహరా మమ్మేలి నీ వగుదూ । యేది నీదయ రాకయుండు । టదేమి కారణ మేగ దెల్పు । మురారి రామాచ్యుత కేశవ । పోదు నిక విడ చెటకొ యంచన । బోవుర సామీ నేజేసిన నేరమదేమీ , యీ స్థూలము నీదే యనుమీ , నా దేమియు లేదని యనుమీ । యీ లీలలు నీవే గనుమీ । యాటపాటలాట మాటతేట । నీటుకాడ నీవెగాక । చోటులేదు ము।మ్మాటి కింక నే।మని దెల్పా నీమది కిదె । తెలసియు నిల్పా । వదేమిర పొట్టలు దుమ్రింపా । యిది న్యాయమ , తిన్న కుక్క తిని పోవ । జూడకయే । కన్నదాని బట్టి కొట్టినట్టు । లన్ని నీవె యయ్యు । హనుమన । పన్నుగ నావా డంచనక । చిన్నచూపు జూడకు । నను గన్నతండ్రి వేంకటేశ్వరా॥ రామా॥

---

—♦ కం దా ర్థ ద రు వు ♦—

కం॥ తనవీపు తనముఖం బని । తనమనసమున బల్కు చుండు తా మనుజుండే । తన కౌసరంబు గలిగిన । తన వని మురయుటమెగానీ । తన కగుపడునా । తద్వతు దేవు । పసుపడ నగునా । తనలోన తనపై టి ।

తనపై నా। తనకిరిందా । తనపరిక్కలను యుండీ । తా నందరిని గనుచూ । తనకు వేరై । తనువునంతయు , తాను తానై జేసియుండీ । తాను దానికి , నంటకను । తా నావలై । తను నవ్వుచుండే । తన కనుపడునా। తద్వతూ దేవు డగుపాడ నగునా॥

సీ॥ శ్రీదేశికాఖ్య వో శ్రీవెంకటేశ్వరా స్థిరబుద్ధితో నీకు సేవ జేతు । మందప్రాజ్ఞుడ నంటె మమతతో గూడుంటె మనసు నాపై యుంచి మధురభాష । లొల్కజేసియు నాకు లోటు లేకుండ గా పలుకులు పలికించు పరమపురుష । నీవు నేర్పని చదువులెల్ల సూత్రం బులు నెటుల నా కొచ్చునో నేర్పుతోడ । దేవ ని న్నెంచ నే నెంత ధీరవరుడ । దీన నీచుడ పాపుడ దిమ్మరుండ । దేవ శ్రీగురువేంకట దేశి కేంద్ర । ఆర్తి తొలగించి హనుమప్ప నయ్య గావు॥

సీ॥ ఎన్నో రూపములతో యెల్ల నీవై యుండ యేరూపువా డని యెన్న గలనూ । వేలు లక్షలు కోట్లు లెన్నొ వింతలు సలుప యేవింతవా డని యేర్పరించ । సర్వస్థలంబుల సంచరించుచు నుండ సాధ్యంబె యేస్థలం సాటిజెప్ప । సర్వపాలకత్వ సంబంధుడై నిన్ను యెవరి రక్షకు డని యెంచగలను । సర్వవ్యాపకములు సలుపుచు నీవుండ యేవ్యాపకుం డని యనెడివాడ । దేవ ని న్నెంచ నే నెంత ధీరవరుడ । దీన నీచుడ పాపుడ దిమ్మరుండా । దేవ శ్రీగురు వేంకట దేశికేంద్ర। ఆర్తి తొలగించి హనుమప్ప నయ్య గావు॥

సీ॥ యెంచ శక్యముగాని యెల్లపలుకులు నీవే యేపలుకు నీ దని యెన్ను వాడా । యెల్లజాతులు నీలో యేర్పడి యుండగా యేజాతివా డని యెటులజెప్ప । యెల్లగోత్రంబులు వెలసె నీయందున యేగోత్రజుం డని యేరి యుంచా । సర్వశక్తుండవై సాహసంబుతో యుండా యేశక్తి నీదని యెటుల యందు । యేమి యని బల్క నానోరు యాడ దయ్య । దీన నీచుడ పాపుడ దిమ్మరుండా । దేవ శ్రీగురు వేంకట దేశికేంద్ర। ఆర్తి తొలగించి హనుమప్ప నయ్య గావు॥

నాదనామక్రియరాగం — ఆదితాళము.

అక్షయపాత్రకు వచ్చినాము మమ్మాదరించరమ్మా- అను వర్ణమెట్టు.

ప॥ చూడుడి చూడుడి నాగురు సూత్రము । సూటి మహాత్మమ్మా॥

అ॥ వేడుడి వేడుడి యేమర కెప్పుడు । యేమానో యమ్మా॥ చూడు॥

చ॥ రెండు లవంగము లూహా జేసితిని । లొంగదీ స్థితినమ్మా । దండివాడ
నే పేరుదీసి నే। దండిస్థి నోయమ్మా॥ చూడుడి॥
పెద్ద వాడయూ గద్దరి పల్కన। దిద్ద జేస్తినమ్మా। కొద్దిది గొప్పని
గొప్పది కొద్దని। గుద్ది దెల్పితమ్మా॥ చూడుడి॥
పాలి వాడ యూ । పాలు గొనక బహు । పాలా యనె యమ్మా ।
పాలని జూపియు । పాపమడంచీ । పాలు జేసి తమ్మా॥ చూడు॥
యెన్నొ వత్సరములు । గురు సేవించిన ని । య్యనచల మమ్మా ।
సయ్యన దీసుకవచ్చి వాని కీ । సంధి జూపితమ్మా॥ చూడుడి॥
యెంత దయర గురు డింత వాడని । సంతసించె నమ్మా । కాంతు
జనకు నీకన్న మిక్క లని । చెంతజేరెనమ్మా॥ చూడుడి॥
యెల్ల లోకములు చల్లనయ్యె యూ । మల్లన కొరకమ్మా । యు
ల్లము లోపల । వెల్లడియై వెలికాయె ప్రేమయయ్యా॥ చూడు॥
పాపలోని నీవ్యాపితమే తన । దీపాయెనె కొమ్మా । కాపరి మా
పయి నీతెరుంగ తా। రూపాయె గదమ్మా॥ చూడుడి॥
యేడోకొండపై వెలసి నిల్చినా । వేంకట గురుడమ్మా। యెంతో
ప్రేమతొ యేలె । హనుమనను । సంతసించి యమ్మా॥ చూడుడి॥

---

బేగడ రాగం — ఆట తాళము.

అమ్మగారిని జూడబోదామ - అను వర్ణమెట్టు.

ప॥ నన్నూ నీలో జూడరా। నీలో నే నున్నా వాడని దెలియూరా॥ నన్నూ॥

అ॥ నన్ను నీలో జూచి నిల్పియు । నన్నిసున్నని క్రిన్న నెరిగీ । తన్ను
మరచీ । తత్వమంతయు । తానె తాననె తలపు మరచీ॥ నన్నూ॥

చ॥ అంటూ లోనే యుంటిరా, అంటిని యంటినంటాక నే నుంటిరా।
తుంటూరి కాడనై । కంటిలో కనుగననై । నొంటివానిలో నే।
జంటా బాయక యుండీ। కంటి కంటీ కన్నులో స్గన। గంటి చిత్కళ
లంటి మింటీ । వొంటి చిన్మయ తీతమై నే, నుంటి నన్నిట తంట
బాసీ॥ నన్ను నీలో॥

మయలా వాడను నేనెరా। మయలలో యిండీ మయలాబయలుగ
జేస్తిరా, బయలు మయలున భేదమెరిగీ। బయలుజేసీ భవ
మడంచీ బయలు నేనై భద్రిమండీ। బయలులోపల భయలు
నందీ॥ నన్నూ॥

సూతకుండను నేనెరా, జాతకము జెందీ। సూతకంబనెవాడరా।
నీతిదెలసీ నీతిలేకా నీతివిడచీ। జాతకుల గని ప్రీతిగా నను దాక
వలదని। ఖ్యాతిమీరగ కోతి గాకను॥ నన్నూ॥

తాకుతావన నేనెరా తావునకు జేరి। తాకాక తనువాయరా।
తాకుతావని తాను దెలసీ। తాకకను తనువెల్ల గోసీ తాకు తను
వును మించియుండీ, తాకక నె తనతావునందీ॥ నన్ను నీలో॥

దేవ్వాని నని దెలియ రా, దేవుని జెలసీ దేహీరూపము మారరా।
దేవు నే నని దేవి జూచీ, దేవు వేరన మాపుజేసీ। దేవుని లో
తా గలసి లే నని। దేవు డను డటలు దిద్ది లేకను॥ నన్నునీలో॥

చావుకన్న ముందు చావరా। చచ్చి నీవున్నా। చావేమి తా
జేయురా। చావు లేదని చచ్చివెంటనె। చావు యనదా నిచ్చి
జూచీ చావు లేదని, చచ్చియున్నను। చావుచావ వదేమొ
నెప్పుడు॥ నన్నూనీలోజూడరా॥

పోవు పో వని దెలియరా। పూర్ణుండ వయ్యూ। పోవూను భ్రమ
లేదురా, లేవు తనువు లటంచు। షోడశి లేపి జెప్పిన, వెంక
టేశ్వర దేవునీలో గలసి। హానుమన। ధీరపదమును నొదలె
నంచని॥ నన్నూనీలోజూడరా॥

---

జంఝూటిరాగం — ఆటతాళము.

ప॥ యీడే వాడూ। వా డీడు గాడే॥ యీడే వాడు॥
అ॥ నేడా వాడే, కాడే వీడే॥ యీడే వాడు॥
చ॥ జోడూ గాడే, జోడేడ లేడే। జోడా వాడే। జోడీడ జోడే॥
కూడూ వీడే। కూడును పోడే। కూడను రాడే। కూ... వీ...॥ యీ...॥
రాడూ రాడే। రా డన బోడే। రా డను వాడే। రా... ...॥
చూడా వాడే। చూడను యీడే। చూడను కాడే। ...
లేడే॥ యీడే వాడు॥
పోడే పోడే, పో డను వాడే। పో డన వీడే, పోడూ ...॥ యీ...॥
భవరోగ మీడే। భవ మంద లేడే। భవ మను వాడే। భ...
డై నాడే॥ యీడే వాడు॥
వేంకటగురుడే। శంక విదూరుడే। కింకరు హానుముత్క...। ...
మీడే॥ యీడే వాడు॥

---

జంఝూటిరాగం — ఆటతాళము.

ప॥ సర్వము నీవే। సమయుట నేనే॥ సర్వము॥
అ॥ సద్గురు దేవా। సత్యస్వభావా॥ సర్వము॥
చ॥ దేవుడ వీవై। జీవుని పేరుతో, భావము కందక, ...
యుండియు॥ సర్వము॥
వృక్షములోపల। వుండు బీజంబుగ। వీక్షించుచుండియు। నే
మియు నంటక॥ సర్వము॥
ద్వాదశి నీవే। షోడశి నేనే। చూడ నసాధ్యమై। ...వ్యము
వీవై॥ సర్వము॥
సూదిమొన మోపను। చోటేమి లేకను, ...డను ...యు
వోద్యమై వెల్గుచూ॥ సర్వము॥
వెలుతురు చీకటి। యేమియు గాకనే। యేకమై ...
యేమర కీవై॥ సర్వము॥

వేంకటగురు। దాతవై యుండియు। దయతో హనుమత్కవి॥
ప్రలో యుండియు॥ సర్వము॥

యాలపాట — జంఝూటిరాగం — ఆదితాళము.
వసుదేవకంససంవాద భావార్థము.

రాజా। దయనూ మానీ, హింసాజేయా యేలా జెపుమా,
యంబూ నందా పని యేమీ। వోవోకంసరాజా। హింస
ముఁనకూ। జేర్చూరా॥ కంసా॥
స్థాలీలో జననా మొందూ। భూతాకోటి నెల్లా నిపుడే। భీతి
చావా జూచూనా। వోవసుదేవా మూర్తీ। ధాతయిటులా
వ్రాసెనా॥ కంసారాజా॥
డేమీ నీకూ గల్గె। చక్కాగా నీతోడా బుట్టె। నీవిధీ
టులా దెలసెనూ। వోవోకంసారాజా। నేర మేమీ నాతో
మూ॥ కంసారాజా॥
నా ఫల మేమీ లేదూ। మొలకా నుంచా మోసాకూ
। కల్కిమోమూ గాంచా నోపానూ। వోవసుదేవామూర్తీ।
నన్నూ యుద్ధూ పరచాకూ॥ కంసా
యేమీ విలయాంమాయే। పూహో డెల్పాక పురిదీయూటా
సముకూ నార్యూ లొప్పేరా। వోవోకంసారాజా। మోహ
టీ కేగె దెల్పారా॥ కంసారాజా॥
హో మగ్గిలోనా గలసే, మొదటా నాకే మోసా మొచ్చె।
కన్నా మోమూ యెత్తాను। వోవసుదేవమూర్తీ। నిక్క
టూ దుమ్మించీ వేసేనూ॥ కంసారాజా॥
టూ నాహ్లాదంబూ నందీ। వంటా భూషా లెన్నో వేశీ।
వెపాలే జేయా బూనూట। వోవోకంసారాజా। మింట నేమీ
గలిగేను॥ కంసారాజా॥
కేమీ నభమూ పల్కే। రూఢీగా నీకాంతకు గల్గూను

యేడుమించిన గర్భామందూనా ॥ వోవసుదేవామూర్తీ । జన్మ
మందీ జగతీ నర్త గూల్చా॥ కంసారాజా॥
వింతాగా దోచేటీ మాటా । లెంతో బల్కా నేమీ ఘూనమూ ।
మంతనమునా వ్రూహోచే జూడూ । వోవోకంసారాజా । చింత
దొలగే సూత్రా మిచ్చేనూ॥ కంసారాజా॥
చెప్పామయ్యా చేటే మొచ్చూ । ముప్పా దొలుగా నొప్పా
సిందూ । తప్పకున్నా చెప్పీ గోసేదా । వోవసుదేవామూర్తీ ।
తప్పనయ్యా గురునీ సాక్షీగా॥ కంసారాజా॥
ఆడీ దొలుగా నే నెప్పూడూ , వీడా జాల కాంతా నిపుడూ ।
వోడకా నాసుతులా నిచ్చేనూ । వోవోకంసారాజా । నేటి వాంఛ్లా
నిలపై కూల్చూమూ॥ కంసారాజా॥
వదలూ చుంటీ వనితా నిపుడే । వాంఛాతో నీపలుకూ లినుచూ ।
నె భవంబూ నొందూచుండూము । వోవసుదేవామూర్తీ । వగపు
లేకా వారీ నిప్పూవుము॥ కంసారాజా॥
నిలయుందూనా నెవరూ లేకా । నిలచీనా హనుమద్దాసూ నీ ।
నెలమి బోధించు హరి దా గల్గాడా । వోవోకంసారాజా । నెల్లా
గెలుగూ వగపూ నిలపైనా॥ కంసారాజా॥

---

జోలపాట — మధ్యమావతిరాగం — ఏకతాళము.

పుష్పాలు ముడిచేటి । పుణ్యాత్ములారా-అను వర్ణం.

ప॥ జోజో శ్రీగురురాయా । జోసుగుణాధేయా । జోజో యని నీూ
కెపుడు । జోలా బాడెదను॥ జోజో॥
అ॥ జోలా బాడెటివేళ । జోకొట్టు వేళా , జో లేమి గల దయ్యా ।
జోముద్దులయ్యా॥ జోజో॥
చ॥ జోసజ్జనస్తోత్రా । జో ధైర్యగాత్రా । జోజో సచ్చారిత్ర ।
జోకంజనేత్రా॥ జోజో॥

జో భక్తమందార । జో సూశరీరా । జో మేరుసమధీర జో సూవిచారా॥ జోజో॥

జోత్రిమూర్త్యాతీతా । జో పాపరహితా । జోపురాణాతీతా । జో భ్రాంతిరహితా॥ జోజో॥

జోశిష్యజనపోషా । జోమధురభాషా । జోచిత్రములవేష । జో కాయదూషా॥ జోజో॥

జోజో నీమహిమెంచ । జోభవమూ దుంచా । జో నీసూత్రము గొంచ । జోలె నే నుంచా॥ జోజో॥

జోజో నీసేవజేయ । జోకాంక్షా బాయూ । జోజన్మరాసీ యూ । జో లుంచకయ్యా॥ జోజో॥

జోమాయరహితాయ । జోసిద్ధకాయూ । జోసూత్రధారాయ । జోజోసుశ్రేయా॥ జోజో॥

జో నిర్గుణాకారా । జోమానసచోరా । జోశిష్యసంచార । జో మూలధారా॥ జోజో॥

జోత్రికూటస్థాన । జోసిరిధ్యానా । జోమూర్తిస్థాపాన । జోసీపాద మానా॥ జోజో॥

జోవేంకటగురుదేవా । జోహర్ బాత్రివరావా । జోహనుమద్ధాస్థావ । జోజో నే స్లేవా॥ జోజో॥

---

## మేలుకొలుపు

సావేరిరాగం - ఏకతాళము.

ప॥ జీవా మేలుకొనరా । జీవా మేలుకొనరా॥ జీవా॥

అ॥ మేలుకొనరా యెరుక జీవుడ । మేలుకొను నిశ్చలస్వభావుడ, మేలుకొని సద్గురునిసేవయు । చాలజేయుటకై ॥ జీవా॥

చ॥ కర్మవల్లను గల్గె జన్మనీ । గట్టిగా జనులెల్ల బల్కెరా । కర్మమర్మాధర్మ దెలియను । గట్టి గురుజేరా॥ జీవా॥

వేదశాస్త్రపురాణములచే । వాద మాడేటివారి జేరక । వేదశాస్త్ర
పురాణాతీతా । బోధదెలియుటకై ॥ జీవా॥
తొమ్మిదిరంధ్రిములచే బహు । తోలుగప్పిన దొడ్డకొంపలో ।
దొమ్మిజేయుచు నుండె వానిని । కమ్మిపట్టుటకై ॥ జీవా॥
చెప్పసిగ్గును గల్గుస్థళమున । జేరి నిల చిట కొచ్చితివి యీ । తిప్ప
లెప్పుడు లేకయుంచే । ధీరగురు జేరా॥ జీవా॥
మలముమూత్రిము । మాంస మెదడును । మైల రక్త చీము నర
ములు । మేలె యీదేహంబు చూచుక । చాల మురియకనూ॥
జీవా॥
మూలమూ లేనట్టితను వని । గోలజేయుచు గురుడు దెల్పగ
మేలుగా యాపలుకులెల్లను । చాల నుడువుటకై ॥ జీవా॥
జంటలేకను కంటిలోపలా । నంటియుండే వేల్పు గనుటకు । అంటి
శ్రీసద్గురునిపాదము । లాశ్రియించుటకై ॥ జీవా॥
మున్ను మెన్నో జన్మలొచ్చియు । మోసమయ్యా । బోవ దెలశియు
తిన్నగా వాక్యత్రియార్థము । దెల్పె గురు జేరా॥ జీవా॥
ద్వాదశీషోడశిని మెప్పుడు । యాది మరువక వీవు దలచిన
మోదముతో । జన్మించుతనువుది । పాదు విడిపోవ్వా॥ జీవా॥
జ్ఞానసూర్యుం డిపుడు రాగ । జ్ఞానచీకటి బోవజూడమె । పూని
నిర్గుణ బ్రిహ్మమందే । లీనమును జెందా॥ జీవా॥
నిద్రిలేచీ గురునిపాదము । లద్దుకొను యాశిష్యఫలితము । నద్ది బో
ల్చిన బోల దంచని । పెద్దలన వేగా॥ జీవా॥
వేంకటేశ్వరగురునిగొలచెను । మంకుగుణములు మాని త్వరలో ।
నింక హనుమద్దాసు దారిన । నిపుడె గలయుటకై ॥ జీవా॥

---

జంఝూటిరాగం — త్రిశ్రిగతి.

రాజరాజగజాననా । రార లోకపావనా — అను వర్ణ మెట్టు.

ప॥ కాంతలార దేగిదే । కర్పూరహారతు లిపుడే॥ కాంతలార॥

। వింతావింతలుగా మీా । చెంత చెలులతో । దంతివరదున కిపుడే । దాసోహమనుటాకు॥ కాంతలార॥

పచ్చిదాక్షఫలములూ । మెచ్చుభక్ష్యభోజ్యములూ । తెచ్చిమీా రిచ్చి । యెంతో తెలివి దప్పకా । మత్స్యస్వరూపుని । మనసందు స్మరియించా॥ కాంతలార॥

మల్లెమొల్లసుమములా । మంచివిరజాజులా । కొల్లగ మీా రిపుడె దెచ్చి । కూర్చిదండలూ । యిల్లిల్లె తను వనుచూ యెంచి సామికి వేయ॥ కాంతలారా॥

కోటిమాట లేలనే । బోటులార వినగదె వేగ, మాటీమాటికిని మిగుల, మాధవు భజనా । సూటిదప్పక జేయ । సుఖపథము జెందేము॥ కాంతలార॥

శంక లేల చూడరే । వేంకట గురురూపుడె తాను, మంకూ గుణములను నిపుడె, మాపు జేసునె, యింకేల జూచూట నిల హనుమద్దాస్నలే॥ కాంతలార॥

---

ముఖారిరాగం — జంపెతాళము.

యమంగళం, నిత్య శుభమంగళం జయాజయ॥ మంగళం॥

యజయా ధ్వనులచే । జనులెల్ల గుమిగూడి । సుమనస్కులై సుంతో, సుస్థిరముగా । గుజగుజలు చాలించి కోర్కెలన్నియు ాని, నిజసూత్రి మిచ్చూ మా, నిజగురునకూ॥ జయాజయ॥

ధారచక్రిమున । ఆర్నూరు హంసలను, ఆడింపగల్గినా, అధిపు ముూ । నాణెముగ గణపతిని, నాస్థా నధిపుజేసి, నంటకను ల్లేటి, నార్యునకునూ॥ జయమంగళం॥

ధంబులై నట్టి, వేడ్కసుఖముల జెంద, విధినామమును గల్గి । సుసులేకా । స్వాధిష్టచక్రిమున । స్వామివై యాత్వేలు । చక్కగా పించు సద్గురునకూ॥ జయమంగళం॥

మణిపూరచక్రమున । మహావిష్ణువై నిలచి । మహాదహంకారములు
మానివేగా । మానకను యార్వేలు । మంచిమరాళమును మక్కు-
వతో । నడిపించు మాగురునకూ॥ జయమంగళం॥
ఆనంద ముప్పొంగి । ననహాతాచక్రమున । నధిపతిగ రుద్రుని ।
నందు నిల్పి । నార్వేల హంసలను । నాణెముగ ద్రిప్పేటి । నశరీరు
డైనట్టి నాగురునకూ॥ జయమంగళం॥
విశుద్ధచక్రమున । వెయ్యి హంసల నడుప । మెంచి జీవాత్మను ।
యేరి నిల్పి । యెవరి కందకయుండి । యేరూపమునుగాకా । వెల
యుచున్నట్టి మా । యయ్య కిపుడూ జయమంగళం॥
యణురూపముగ యున్న । యాజ్ఞేయచక్రమున । యందు పర
మాత్మనీ । యధిపు జేసీ । వెయ్యిహంసల నడుప । యేర్పాటు
గావించి । యే మెరుంగక యున్న యార్యునకునూ॥జయమంగళం॥
సహాస్రారపురముకూ । సాటేది లేదనుచు । సంతతము గురు
మూర్తి । స్థాయిగుండీ । చక్కగా హంసలను । సహాస్రమూరు
లుగ । దిరుగ జేయించేటి । దేశికునకూ॥ జయమంగళం॥
వేల్పులకు వేల్పైన । వేంకటేశ్వరగురుని । యెన్నొ విధముల
నెంతో । వేడి గొల్వ । పొలుపుగా ద్వాదశీ । పూర్ణసాజ్ఞల
దెలిపి । హనుమప్ప నేలు మా । యార్యునకునూ॥ జయమంగళం॥

---

సురటరాగం — ఆదితాళము.

ప॥ మంగళ మని పాడరె । భావాంగులార । మీరు మాగురునకు॥
మంగళమని॥
అ॥ మంగళాంగనలు చెంగులు జారగ । పొంగుచు తనువను । పల్లె
ముంచుకొని॥ మంగళ॥
చ॥ సత్తుచిత్తనూ । తైలమందునా । మిత్తివొత్తిగా । మెత్తగదాలిచి ।
చిత్తు లేదు యీ । క్షితిలో యించు బల్ మొత్తముగా ।. నానంద
మెల్లగా॥ మంగళ॥

చూపురూపు మన । సేక మొనర్చి । వ్యాపక మప్పుడె లేపి ।
ధాత్రి యేరూపు పోల్చనను । నోప దంచు మీ । రాపక నెల్లరు ।
మోపుగ వచ్చి॥ మంగళ॥

సంగ మంది నిస్సంగు లగుచు యే । సంగతి లేనిది । సమరస్సైక్య
సూ । సంగ తేదో యూసంధి దెలుసుకొని । సంగరహితుడౌ ।
చక్కని గురునకు॥ మంగళ॥

ధాటిగాను త్రికూటస్థలముకు । నేటి కావలా మేటి పురములో ।
నీటులేక వెల్గేటి । వెల్గుపై కోటిరే వెలుగు । మీాటె ప్రభువునకు॥
మంగ॥

కామియాచు । నిష్కామి తా ననుచు । కామికులను తా । గలసి
మెలగి యే । కామ మంటకను । గల్గె హనుమద్దాస్ భామలార ।
భ్రిమగ్గల్గి లేకనె॥ మంగళ॥

భావాభావకీర్తనలు — సంపూర్ణం.

ఏతత్సర్వంబును శ్రీనిజగురుచరణారవిందార్పణ మస్తు.

# దీక్షాత్రయము.

సీ॥ సద్గురుపాదకంజాతముల్ సేవించి, వారిచే నుపదేశవర్తి యగుచు । త్రివిధదీక్షలు పొంది భవము లన్నియు గుంది, త్రివిధ లక్ష్యార్థముల్ తెలియజూచి । త్రివిధవర్ణంబుల వివిధమంతయు దెలిసి, త్రివిధక్రియలను మది ద్రిప్పనీక । త్రివిధప్రసాదముల్ స్థిరమతి భుజియించి, త్రివిధసూత్రాచార మవిరళముగ । గీ॥ దెలియకున్నను నద్వైత దివ్యసుఖము । గలుగనేరదు నిత్యాత్మ గనగ రాదు । యనుచు దెలిపిన గురుగుణ మెంచి ధిక్కరించునట్టి । నరునకువచ్చు హేతువు వినుడి మీరు॥

తాత్పర్యము :— సద్గురుపాదకంజాతముల్ సేవించి యనగ సద్గురు వనగా పరమాత్మస్వరూపము, పాదము లనగా సర్వప్రపంచము నడిపిస్తూ యున్న బ్రహ్మశబ్దశివాత్మ్యమైన హంస యనే రెండక్షరములు పరమాత్మయొక్క పాదములు. ఆపాదములు నడిచే మార్గమందున కంజాతములు యనగా ఆధారస్వాధిష్టమణిపూరకఅనాహతవిశుద్ధఆజ్ఞేయము లనే ఆరుచక్రములమీదుగా నడుస్తూ యుండే హంసతో చేరి చలనము లేకుండా మనసును పాదములతో గూర్చి వుంచడమే సేవించడము. వారిచే యుపదేశవర్తి యనగ మనోపవనములు రెండును వకటైనందున యీ రెంటిని వకటిగా చేయటముతోనే అన్నమయాది పంచకోశము లనే దేశములను విడచి వుపరియైన అచలస్వరూపమై యున్న వుపరిదేశమందు వర్తించడమే వుపదేశ మని పేరు. త్రివిధ దీక్షలు పొంది భవములన్నియు గుంది యనగా త్రి యనగా మూడు శబ్ద దృష్టి సంకల్పము శబ్దములో యుండే అర్థభేదములను విడచి సర్వశబ్దములు ప్రణవశబ్దములుగా భావించటమే వకదీక్ష; దృష్టిగోచరమైన రూపభేదములను విడచి సర్వం ఆత్మగా భావించటమే వకదీక్ష. సంకల్పమున బుట్టే సర్వకోరికెలను విడచి మనసును ప్రణవమందున

జేర్చియుంచటమే వకదీక్ష. యీమూడుదీక్షలవలన భవ పుట్టట మనే పాపము నశించి, శాశ్వతమై యుంటా మని చెప్పట. త్రివిధలక్ష్యార్థముల్ తెలియజూచి యనగా అంతర్లక్ష్యము, మధ్యలక్ష్యము, బాహ్యలక్ష్యము అని కలవు. ఈమూడింటిని సాకారలక్ష్యమును విడచి, నిరాకారభావముచెప్పేది యేమంటే అంతర్లక్ష్య మనగా నే ననే తెలివిశూన్య మనిన్ని, శూన్యమైన నావలన గలిగే వ్యాపారములు శూన్య మనిన్నీ తోచేది అంతర్లక్ష్యము. మధ్యలక్ష్య మనగా సర్వ ప్రపంచము మాయ యనిన్నీ, మాయ యనగా యేమిలేదనిన్నీ, యేమి తెలియదనిన్నీ సర్వవేదాంతశాస్త్రములు నిశ్చయించినందున యీ దేహప్రాణేంద్రియములు నేను కాననేది మధ్యలక్ష్యము. బాహ్య లక్ష్యమనగా ఏక మే వాద్వితీయం బ్రహ్మ అనే ప్రమాణము చొప్పున యీస్థావరజంగమాది సర్వప్రపంచమున్ను వక్క- కుక్షి యందే యిమిడి వకటై యున్నందున వక్కడే యని చూడబడేది బాహ్యలక్ష్యము. త్రివిధవర్ణంబుల వివిధమంతయు గన అనగా మూడక్షరములు, మూడక్షరములు యనగా అకార వుకార మకారములు. ఇదే తామస రాజససాత్వికములు. యిదే నాదు బిందు కళలు. నాద మనగా శబ్దము, బిందువు యనగా భ్రమ, కళయనగా చూపు. వీటిలోయున్న యనేకవిధములైన నామరూపకోరికెలను విడచి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే శ్రుతి ప్రమాణమునుబట్టి సర్వం మనఃకల్పిత మని యెంచి మనస్సు మాయగా నెంచి నాదుబిందుకళాతీతుడైన యాత్మ యొక్క-టిగా భావించునదే త్రివిధవర్ణముల భావము. త్రివిధక్రియలను మది దిరుగనియక త్రి యనగా మూడు క్రియ లనగా చేసేవ్యవహారములకు పేరు. మూడు వ్యవహారములు యేవియేవి యనినా కన్నులతో చూచేదిన్నీ, చెవులతో వినేదిన్నీ, మనస్సుతో సంకల్పించేదిన్నీ. యీమూడింటిచేతనున్ను మాయా రూపమైన జగత్తు సత్య మని తోస్తూయున్నది గనుక 'సత్యం జనవిరోధాయ అసత్యం జనరంజకం' అని యున్నదిగనుక సత్యమైన పరమాత్మ

యనగా దృక్కు శబ్ద సంకల్పముచేత నిర్వికల్ప యేకో నారాయణా యనే శ్రుతిప్రమాణముకనుక ముట్టిన వన్నియున్ను మూర్కొన్న వస్తువయున్ను విన్నశబ్దవస్తువుయున్ను పలికిన పలుకున్ను పరమాత్మ నిగా భావించటమే. క్రియలతో మనసు తిరుగకుండా పట్టుట త్రివిధ క్రియ లనబడును. త్రివిధప్రసాదముల్ స్థిరమతి భుజియించి యనగా శ్లో॥ గురుపాదోదకం పీత్వా గురోరుచ్ఛిష్టభోజనం, గురుమూర్తిం సదా ధ్యాయే ద్గురుమంత్రం సదా జపేత్॥ యిందుకు అర్థము గురుపాదోకం పీత్వా గురువాచకం శ్రేష్ఠవాచకం 'న గురో రధికం' అన్నారుకనుక గురు వనగా సర్వప్రపంచాతీతుడైన పరమాత్మ. ఆపరమాత్మకు పాదము లనగా యే ఆధారముచేత నడుస్తూ యున్నాడో అట్టిపాదాక్షరములకు 'శ్లో॥ ఏకాక్షరం ద్వ్యక్షరంవా షడక్షర మథాపివా, అష్టాక్షరంచ మోక్షాయ మంత్రయోగఫలం భవేత్॥' అన్నారుగనుక యట్టిమంత్రాక్షరములు రెండున్ను వానిపాదములు. అట్టిపాదములవలన జారుతూ యున్న యుదకము అనగా అకార వుకార మకారములవలన త్రిగుణాములవలన కలిగే సర్వప్రపంచము మన స్సనిన్నీ అట్టిమనస్సును బహిరంతమున దిరుగ నినక తానైన రెండక్షరములతో యిమిడింపజేసుకోవటమే గురుపాదోదకమును పుచ్చుకోవటము. గురూచ్ఛిష్టాన్నభోజనం గురు వనగా పరమాత్ముడు. 'శ్లో॥ గురు బ్రహ్మ గురు ర్విష్ణుః గురుదేవో మహేశ్వరః, గురు స్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః' అన్నారుగనుక ఆపరబ్రహ్మ విడచిపెట్టినదే వుచ్ఛిష్టాన్నభోజనం గనుక నేతినేతి మహావాక్యముల చేత అవికా వనటమే ఉచ్ఛిష్టాన్నభోజనం. గురుమూర్తిం సదా ధ్యాయే యనగా 'సీ॥ ముట్టినచూచిన మూర్కొన్నవిన్ననూ, పలికిన బ్రహ్మమై బరగవలయు' అని పెద్దలవాక్యములు కాబట్టి సత్తాద్వయములేనందున సర్వము వక్కటి యని మనస్సు బుద్ధికి గలుగజేసుకోవటమే ధ్యానముసేయుట. గురుమంత్రజప మనగా ప్రకృతి యన మాయాశబ్దము. సోహం అని గీర్వాణవాక్యముచేత నీవే నేను యని

పలుకుచున్న సాధారణమును గురుముఖముగా మరలతెలసి తిరుగ దీసి నీ హంసను చేసి నాదుబిందుకళలు అందున జేర్చి ఆకాలమునందు పుట్టబడిన నాదమును జపించుటే సదా గురుమంత్రజపము. 'వాసుదేవ సర్వ మితి సహమాత్మ సదుర్లభః' అని భగవద్వాక్యము ప్రమాణ ముగనుక త్రివిధసూత్రాచార మవిరళముగా అనగా 'ఆత్మసత్యం జగన్మిథ్య సో ౽యం దేవదత్తః' సో యనగా యచల మనిన్ని ౽యం అనగా ప్రకృతి యనే ఉచ్ఛ్వాసనిశ్వాసము లనగా మన నసిన్ని ఆ వాయువులోనే పుట్టిన దనిన్ని గురుసంధిని యభేదము గలిగిన ఆత్మ స్వరూపము తానే ననిన్ని మహావాక్యార్థము. సో నీవు; ౽యం నేను దేవా తెలివినిగూర్చి దత్తః యివ్వబడెను. గంగాయాం ఘోషః ఘోష యనగా గంగలో గొల్లపల్లె యున్న దనే అర్థము కాను లోక సాధారణవాక్యము. తాము మునిగినదే గంగా తామునలచినదే రంభ అని యున్నదిగనుక తా నెక్కడైతే మునుగుచున్నాడో, అదే గంగ యని అర్థము. సర్వప్రపంచము అందులోనే యున్నది. తానలచినది రంభ యనగా ప్రాణముకంటె తీపిలేదు గనుక ప్రాణము లనగా పృథివి ప్రకృతి యనగా స్త్రీ కాబట్టి తా నలచినది రంభ. ఇది జహ ర్లక్ష్యం. జః అందే పుట్టినదానికి పేరు యేమి పుట్టినది హా పుట్టినది. హా యనగా ప్రకృతి. అ లక్షణ మనగా తనవలన పుట్టబడిన సర్వప్రపంచము, జహర్లక్ష్య మనబడును. అజహర్లక్ష్య మనగా అజః అనగా పుట్టలే దన్న అర్థము. ఆదిమధ్యాంతశూన్యం బని పరబ్రహ్మమును చెప్పబడి నది. ఇందుకు లక్షణ మేదంటే జహః లక్షణమును విడచి అజహార్ల క్షణము పుచ్చుకోవటమే లక్షణం. యేమన 'శ్లో॥ అశరీరం సర్వదా నాస్తి శరీరరహితం సదా, యిదమేవ సద్యో ముక్తిః సర్వదా భ్రమ కారణః' అనే న్యాయమే లక్షణము. గుడ్డులలో పిల్లకు పాపపుణ్య ములు కల వని యేశాస్త్రము చెప్పదు గనుక అజహార్లక్షణ మని తెలసేది. యిందుకుప్రమాణము 'సత్యజ్ఞాన మనంత మానందబ్రహ్మ' అనే ప్రమాణము-పొసగిన మాయ పుట్టిన దని చెప్పరాదు. యేమి

చెప్పవలె నన్నా మాయ అనే చెప్పవలెను. మాయ అయినప్పుడు మాయకు కార్యము వకటికలదా? యిందువలన యేమాయె నంటే జగత్తనే శబ్దము లేనట్టాయెను. 'ఏక మే వాద్వితీయం బ్రహ్మ సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే అర్థము నిల్చును.

---

శ్రీసద్గురుభ్యోన్నమః.

శ్రీమత్పిల్లానా శంకర దేశిక ప్రభుల వారి విరచిత దండకము భక్తులు కోరినందున యీగ్రంథమున జేర్చనైనది.

దండకము.

శ్రీ శేవధీ శ్రీచిదోల్లాసుతై నిత్యనిర్లేప్య నిస్సంశ యాత్యంత మాహాత్మ్యమ్ముం జెంది శ్రీ భాగవద్వంశ క్షీరాబ్ధిసంపూర్ణ చంద్రస్థితిం మించు శ్రీమద్గురుస్వామి కృష్ణాఖ్య ధీరోత్తమా నా మనో విత్తమా చిత్తమానందమును బొందగా ప్రాణులం బ్రోచుదేవా దురంత ప్రభావా సుమంత్రానుభావా పరశ్వాఖ్య రామాంఘ్రిసేవా నివాసైక భావా భువిం నేను మీవారిలో వాడనై మిమ్ము సేవింతు భావింతు ధ్యానింతు పూజింతు పూర్వంబునం మీరనేక ప్రజాసంఘముఙ్ జ్ఞానదీపంబు గల్పించి గుర్వంఘ్రి గొల్పించి లక్ష్యంబు దాల్పించి యుద్యత్తమంబెల్ల నిర్మ్మలముం వేడ్కగావించి యుండంగ తద్వార్త లాలించి మీపాదసాన్నిధ్యముఙ్ గాంచి హర్షించి యర్చించి యుండంగ నానా జనశ్రేణి జూడంగ నన్నుండ జారంగ నేమించి యోరోరి పిల్లానయుం పేరెలర్పంగ నాంచపల్లిలో నుందు వోశంకరా భిక్ష్యరాయా భవన్మాసాయాస మేమయ్య నీయాత్మలోనున్న భావంబికఙ్ దాచగా నేటికిం దెల్పరా నిల్పరా చిత్తముఙ్ గూల్పరా యార్వరం స్వల్పరా గంబులఙ్ బూనగా నేటికం చాడగం భక్తిసాష్టాంగముఙ్ జేసి యోస్వామి నిస్వామి చామీ కరాభాస మీచీవగాత్రా పవిత్రా భవత్రా

సర్వత్రా విచిత్రాతి చారిత్ర మీసత్కృపాదృష్టి సంలబ్ధికై వచ్చి యున్నాను నన్నెట్లు రక్షించెదో యిందుగా గోచరానేక రూపంబు లెల్లం సుఖాద్యంత దుఃఖంబులం దేహసంబంధముల్ జీవ సంబంధముల్ నిత్యమందుం నిజంబంచు నే నమ్మి యున్నాను నేనెవ్వడో యీమృగా గోచరవ్యక్త వస్తు వ్రజంబెప్పుడున్ నిత్యమో కాదో భావింపగా దీనలాభంబు చేకూరుటల్ చూడగా నెన్నడో ప్రేమ బోధింపవే యాత్మ శోధింపవే ప్రీతి సంధింపవే దింపవే శంక పొందింపవే తాల్మి నొందింపవే తెల్వి నందింపవే చేతికిన్ నీప్రసాదార్థమున్ నాకు నిక్షేపమా బ్రహ్మదేవోప మా జ్ఞాన దుర్గపమా యింక తత్త్వోప దేశంబు గావించుమా ద్రుంపు మా క్లేశముల్ డెంపు మా జన్మపాశంబులన్ మంత్రమూర్తి దయాసారవర్తి దిగంతస్థకీర్తి సదా ఖండితార్తిన్ జ్ఞానేక్షణ ప్రాప్తితో మూడు నేత్రంబులం మించు వౌశంకరా పావనా శంకరా శంఖ చక్రాంక హస్తంబులన్ మించు దామోదరా సల్లలామోదరా నిత్యసత్యాధి కారత్వముల్ బూను భాషా విలాసా తితిక్షా నివాసా జనాశ్చర్య చర్యా హిమా హార్య స్థైర్యా మహౌదార్య దుర్యా అనిందా ముకుందా సనందా మరింతా వక ధ్యానముల్ మీసమస్థాఘమామోఘ వాక్యంబులం స్తోత్రముల్ జాయగం రెండువేల్నాల్కలున్నట్టి గర్వీకర స్వామికైనం వశంబే మహీదేవ తాముఖ్య నేనెంతవాడన్ నరుండం జడుండం ఖలుండం విటుండం శఠుండం కుబుద్ధిం దురాచారుడం నీచుడం తామసుండం నుశంశుండ నత్యంత చోరుండ నైయ్యా మృషా భాషణుండం విషాదంబు లంజెందు దుర్మార్గ శీలుండనౌ పాప కృత్యుండ నే మందునో దేవ నా చిత్త సందేహముల్ బాపవే శీఘ్ర మందుం భవత్పాదముల్ మోపవే నీదయా దృష్టియున్ జూపవే యోపవే నాదుతప్పుల్ ప్రపంచోపకారా స్మరాకార ధీరా అహంకార దూరా సుధీరా జరాజా మహారాజ యోగాను కారా వికారార్తి ఘోరాంధ కారార్కభూరా దౌరావిన్ పరాకీ మొరాలింపరాదా యటం చామహాభాగునిన్ చిత్త

సింహాసనంబందు పొందించి యా వాహనంబుఁ జేసి గంగాం బురేఖా ఘట శ్రేణితో పాద్యమర్ఘ్యంబు శుద్ధాచమనంబు స్నానంబు వస్త్రోపవీతంబులుఁ గంధ మాల్యంబులుఁ భూషణ వ్రాతముఁ దీపముఁ దూపముఁ మంచి నైవేద్యముఁ దక్షిణా స్వీత తాంబూల మెల్లఁ సమర్పింపు చుఁ జుట్టుగా వచ్చి వేడ్కఁ నమస్కారముల్ చాల పన్నంపు గావించి భక్తిఁ చతుర్ముఖ్య శిరోప్రపలఁ జేశి బద్ధాంజలవ్యక్తహస్తుండ నై నిల్చి యున్నట్టి నావిన్నపంబెల్ల నాలించి ప్రేమఁ విలోకించి తామిట్లు భాషించి రోవత్స నీప్రశ్న మేలై నదా నీప్రకారంబుగా నీ కలక్షోణిలో దెల్పు మంచాడగా నెవ్వరుఁ లేరు సదోఘుప్రితం బింపు శ్వానాళికిఁ గాని చందాన సాధో క్తులుఁ సొంపుగానంచు తాముండు రేమంచు నీవిందు విచ్చేయుటల్ పొందుగా ముచ్చటౌ నాకు యీపెంపు బోధింపుదుం రక్తి బోధింపుదుం యుక్తి రెట్టింపుదుఁ వింటె వా వత్స లోకా చలంబుఁ చలంబీ యుగంబుఁ విమర్శించి యీరెంటి యాద్యంత మెల్లఁ గురు శ్రీ కటాక్షంబునఁ దానెరుంగం మదోన్మత్త మాతంగముఁ సింహముఁ స్వప్న మందుఁ విలోకించి తానాశముఁ బొందు చందాన మాయా వికారంబు నిర్మూలమై పోవు నీరీతియుఁ గానకఁ తాము వేరొండు రీతిఁ పరీక్షించితే తద్వివేకంబె హీనంబగుఁ తాల్మి నాలింపు మం చన్న తత్పాద ధూళిఁ తలందాల్చి విజ్ఞాపనం బల్లనం జేశితిఁ దేశికా యీ చలం బెట్టిదో యా చలం బేమియుఁ లేని వస్తుప్రిజం బెట్టిదో వీని పుట్టించు వాడెవ్వడో స్వామి యీ రెండు నెందుండు నో యాడకుఁ బోవునో ప్రశ్నలఁ జేయునే నెవ్వడో నేడు నిత్యాది సందేహముఁ దెల్పి దెందంబు నంటంగ వేర్వేరు నేర్పాటుగా నాన తియ్యంగ దేయంచు ప్రార్థింప నిట్లాన తీసాగిరోయన్న యష్టాంగ యోగంబులుఁ లెస్సగా నష్టశిద్ధుల్ మత ప్రక్రియా జాలముల్ జూడగా నన్నియుఁ నిత్య మం చున్న వారందరుఁ శాస్త్ర జాలంబనే తాళముల్ పెక్కులుఁ గల్గి జీవేశ్వర వ్యక్త

మైనట్టి ప్రాకార మహా దుర్గ మంబా మహా ద్వార భాగంబునకు
మ్రొక్కఁడే కాని తద్ద్వారమున్ దగ్ధమున్ జేయుచుఁ వచ్చి యానిర్వ
వస్తుక్రమం బంతయుఁ గాంచినట్లైన యాతాళముల్ గూర్పగా దీర్ప
గా జాలు ధీమంతు డే సద్గురుండౌను పాటింపగా నాతడే నామరు
ద్ధేను చంచత్తమోభానుబల్ తాలిమిఁ బూను విశ్వప్రియుండౌను
వేరెవ్వ రైనన్ వెసన్ దియ్య బోతె అసాధ్యంబు తానొక్కటిన్
దియ్యబోతే బదుఁ తాళముల్ కోటి లక్షల్ సహస్రంబు తియ్యంగ
కేలాడ దెవ్వారికిన్ నొచ్చి వేసారియున్ నిల్వకన్ బారియున్ బుద్ధి
నిన్ దూరియున్ తెల్వి నేమారియున్ తాము నేదారియున్ బట్టకన్
గుందుచున్ చచ్చుచున్ బుట్టుచున్ భ్రాంతులై యుందురో మేలు
వీక్షింపరా భూమిలో నింకవింటే అహం బ్రహ్మమస్మ్యాది భాష్యోక్త
మా : నీ మహావాక్యముల్ బట్టు వారందరున్ మాయయె గాని
వేరెందు గాదయ్య వీక్షించు మీవియ్యడం తగడ్రి యింక స్మదిం
దెల్పుదున్ కరి అష్టాంగ యోగంబులన్ ముద్రలున్ గాంచి
యజ్యోతి ముఖ్య ప్రలక్ష్యంబులన్ జూచి యానా నిదే బ్రహ్మ
మంచున్ లయా తీతమంచున్ స్థిరా పూర్ణ మంచున్ భవ క్షేమ
నాశ ప్రదాారం బటంచున్ పునర్జన్మ నిస్త్రాతువంచున్ నిరంతం
బమాయా స్ఫుటంబంచు నేతత్ప్ర భావచ్ఛటా పూర్ణ మంచుబ్ర
యదుష్ట తన్ నష్ట వాక్యంబు పై జ్ఞప్తి లేకన్ ప్రవర్తించు వారం
దరున్ మాయలో జేరువారె తలంపంగ నా జ్యోతి యే యాదిగా
గల్గు వస్తు ప్రజం బెల్ల బైలంచ నంతం బటంచున్ మది సమ్మ్ర
విభ్రాంతియున్ వీడియున్ మాయ రైనట్టి నేసంచు నుల్లంబు లో
నమ్మి నా కెంతయున్ మీదుగా నిండియుండె నిరాకార నిర్లక్ష్య
నిర్వంచ నాద్యంత శూన్యంబు నా బట్టబయలై స్వత సిద్ధమై నిత్యమై
సత్యమై సర్వ కర్తృత్వ భోక్తృత్వ మంతృత్వ యంతృత్వ రక్షత్వ
శిక్షత్వముల్ లేనిదై యున్న దానిన్ గుహోక్త ప్రకారంబునన్ దా
నెరింగిన్ మరిం దాను నేనంచు భాషించు వాక్యాలితో తాన తేనంటు

పై మాట బల్కంగ రాదెన్న డెట్లంటె గాఢాంధ కారంబు విశ్వాస
సంసిద్ధికిన్ మ్రొక్కి తా నాశ్రయించన్ సహస్రాంసు మందుం
నిలం బోయి యేమి లేనట్లు తా నేమియున్ లేక పోతే గణింపంగ
తారాక ముందున్న చందాన నే యెప్పు డున్నట్లుగా నుండు యీ
తెల్వి రీతిన్ ప్రవర్తించకన్ తమ్ముతా మెప్పుడున్ జూచుచున్ నిక్క
చున్ నీల్గుచున్ విర్రవీగంగ నున్నట్టి వారిన్ గనం జోలి నీకేల నా
మాటలన్నమ్మి నీవున్న దున్నట్లు మున్నుంన్నదే నిశ్చయంబంచు సందే
హమున్ హానుమా లేక నేతత్ప్రి కారంబునన్ నీవు వర్తింప వైతేని
నానాపురాణేతి ఆసార్ధ శాస్త్రిక శబ్దంబు వీచీ మహా బుద్బుద గ్రాహ
బిందుచ్ఛటా యుక్తిచే గాన నైనట్టి బల్ సుళ్ళలో జిక్క బాయ్యేవు
మున్నెన్నడిన్ నాల్గు లక్షప్రజన్మంబులన్ బడ్డ ఖేదంబులన్ వెర్రి
మోహంబులన్ తెల్వి లేదా మహా చింతగాదా మనభ్రాంతి బోధా
యమర్యాద గాదా పరీక్షించ రాదా సహాయాస మింకేల నోయన్న
నీకింతగా సత్కృపా దృష్టితో జెప్పినన్ జుల్కగా నందరున్ దెల్పు
వాక్యంబు లల్లెంతయున్ నేడు సామాన్య రీతిన్ విచారింతువో
వూసరక్షేత్రమందున్ సుబీజంబులన్ గూర్చు చందంబునన్ నాదు
సల్లాపముల్ నిష్ఫల ప్రాయమున్ జేయకో యయ్య యీనెయ్య
మయ్యో వృథారీతిగా త్రోచెనా శేయు మాలోచనన్ జక్కగా
నెట్లుగా నేర్పడున్ నీకు నేనర్థ కామంబునన్ ఖ్యాతిలాభాభి రామం
బునన్ దెల్పుటల్ గాదు నాసద్గురు శ్రేష్ఠుడున్ నీచ మార్గంబుతో
మానతీ లేమరా రాజ మార్గం బనుష్ఠింపగా జేశినారయ్య వారంటి
వారెవ్వరుంలేరు భూమండలిన్ వారికిన్ సాటి వారేకదా మింటి
కిం సాటిమిన్నే సముద్రంబు బోలం సముద్రంబె యిబ్భూమికిన్
సాటి యెబ్భూమి యేగాని యింకొక్కటిం లేని చందాన తా
ముండి కారుణ్య సంశీలులై యానతీ జాలు వాక్యంబులన్ కొంద
రా లింప రారీతి యట్లంతె లోకంబునన్ వ్యాఘ్రమున్ జేరి నన్నీవు
భక్షించుమంటే రవంతైన భక్షింపదో తానెతా వొచ్చి భక్షించునే

గాని బల్కిం పరిబోధింప గా బుట్టునే తెల్వి చాలా మనః శ్శుద్ధియుఁ
గల్గి యత్యాతురుండైన ధీశాలి కే లబ్ధమవు గాక సందేహియగా
వానికిఁ పెక్కు రీతుల్ విజృంభించు శాస్త్రంబులుఁ సత్య మంచుం
డు నెవ్వండో యా దేవతా భ్రాంతిలో నుండు యన్వండో పల్మారు
వాదించు నెవ్వండో గుర్వంఘ్రి సంపూజనల్ శాయడెవ్వండో తానె
ట్లు బల్కునో తద్విధానంబుగా బల్కు నెవ్వండో నారీజన భ్రాంతుడెవ్వం
డో విజ్ఞాన విభ్రాంతు డెవ్వండో సద్భక్తి విభ్రాంతు డెవ్వండో వైరాజ్ఞ
మే శ్రేష్ట మంచాడు నెవ్వండో బల్ మోక్ష విభ్రాంతు డెవ్వండో బద్ధుండ
నంచుండు నెవ్వండో యంతో భయంబొందు నెవ్వండో బయలై ప్రవ
ర్తింతు నంచుండు నెవ్వండో నిత్యంబదే నైతి నంచుండు నెవ్వండో ని
త్యాను భావంబికఁ గావలెఁ నేడటంచుండు నెవ్వండో నేనే ని వే
రొండు లేదంచు భాషించు నెవ్వండో లోకంబు నఁ నామతం బెక్కు
వంచుండు నెవ్వండో ఆద్వైత విభ్రాంతు డెవ్వండో యాద్వైతవిభ్రాంతు
డెవ్వండో ఆకర్ణనభ్రాంతు డెవ్వండో దుర్బుద్ధి యవ్వండో యిత్యాదు
లౌవారికిఁ జెప్ప రాదంచు నిర్దేశముఁ జేశిరో విన్ము నేనొక్కటైనఁ
సదా భ్రాంతియుం బుట్టకుండ నిజం బెవ్వరుఁ సూచనఁ జేతురో
యంచు నత్యంత మా సక్తియుఁ గల్గి సందేహముల్ లేక బల్ సూ
క్ష్మ బుద్ధిఁ విజృంభించియుఁ సూచనం జేయుచుండంగ నే యింగి
తం బింతయుఁ గాంతలైనఁ భురిఁ పూరుష ప్రాణులైనఁ తదీయా
శయం బంతయుఁ గాంచు సన్మానస శ్రేణికిఁ ద్వాదశాబ్దంబులెల్లఁ
అంత న్మనో నిష్టలెల్లఁ పరీక్షించి యీరాజ మార్గం బోధింతు రం
చుం వశిష్ఠుండు సాందీపుడుఁ భూమిపుత్రి పితృశ్మాత్ర లేశుండు
ప్రహ్లాదుడుం నారదుండుఁ మరిఁ దేవకీ పుత్రుడో యాదిగా గల్గు
వారందరుఁ బల్కిరో చాలవిద్యైక శూన్యం బలివిద్యైక శూన్యంబు
నైనట్టి మార్గం బొగిం దుర్లభం బంచు ఘోర స్థితిఁ వచ్చినం జెప్ప
రాదంచు బోధించి కారుణ్య దృష్టిం విలోకించి నఁ చంతకుఁ జేరరా
వించి వేడ్కఁ చతుస్సాధన స్ఫూర్తియుఁ గల్గువాడంచు నుల్లంబులో

మెచ్చి యిట్లాడె నోవత్సా నీచిత్తముఁ నిచ్చలం బందగా నిన్ని చం
దంబులఁ జెప్పితిఁ దీనికన్నఁ బరం బెద్దియుఁ లేదు లేదయ్యె
నా సద్గురు స్వామి పాదంబు లానయ్యా యంచుం ద్రిదీక్షావిధిఁ గల్గగా
జేసియుఁ హస్తమస్త ప్రసం యోగముఁ జేసియుఁ సుప్రసాదంబు
లుఁ మూఁడు గల్పించి వేడ్కఁ చతుర్వేద యుక్తంబుతో నాల్గువా
క్యంబులెల్లఁ గటాక్షించి తర్వాత సంపూర్ణ బోధాస్థితిఁ ద్వాదశీ
షోడశీ ధారలఁ వేడ్కమేల్కొల్ప పన్నెండులో నున్న యర్థంబిదే
చూడుమయ్యా స్వతసిద్ధమై నిత్యమై సత్యమై వెల్తియుఁ లేనిదై
పూర్ణమై యున్న దంచుఁ గనం జేసి తర్వాత తామిట్లు భాషించిరో
యప్ప నీ విప్పుడుఁ జూచుటెల్లఁ దయం నేను జూపించుటెల్లఁ
వెసం షోడశీ మంత్రరీతిఁ భువిం దానసన్నం విచారం బొకింతైన
యుం లేక తా నున్న దంచెంతయుఁ దెల్పి నీరీతి దా దెల్పుచుంబ
ల్కు నీమాయ మేలా ఘనం బందులం బుట్టలే దబ్ధికిఁ మీనముల్
బుట్టకఁ మించితా మేమిలేనట్లు నీ వెప్పుడుఁ మూలముఁ లేనివా
డయ్యు నుత్పత్తి ముఖ్యాదులఁ లేకయుం గల్గినట్లంతయుఁ నీకెతో
చుఁగదా కురరియంచుఁ బ్రబోధించి నీవప్పుడుఁ జేయు ప్రశ్నాళి
కిఁ మూఁడు వాక్యంబులఁ దెల్పెదఁ బాలకా విఁ చలంబంటె యా
మాయ నిత్యాచలం బంటె నిర్మాయ పుట్టించువాడెవ్వడుఁ లేడు
విఁ తెల్వి దానే యనేక ప్రకారంబులుఁ జేయు పాటింపగా నాది
వాక్యార్థమే శాశ్వతం బౌను లిఁ మాయ తద్వ్యాప్తి తానే యనేక
ప్రకారంబులుఁ జేయు వాక్యార్థమా పోదు విఁ మాయ తామాయ
మై పోవు లిఁ ప్రశ్నలఁ జేయు నీ వెప్పుడుఁ మాయవే ద్రుష్టికిఁ
గోచరంబైన యల్లఁ వెసఁ మాయ యైనప్పుడుఁ లాభమే లేదు
లేదంచు బోధించి యున్నట్టి తద్వాక్య మేమంచు వర్ణింతు వర్ణింపగా
నెద్దియుఁ లేదు నేనేమియుఁ లేదు నీవేమియుఁ లేదు లేదుగా కొంద
రల్పుల్ భువిఁ దీనినాలించి *గర్వింతురా వారుగర్వించగా నేమియా
సంపంగముఁ భృంగమున్ వీడితె దానికిఁ దక్కువే మాను నీబోధ

యుత్తుంగమహాదీనినీ విప్పుడున్ బోధయున్ జేయుమంచాడగా నిశ్శరింగిం చితిన్ దిన్నగా దీని మేల్వెద్దలున్ జేరి తత్పూజ గావించి ఈతీరెరుంగన్ మిగున్ వింటివా మిత్రి మద్దేశుకున్ ధ్యానమున్ జేతు । కృష్ణాఖ్య గురు వర్గగణ్యా యగణ్యా ప్రపుణ్యా సువాణ్యాద్య కారుణ్య తారుణ్య మూర్తి ప్రముఖ్యా సువిఖ్యాత సౌఖ్యా నిరాకార నిర్లేప్య నిష్కార్య నిష్కామ్య నిర్దోష నిఃసామ్య నిర్వాత్య నిశ్చింతయోగి నమస్తే నమస్తే నమః

దండకం సంపూర్ణం.

---

సీ॥ నియతి రామా యంచు నీనామము స్మరించు భాగ్యశాలికి వేద పాఠమేల । నిను నొక్కసారైన గనుగొన్న సుజ్ఞాన నిధికి బ్రహ్మ జ్ఞాన నిష్ఠయేల । నీకటాక్షము దారి నిముషమాత్రము కోరి చెలగు మేటికి తీర్థ సేవయేల । నీమూర్తి గనుగొన్న నిపుణుజేరి భజించు స్థిరబుద్ధికి తపంబు శేయనేల॥ గీ॥ నిన్ను వినుతింపుచుండెడి నా నిష్కపముగ । చింత శేయంగ మణిమాది సిద్ధులేలా । జానకీనాథ నీపాద జలముగ్రోలు । ఘన గుణాబ్ధికి దేవత్వ కాంక్షయేలా॥

యని వుత్తర రామాయణములో నాభక్తుడు వచించు పకి పద్యము యెన్నివేలకోట్ల విలువను పోల్చినా నాపద్యవెలకు సరితూగదు. గాన నోపుజనాత్మ విచారణీయులారా మన మెల్లరము నా సద్గురుమూర్తి యగు శ్రీ వేంకటేశ్వర దేశికప్రభువు స్వాములవారిని యహోరాత్రులు నిష్కపటచిత్తులమై యీర్ష్య యసూయ డంబ దర్ప శోక మోహములను మిక్కిలి కపటచేష్టలొనర్చుట కునికి పట్టగు యీదేహమును శ్రీ సద్గురుస్వాములవారానతిచ్చు నిస్సంశయాత్మకమగు సద్బోధను చిత్తచలనమీడి విని అనుభవంబు చూచి నంది రహితులమైతి మని నిశ్చయించి నిశ్చయించుదానిని నెమ్మనం బందెపుడు జ్ఞప్తికి రానీయకయుండి లేనివారలమై పోయిన అనాద్య

విద్యమా యను తిరిగి మనపైకి రానీయకుండె సౌజ్ఞనంది స్థిరబుద్ధి స్థిరభక్తి స్థిరధ్యాన స్థిరశేవ జేయుచు మనలవతు జనులందరు చేయ దగినంత సదుపాయముల జూపుచు సత్యమగు భక్తిచే మేనుమరచి సమస్త దృష్టిగోచరమగు వస్తువులు దృఃగోచరము గాకుండాయుండి నిర్మలచిత్తత గల వారల చెరచి సద్గురువాజ్ఞ నుల్లంఘించి జనన మరణ ప్రివాహాముఅందు బడిపోక సద్గురుమూర్తి పరమేశ్వరు డని నమ్మి యుండుద మని యీాదాసుని ప్రార్థన. తదుపరి మీాయిష్టము. యింకా ఆదిశంకరు లగు శ్రీ శంకరాస్వాములవారు సద్గురుమూర్తియే మిగుల శ్రేష్ఠులని వారు ప్రార్థించుచు వారొనర్చు ద్వాదశ శ్లోకముల మరు వక మనమెల్లరము ప్రార్థించుకొనుటకు యీాక్రింద వ్రాసుకొనుచుంటిని. యిదే నావందనము.

శ్లో॥ శ్రీ సమంచిత మద్వయం పరమప్రకాశ మగోచరమం
భేదవర్జిత మప్రమేయ మనంత మాద్యయే కల్మషం
నిర్మలం నిగమాంతమద్వయ మప్రిర్క్యమబోధకం
ప్రితరే వహిమాన సాంతర్భావయే గురు పాదుకాం. 1

శ్లో॥ నాదు బిందు కళాత్మకం దశనాద భేద వినోదకం
మంత్రిరాజ విరాజితం నిజ మండలాంతర్భాసితం
పంచరత్న మఖండ మద్భుత మాదికారణ మత్యుతం
ప్రితరే వహి మానసాంతర్భావయే గురు పాదుకాం. 2

శ్లో॥ హంసచార మఖండనాద మనేక వర్న మరూపకం
శబ్దజాల మయం చారాచర జంతుదేహ నివాసినం
చక్రిరాజ మనాహతోద్భవ మేఘవర్న మితఃపరం
ప్రితరే వహిమాన సాంతర్భావయే గురు పాదుకాం. 3

శ్లో॥ బుద్ధిరూప మబుద్ధికం త్రితమైక కూట నివాసనం
నిశ్చలం నిరతఃప్రికాశ మనేకరూప మరూపకం
పశ్చమాంతర ఖేలనం నిజశుద్ధ గుహ్యమగోచరం
ప్రితరే వహిమాన సాంతర్భావయే గురు పాదుకాం. 4

శ్లో॥ స్థూల సూక్ష్మ సకారణాంతర హేలనం పరిపాలనం
విశ్వతైజస ప్రాజ్ఞచేతం సమంతరాత్మ నిజస్థితం
సర్వకారణ మీశ్వరం నిటలంత రాళవిహారిణాం
ప్రాతరే వహిమాన సాంతర్భావయే గురు పాదుకాం. 5

శ్లో॥ పంచ పంచ వృషీక దేహ మనోచతుష్క పరస్పరం
పంచకోశ జగత్రియాది సమస్త ధర్మ విలక్షణాం
పంచకోశ సకామ షడ్గుణ మీశశబ్ద మచేతనం
ప్రాతరే వహిమాన సాంతర్భావయె గురు పాదుకాం. 6

శ్లో॥ పంచముద్ర సులక్ష్యదర్శన భావమాత్మ స్వరూపిణాం
విద్యుదాది ధగద్ధగిత సవేదశాస్త్ర వినోదకం
బిన్నమార్గ నవరత్నం సద సద్విలాస మనామయం
ప్రాతరే వహి మానసాం తర్భావయే గురు పాదుకాం. 7

శ్లో॥ పంచరత్నసుఖం స[illegible]స్థః ఋషివిచారణ కారకం
చంద్ర సూర్య చిదగ్నిమండల మండితాం ఘనచిన్మయం
చిత్కళా పరిపూర్ణమాంతర చిత్సమాది విలక్షణం
ప్రాతరే వహిమాన సాంతర్భావయే గురు పాదుకాం. 8

శ్లో॥ తప్తకాంచన దీప్త్యమాన మహాణురూప మరూపకం
చంద్రకాంతర తారకైరవ ముజ్వలం పరమీశ్వరం
నీలనీరద మధ్యసంస్థిత విద్యుదాది విభూషితం
ప్రాతరే వహిమాన సాంతర్భావయే గురు పాదుకాం. 9

శ్లో॥ హాదతం విమలం మనోగ్ర విభాసితం పరమాణుకం
నీలమధ్య సునీలసన్నిభ మాదిబిందు నిజాంశుకం
సూక్ష్మకర్మిక వాసినం జల వహ్ని రూపక మీశ్వరం
ప్రాతరే వహి మాన సాంతర్భావయే గురు పాదుకాం. 10

శ్లో॥ జన్మ కర్మ తిహీనకారణ హేతుభూత మభూతకం
జన్మకర్మ నివారకం రుచిపూరకం భవతారకం

నామరూప వివర్జితం నిజ నాయకం సుఖదాయకం
ప్రాతరే వహి మాన సాంతర్భావయే గురు పాదకం 11
శ్లో॥ వ్యోమవ ద్బహిరంతర స్థితమక్షరం నిఖిలాత్మకం
కేవలం పరిశుద్ధమేకమ జన్మహీ ప్రతిరూపకం
బ్రహ్మతత్వవి నిర్ణయం నిరతాను మోక్ష మబోధకం
ప్రాతరే మహి మానసాంతర్భావయే గురు పాదుకాం. 12

ఇది శ్రీ శంకరాచార్య విరచిత గురు పాదుకా
ద్వాదశాస్థనము సంపూర్ణం.

---

మానస పూజ కీర్తన.

కరహర ప్రియరాగం — ఆటతాళము.

ప॥ ఆరా •దయామి శ్రీ। నారాయణా నంత । ఘోర సంసార । వి
దూర నివారిమం । ఆరా దయామీ శ్రీరఘురామ మీకు ।
ఆరదయామి శ్రీమహదేవా॥ ధ్యానం సమర్పయామి॥
ఆవాహనాది షోడశో వుపచారాలు । దేహబుద్ధులు మానీ , సో
హం బ్రహ్మం బాని । ఆవాహన మిదుగో శ్రీరఘురామా
మీకు ఆవాహనమిదుగో శ్రీమహదేవా॥ ఆరాదయామి॥
ఆవాహనం సమర్పయామి.
భాసూర మైన నాహృదయ । కమల మందు । నివాసుడై యున్న
శ్రీ। వాసుదేవ నీకు । ఆసా నామిదుగో శ్రీరఘురామా మీకు ,
సింహాసా నమిదుగో శ్రీమహదేవా॥ ఆరాదయామి॥
రత్న సింహాసనం సమర్పయామీ.
విద్య ప్రకాశా విద్య నాశన సర్వా । బుద్ధిపేరణ సం । వేద్య
చిద్రూప సు । పాద్యామిదుగో శ్రీరఘురామా । మీకుపాద్య
మిదుగో శ్రీమహదేవా॥ ఆరాదయామి॥
పాద్యం సమర్పయామి.

సర్గాది భోగములు । దుర్గాతి గావించి । అర్ఘ్య సానేంద్రియ ।
బుద్ధ్యాదులు మీకు । అర్ఘ్యమిదుగో శ్రీరఘురామ । మీకు అర్ఘ్య
మిదుగో శ్రీ మహదేవా॥ ఆరాదర్ఘయామి॥

అర్ఘ్యం సమర్పయామి,

వాచామ గోచార వో చిదాత్మక రూప వాచ్యార్థములు మాని
మీచెంత జేకూట । ఆచమానము శ్రీరఘురామా । మీకు ।
ఆచమానము శ్రీమహదేవా॥ ఆరాదయామి॥

ఆచమానం సమర్పయామి.

కుమురుగ మీదివ్య । మధుర రామామృత । మొదలాక యెప్పుడు
హృదయ మందుంచుట । మధుపర్క మిదుగో శ్రీరఘురామా
మీకు । మధుపర్క మిదుగో శ్రీమహదేవా॥ ఆరాదయామి॥

మధుపర్కం సమర్పయామీ.

పంచ భూతోత్పన్న । పంచేంద్రియ మాని । చంచాల మిడిమీ
యందుంచుట । యిదిమీకు పంచామృతము శ్రీరఘురామా మీ
కు । పంచామృతము శ్రీమహదేవా॥ ఆరాదయామి॥

పంచామృత స్నానం సమర్పయామి.

మానాభి మానములు మానుచు సుజ్ఞాన । స్వానూభావ మృతలీల
మగుచు శుద్ధ ॥ స్నాన మిదిగో శ్రీరఘురామా మీకు । శుద్ధస్నాన
మిదుగో శ్రీమహదేవా॥ ఆరాదయామి॥

శుద్ధోదక స్నానం సమర్పయామి॥

చిత్రి విచిత్రి కల్పన మాయ రహితా । చిన్మాత్రూత్రిజై వేదాంత
శాస్త్రవర్తులు మీకు । వస్త్ర మిదుగో శ్రీరఘురామా । మీకు
వస్త్ర మిదుగో శ్రీమహదేవా॥ ఆరాదయామి॥

వస్త్రం సమర్పయామి.

అజ్ఞాన నాశాన । ప్రిజ్ఞనాశన సర్వ । యజ్ఞోపాలక మీకు ।
సుజ్ఞానసూతాత్రిము । యజ్ఞోపమీత మిదుగో శ్రీరఘురామా ।
మీకు యజ్ఞోపవీత మిదుగో శ్రీమహదేవ॥ ఆరాద్ధయామి॥

యజ్ఞోపవీతం సమర్పయామి.

బంధ మోక్షములేక అందారి యందున్న। సుందార యానంద నంద గోవింద సు। గంధ మిదుగో శ్రీరఘురామా, మీకు సుగ్గంధ మిదుగో శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥

గంధం సమర్పయామి.

యెరుక మరుపులు లేక। స్థిరకాలమై యున్న తిలకు। తిలకున సిరు లోలకి చిదానంద। తిలక మిదుగో శ్రీరఘురామా, మీకు తిలక మిదుగో శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥

తిలకం సమర్పయామి.

ఆజరత్వ యమృతత్వ। ఆధ్యాంత రహితత్వ। ఆజరత్వ ఆమృతత్వ। ఆగణి సునందాది, ఆభరణమూ శ్రీరఘురామా। మీకు ఆభరణ మిదుగో శ్రీమహాదేవా॥ ఆరాదయామి,

ఆభరణము సమర్పయామి.

పాపనాశన నామరూపా రహిత సర్వ। తాపానివారాణా॥ వ్యాపాక మజ్ఞాన। దీపా మిదుగో శ్రీరఘురామా। మీకు దీపా మిదుగో శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥

దీపం సమర్పయామి.

దుష్ప్రిజ్ఞములు మాని। తస్పజ్ఞ గై కొని, నిప్ప్రిపంచుడ మీకు। స్వస్వరూప జ్ఞాన పుష్ప మిదుగో శ్రీరఘురామా మీకు। పుష్ప మిదుగో శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥

పుష్పం సమర్పయామి.

నాపాలి దైవమా। వో పరమేశా నే। నీపాల బడితి నను గాపా డుకే నీకు। దూప మిదుగో శ్రీరఘురామా। మీకు దూప మిదుగో శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥

దూపం సమర్పయామి.

దేవాదిదేవా సుపౌన చారిత్రాది। జీవ పరమాత్మైక్యస్వాను। భావమగుట నైవేద్య మిదుగో శ్రీరఘురామా మీకు। నైవేద్య మిదుగో శ్రీమహాదేవా॥ అరాదయామి॥

నైవేద్యం సమర్పయామి.

డంబదర్ప దేశాహం భావములు మాని। శంభు పూజిత చిద్బిం
బాము లనియేటి, తాంబూల మిదుగో శ్రీరఘురామా మీాకు।
తాంబూల మిదుగో శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥
తాంబూలం సమర్పయామి.

దారిద్రినాశానా। దామోదరానంత। దీన పోషణ మీాకు।
దానమె సన్మాన। దక్షిణ యిదుగో శ్రీరఘురామా। మీాకు
దక్షిణ యిదుగో శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥
దక్షిణ సమర్పయామి.

వీక్షణములు వీడి దీక్షాలుగావించి, పక్షివాహన మీాకు, చిత్క
ళలనియేటి, అక్షింత లివిగో శ్రీరఘురామా మీాకు, అక్షింత
లివిగో శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥
అక్షింతలు సమర్పయామి.

సంతతమును యేకాంత భక్తితోను, నిరంతారునకు। శుద్ధాం
తఃకరణా దివ్య। మంత్రి పుష్పము శ్రీరఘు రామా, మీాకు
మంత్రి పుష్పము శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥
మంత్రి పుష్పం సమర్పయామి.

నాతత్రి సూర్యోప నాతి। చంద్రి మాతార। నిత్యప్రికాశా
నిరంజాన। నిర్గుణ నీరాంజనము శ్రీరఘు రామా మీాకు నీరాం
జనము శ్రీమహాదేవా॥ ఆరాదయామి॥
నీరాంజనము సమర్పయామి.

ఛత్రి చామర రభ్యనుక్షి దర్పణ తార, నిత్య పూజలు మీాకు
వుత్తర గీతాలు సమస్థోపచారములు శ్రీరఘురామా। మీాకు షో
డశోపచారములు మహాదేవా॥ ఆరాదయామి॥
షోడశోపచారములు సమర్పయామి.

రామ బ్రహ్మానంద స్వామి కింకరదాసు । రామదాసు ను నేనూ మానాసా పూజాలూ । నీనామము గడుపింతూ శ్రీరఘురామా మిాకు । నీనామముగడుపూను మహదేవా॥          ఆరాదయామి॥

శ్రీనారాయణానంత.

**మానస పూజా సంపూర్ణము.**

---

శ్రీరస్తు.

శ్రీ నిజగురు పూజావిధానము.

శ్లో॥ శ్రీమద్భాను శశాంక సంగతపరం చిద్బిందు మధ్యస్థితం
నిష్కామం నిరుపద్రవం ప్రవిమలం నిర్ఘోషః నిర్లేపనం
భక్తాభీష్ట ఫలప్రదం సుఖకరం భవ్యైకనిత్మాకం
శ్రీమన్మాధవ రాజవంశ జనితం శ్రీ వేంకటార్యం భజే
శ్రీకృష్ణ శంకర వేంకటేశ్వర ప్రభు నిజగురుస్వామి నేనమః.

శుభంభవతు.

శ్లో॥ హృత్పుండరీక మధ్యస్తం సకలామ్నాయ సంస్థుతం
ధ్యాయామ్యహంసదా భక్త్యా సకలాభీష్ట దాయకా
శ్రీమన్మాధవ రాజ వేంకటేశ్వర ప్రభు నిజగురు పరమగురు
పరమేష్టిగురు పరబ్రహ్మణేనమః.
ధ్యానం సమర్పయామి.

శ్లో॥ ఆగచ్ఛానంత దేవేశా భోగ మోక్ష ప్రదాయకా
నాకేశా ముఖలోకేశా వందితాంఘ్రిద్వయాంభుజ.
శ్రీమన్మాధవ రాజ వెంకటప్రభు ఆవాహనం సమర్పయామి.

శ్లో॥ రత్నసింహాసనం దేవా సంగృహాణ మయార్పితం
చంద్రమండల సంకాశా సంస్మితానన పంకజ.
శ్రీమ॥ అనేకమణిమయరత్న ఖచితసింహాసనంసమర్పయామి.

శ్లో॥ పాద్యం గృహాణభో స్వామిం మయానీతం సుభప్రదం
కృష్ణవేణీ జలం భక్త్యా తీర్థపాద జగద్గురో.
శ్రీమ॥ పాదయోః పాద్యం సమర్పయామి.
శ్లో॥ అర్ఘ్యం దాశామ్యాహం భక్త్యా। తవపాణి తలే విభో
గోదావరీజం। హేమకలశస్థం సువాసితం.
శ్రీమ॥ హస్తయో ఆర్ఘ్యం సమర్ప యామి.
శ్లో॥ ఆచమ్యతాం సయాదత్తం। హేగురో్యమునాజలం
త్వదర్థం కృపయాభావ। భవబాధనికృత్తనం
శ్రీమ॥ ముఖే ఆచమనీయం సమర్పయామి.
శ్లో॥ శర్కరా దధి మద్వాద్య క్షీర మిశ్రమిదం విభో
పంచామృతం మయాదత్తం స్నానం కురుజగత్పతే.
శ్రీమ॥ పంచామృత స్నానం సమర్పయామి.
శ్లో॥ తప్త కాంచన కుంభస్థం కించిదూష్ణం సువాసితం
మయా నీతం జహ్ను కన్యా జలస్నానం కురు ప్రభో
శ్రీమ॥ శుద్ధోదక స్నానం సమర్పయామి.
శ్లో॥ వస్త్ర యుగ్మం మయాదత్తం త్వదర్థ స్వర్ణతం తున
నిర్మితం నిర్మలం స్వామిం నిత్యకళ్యాణ పావనా-
శ్రీమ॥ అలంకారణార్థం వస్త్రయుగ్మం సమర్పయా॥
శ్లో॥ కార్పాసతం తునాశుభ్రం రచితం తేర్పితం మయాసం
గృహాణమిదం యజ్ఞ సూత్రం పాత్రం దయానిధే.
శ్రీమ॥ యజ్ఞోపవీతం సమర్పయామి.
శ్లో॥ కిరీటం కుండలం రత్న కంకణాది నితెమయాసంగృహ్య
తాం భూషణా నీ అర్పితాని నిరంజనా.
శ్రీమ॥ సర్వాభరణ భూషణాన్ సమర్పయామి.
శ్లో॥ మలయాచల సంభూతం కర్పూరకలితం విభో
విలేపనం త్వదర్థం బోగృహ్యాతా మర్పితం మయా.
శ్రీమ॥ గంధం సమర్పయామీ.

శ్లో॥ తండులాన్ ధవళాకారాన్ హరిద్రాచూర్ణమిశ్రితాన్
గృహ్యతా మక్షతాన్ దేవ మయా దత్తాన్ మనోహరాన్.
శ్రీమ॥ అక్షతాం సమర్పయామి.

శ్లో॥ పుష్పా ణ్యనేకాని సుపల్లవాని సుగంధయుక్తాని మనోహరాణి
త్వం గృహ్యతాం దేవ మయార్పితానిజలాశయస్థాని జపాదికానీ.
శ్రీమ॥ పుష్పం సమర్పయామి

అథ అంగపూజా.

తీర్థ పాదాయనమః పాదౌ పూజయామి ౧
నిగమ మంజీరాయ నమః గుల్ఫౌ పూజయామి ౨
స్మర తూణీర జంఘాయనమః జంఘౌ పూజయామి ౩
ముక్తి కాంత సేవితాయై నమః జానునీం పూజయామి ౪
రత్న స్తంభోరు యుగళాయై నమః ఊరూ పూజయామి ౫
పులినతల జఘనాయనమః జఘనౌ పూజయామి ౬
మణి కాంచికలాప శోభితాయై నమః కటిం పూజయామి ౭
విశ్వోదరాయై నమః ఉదరం పూజయామి ౮
దయార్ద్ర హృదయాయై నమః హృదయం పూజయామి ౯
విశాలవక్షాయైనమః వక్షస్థలం పూజయామి ౧౦
కంబు గ్రీవాయై నమః కంఠం పూజయామి ౧౧
వరదాన ధురీణాయై నమః హస్తౌ పూజయామి ౧౨
ఉన్నత స్కంధాయై నమః భుజౌ పూజయామి ౧౩
స్మిత వక్త్రాయై నమః వక్త్రం పూజయామి ౧౪
చంపక నాసికాయై నమః నాసికం పూజయామి ౧౫
పల్లవాధరాయై నమః అధరం పూజయామి ౧౬
పుండ్రేక్షు కార్ముక భ్రూవే నమః భ్రూయుగ్మం పూజయామి ౧౭
కరుణా కటాక్ష వీక్షణాయై నమః నేత్రౌ పూజయామి ౧౮
కృష్ణకర్ణాయై నమః కర్ణౌ పూజయామి ౧౯
రాకా సుధాంశు వదనాయై నమః ముఖం పూజయామి ౨౦

సులలాటా యైనమః లలాటం పూజయామి ౨౧
నీల కుంచిత మూర్ధజాయై నమః కేశాన్ పూజయామి ౨౨
సు వృత్త శిరస్కాయై నమః శిరః పూజయామి ౨౩
సర్వాత్మనే నమః సర్వాంగాని పూజయామి ౨౪

అథపత్రిపుష్పపూజా.

అచింత్యా యైనమః బిల్వ పత్రిం సమర్పయామి ౧
బృందారక వందితా యైనమః తులసీ దళం సమర్పయామి ౨
భువన రక్షణ తత్పరాయై నమః వకుళ పుష్పం సమర్పయామి ౩
భూరి విభవా యైనమః పున్నాగ పుష్పం సమర్పయామి ౪
జగజ్జనన కారణాయ నమః కేతకీ పత్రిం సమర్పయామి ౫
చరాచర గురువే నమః చామంతికా పుష్పం సమర్పయామి ౬
సుప్రిభావా యనమః చంపక పుష్పం సమర్పయామి ౭
సు ప్రిసన్నాయ నమః పాటలీ పుష్పం సమర్పయామి ౮
అప వర్గ ప్రిదాయ నమః శత పత్రి పుష్పం సమర్పయామి ౯
అనంతా యనమః జాజిలీ పుష్పం సమర్పయామి ౧౦
మోహా వర్జితా యనమః కరవీర పుష్పం సమర్పయామి ౧౧
ముకుందాయ నమః రసాల పుష్పం సమర్పయామి ౧౨
ప్రకృతి పురుష విలక్షణాయనమః మాలతీ పుష్పం సమర్పయామి౧౩
నిత్యా యైనమః కల్హార పుష్పం సమర్పయామి ౧౪
ఆజ్ఞేయ చక్రినిలయా యనమః అతసీ పుష్పం సమర్పయామి ౧౫
నాద బిందు కళా తీతాయనమః పారుజాత పుష్పం సమర్పయామి౧౬
భూతాత్మనే నమః అశోక పుష్పం సమర్పయామి ౧౭
మండల త్రయా తీతాయ నమఃనీలోత్పల పుష్పం సమర్పయామి ౧౮

అథఅష్టోత్తరశతనామపూజా.

ఓం సద్గురవే నమః ౧
ఓం పూర్ణాయ నమః ౨
ఓం సంర్వాధరాయ నమః ౩
ఓం స్వచ్ఛాయ నమః ౪
ఓం శుద్ధాయ నమః ౫
ఓం నిర్మలాయ నమః ౬

ఓం విశ్వోదరాయ నమః ౭
ఓం నిరాలంబాయ నమః ౮
ఓం రమ్యాయ నమః ౯
ఓం నిర్వాసనాయ నమః ౧౦
ఓం నిర్లేపనాయ నమః ౧౧
ఓం నిర్గంథాయ నమః ౧౨
ఓం స్వప్రకాశాయ నమః ౧౩
ఓం నిత్యతృప్తాయ నమః ౧౪
ఓం అనంతాయ నమః ౧౫
ఓం అద్వితీయాయ నమః ౧౬
ఓం వేదవాచామవేద్యాయనమః
ఓం పరంజ్యోతిషే నమః ౧౮
ఓం ప్రణవాతీతాయ నమః ౧౯
ఓం అచలాయ నమః ౨౦
ఓం అపరిమితాయ నమః ౨౧
ఓం అప్రమేయాయ నమః ౨౨
ఓం అవ్యయాయ నమః ౨౩
ఓం అచ్యుతాయ నమః ౨౪
ఓం అహంకార వివర్జితాయనమః
ఓం విశ్వాత్మనే నమః ౨౬
ఓం ప్రపంచాతీతాయ నమః
ఓం మాననీయాయ నమః ౨౮
ఓం క్షరాక్షర విలక్షణాయ నమః
ఓం దృగ్దృశ్యాతీతాయ నమః
ఓం ద్వైతా ద్వైత వినిర్ముక్తా
యః నమః ౩౧
ఓం అఖండాయ నమః ౩౨

ఓం ఖండాఖండ విరహితాయ
నమః ౩౩
ఓం ఆదిమధ్యాంత శూన్యాయ
నమః ౩౪
ఓం నిరంజనాయ నమః ౩౫
ఓం నిర్వికల్పాయ నమః ౩౬
ఓం నిరాకారాయ నమః ౩౭
ఓం నిరాఖ్యాతాయ నమః ౩౮
ఓం పరమానంద స్వరూపాయ
నమః ౩౯
ఓం సగుణ నిర్గుణా తీతాయనమః
ఓం సర్వసాక్షిణే నమః ౪౧
ఓం సాక్ష్యాతీతాయ నమః ౪౨
ఓం త్రిగుణాతీతాయ నమః ౪౩
ఓం సర్వభూతాంతరస్థాయ నమః
ఓం సుఖదుఃఖ విరహితాయనమః
ఓం జన్మజరా మరణ వర్జితాయ
నమః ౪౬
ఓం క్షేత్రజ్ఞాయ నమః ౪౭
ఓం సర్వోపనిషత్సారాయనమః
ఓం నిష్కళంకాయ నమః ౪౯
ఓం నిరాభాసాయ నమః ౫౦
ఓం స్వప్రకాశాయ నమః ౫౧
ఓం సృష్టిస్థిత్యంత కారణాయనమః
ఓం సచ్చిదానందాతీతాయ నమః
ఓం కర్తృత్వ రహితాయ నమః
ఓం అపరోక్షాయ నమః ౫౫

ఓం సకలమంత్ర స్వరూపాయ నమః
ఓం ఆకాశతనవే నమః ౫౭
ఓం నిరాధారాయ నమః ౫౮
ఓం నిస్తేజసే నమః ౫౯
ఓం అవికారాయ నమః ౬౦
ఓం అమలాయ నమః ౬౧
ఓం పరతత్త్వాయ నమః ౬౨
ఓం పరంధామ్నే నమః ౬౩
ఓం అజాయ నమః ౬౪
ఓం అగమ్యాయ నమః ౬౫
ఓం షడ్గుణైశ్వర్య సంపన్నాయ నమః ౬౬
ఓం సనాతనాయ నమః ౬౭
ఓం త్రిమూర్త్యాత్మనే నమః ౬౮
ఓం అనాద్యంతాయనమః ౬౯
ఓం సర్వోపాధివినిర్ముక్తాయనమః
ఓం భక్తాభీష్ట ఫలప్రదాయ నమః
ఓం భవరోగ భైషజ్యాయ నమః
ఓం సహస్రార చక్రమధ్యస్థాయ నమః ౭౩
ఓం సనకాదిమునివందితాయనమః
ఓం కామక్రోధాది శత్రునికృంతనాయ నమః ౭౫
ఓం కరుణా రసార్ద్రహృదయాయ నమః ౭౬
ఓం బ్రహ్మ విష్ణు మహేశ్వర స్తుత్యాయ నమః ౭౭

ఓం బ్రహ్మాండ జనకాయనమః ౭౮
ఓం పరమ పావనాయ నమః ౭౯
ఓం దీనజనానుగ్రహాయనమః ౮౦
ఓం దివ్యపురుషాయ నమః ౮౧
ఓం ప్రపన్న పారిజాతాయ నమః
ఓం పురాణ పురుషాయ నమః ౮౩
ఓం నిరుపద్రవాయ నమః ౮౪
ఓం నిత్యకళ్యాణాయ నమః ౮౫
ఓం సర్వోపనిషత్పంజర కీరాయ నమః ౮౬
ఓం శబ్దాతీతాయ నమః ౮౭
ఓం జగన్నాథాయ నమః ౮౮
ఓం జగద్గురవే నమః ౮౯
ఓం విష్ణవే నమః ౯౦
ఓం సర్వతోభద్రాయ నమః ౯౧
ఓం నిగమార్థ ప్రతిపాదకాయ నమః ౯౨
ఓం నిస్సంగాయ నమః ౯౩
ఓం సహజానందాయ నమః ౯౪
ఓం చిన్మయాయ నమః ౯౫
ఓం శ్రీమతే నమః ౯౬
ఓం సహజామనస్కాయనమః ౯౭
ఓం సాయుజ్యప్రదాయ నమః ౯౮
ఓం పంచబ్రహ్మ మయాయ నమః
ఓం అజడాయ నమః ౧౦౦
ఓం జడాజడ విలక్షణాయ నమః

ఓం భావాభావ మధ్యస్థాయ నమః ౧౦౨
ఓం అష్టనస్కాయ నమః ౧౦౩
ఓం అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకాయ నమః ౧౦౪
ఓం సర్వాత్మనే నమః ౧౦౫
ఓం పరాత్పరాయ నమః ౧౦౬
ఓం లక్ష్యాతీతాయ నమః ౧౦౭
ఓం మనోవాగగోచరాయ నమః

శ్రీమ॥ నానావిధ పరిమళ పత్రి పుష్పాణ్ సమర్పయామి.

శ్లో॥ చందనాగరు కర్పూర శర్కరాజ్య సమన్వితం
ధూపోయం గృహ్యతాం స్వామి త్వ మిదం తే మయార్పితం.
శ్రీమ॥ ధూప మాఘ్రాపయామి.

శ్లో॥ వహ్నినా యోజితం సాజ్యం దీపం వ ర్తి త్రియాన్వితం
గృహాణ జ్ఞాన తిమిర హర జ్ఞాన ప్రివర్ధనం.
శ్రీమ॥ దీపం దర్శయామి.

శ్లో॥ శాల్యన్నం షడ్రసోపేతం పంచభక్ష్యాది సంయుతం
నైవేద్యం దేవదధ్యాజ్య సమ్మిశ్రిం ప్రతిగృహ్యతాం.
శ్రీమ॥ మహా నివేదనం సమర్పయామి.

శ్లో॥ పానీయం శీతలం స్వచ్ఛం మధ్యేమధ్యే మయార్పితం
సుగంధయు క్తం మధురం పిబ త్వం పురుషో త్తమ.
శ్రీమ॥ మధ్యే మధ్యే ఉదకపానీయం సమర్పయామి.

శ్లో॥ సుపక్వానేకాని రంభామ్రజంబూపనస ఖర్జుర
నారంగదాడిమాదికాని త్వ మేతానిసంగృహ్యతాం.
సప్వకాశా ఫలాని ప్రిదేయాని సర్వాణి తేద్య.
శ్రీమ॥ ఫలోపహార నై వేద్యం సమర్పయామి.

శ్లో॥ తాంబూలం గృహ్యతాం పూగీఫల కర్పూర సంయుతం
నాగవల్లి దళాద్యంతం గురో తుభ్యం మయార్పితం.
శ్రీమ॥ తాంబూలం సమర్పయామి.

శ్లో॥ సువర్ణోదరగర్భ స్త్వం స్వర్ణ బీజం మయార్పితం
అనంతపుణ్యదం స్వామిన్ తే గృహాణాత్మ మచ్యుతం.
శ్రీమ॥ సువర్ణ పుష్ప దక్షిణాం సమర్పయామి.

శ్లో॥ నీరాజనం మయా దత్తం రాజరాజేశపూజితం
గృహాణ జగదుత్పత్తి హేతుభూత గణాశనః. ౧౩
శ్రీమ॥ మంగళ నీరాజనం సమర్పయామి.

శ్లో॥ సుకేతకీ పాటల పారిజాతా చాంపేయకింజాతరసాల మల్లికా
చామంతికాసంయుతమంత్రపుష్పగృహ్ణామివిష్ణోశివశంకరాచ్యుతః.
శ్రీమ॥ దివ్య సువర్ణమంత్రపుష్పం సమర్పయామి.

శ్లో॥ జన్మాంతరకృతా న్యాని యాని పాపాని మేప్రభో
నశ్యంతు తే తానితాని ప్రదక్షిణ పదేపదే. ౧౪
శ్రీమ॥ ఆత్మ ప్రదక్షిణ నమస్కారం సమర్పయామి.

శ్లో॥ యస్య స్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు
న్యూనం సంపూర్ణ తాం యాతి సద్యోవందే తమచ్యుతం.

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుమే. ౧౬

శ్లో॥ గత్వాద్య పునరాగత్య మామకాభీష్టసిద్ధయే
గురోర్వ్యకృపయా పీఠ్యా పూజా స్వీకురుమత్కృతం. ౧౭
శ్రీమ॥ ధ్యానం సమర్పయామి.

—♦ తీర్థ గ్రహణం ♦—

శ్లో॥ అజ్ఞాన మూల హరణం జన్మ కర్మ నివారణం
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం గురు పాదోదకం పిబేత్. ౧౮

శ్లో॥ గురు పాదోద్గతం తీర్థం పీత్వా త్రిపుటి నాశనం
సర్వద్వంద్వవినాశంచా విద్యతే నపునర్భవం. ౧౯

ఇతి శ్రీమద్భాగవత శ్రీకృష్ణ దేశిక విరచిత శ్రీగురు
పూజావిధానం సంపూర్ణం.

మానస పూజా విధానం.

శ్లో॥ లఘు పూజా విధిం భాగవత కృష్ణ ద్విజన్మనా
రచితం శ్రోత్రువక్త్రూణా మిదం మోక్షకరం పరం.

శ్లో॥ ధ్యాన మావాహనం సింహాసనం పాద్యంతథైవచ
అర్ఘ్య మాచమనీయంచ స్నానంపంచామృతై స్సహ
శుద్ధోదకం వస్త్రయుగ్మం యజ్ఞసూత్రం విభూషణం
విలేపనం చాక్షతాంశ్చ పుష్పం స్వర్ణవినిర్మితం
ధూపం దీపంచ నైవేద్యం పానీయం ఫలమేవచ
తాంబూలం దక్షిణార్తిక్యం మంత్రపుష్పం ప్రదక్షిణం
నమస్కారం శ్రీదేశికేంద్ర మయా తుభ్యం నివేదయేత్
కృపయాగృహ్యతాం స్వామిన్ న్యూనాధిక్యం నచింతయ.

ఇతి మానసపూజా సమాప్తం.

---

కైవారం.

శ్రీభక్తకార్యకల్పద్రుమా శ్రీమద్గురుసార్వభౌమ శ్రీమద్రాజాధిరాజయోగిమహారాజా త్రిభువనానందఅద్వైతఅభేదనిరంజననిర్వికల్ప నిరాలంబా సదోచిత అశరీరప్రవర్తక సకలసామ్రాజ్యలక్ష్మీవిలాస పరిపూర్ణసాగరసుధాకరా వాయువేగమనోవేగసంచార నిగ్రహానుగ్రహాది సమస్తసిద్ధకామస్వరూపా సమర్థతాధురీణా శ్రీమంతుశీల్గానా శ్రీశంకరదేశికప్రభుకరకమలసంజాతా బ్రహ్మశ్రీ మాధవరాజువెంకటేశ్వరప్రభునిజగురుమహారాజుకూ జై.

అనాద్యవిద్యామాయానిర్మూలనా అఖండసచ్చిదానందాతీత
సద్భక్తజనపరిపాలన నమో నమః.

శ్రీమద్భవానీచంద్రమౌళీశ్వరపదకమలపూజాధురంధరా పరాక్.
శ్రీజానకానాథమనోరంజనా బహుపరాక్.

శ్రీగురుభ్యో నమః.



# సాంఖ్యవిచారణ.

పెద్దలు తెలుప వ్రాయ బడినది.

శ్లో॥ గురు బ్రహ్మ గురు ర్విష్ణు గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్పరబ్రహ్మం తస్మై శ్రీ గురువే నమః.

శ్లో॥ గువర్ణంచ గుణా తీతం రువర్ణం రూపవర్జితం
గుణరూపవినాశాయ తస్మై శ్రీగురువే నమః.

యీ కల్లయుగంబున యుండు జనులు కల్ల యని నమ్మక స్థిరుల్నై యుందు మని అత్యాసక్తితో యెల్లరు తమవంటివార లని తలంచక యితరుల మోసముచేయు ప్రయత్నములలో నుందురుగాని యీ ప్రయత్నముచేయువారలు యెట్టివారో గమనించరు. తనయుత్పత్తికి మూలం బెద్దియో గమనించనికారణం బేమైయుండునో తెలుపగల సమర్థత లేనివానినైననూ యించుక యితరులకొరకు కొంచమి చార యుంచ కర్తృత్వము పూని తెలిపి పూని తెలిపిన దానిని మరచు సాధనాతీత మేది కద్దో దాని నే నవలంబించెద. తమ యుత్పత్తిస్థితిలయము గమనించి తెలిసి తెలియు దానిని అనుభవముకు తెచ్చుకొని తెచ్చుకొనిన దానిని యాచరించి యాచరించుదానిని విడువక నిదుర వచ్చువరకు తాను తనదేహసంబంధంబొదలువరకు వుంచుకొని యుండు సద్బోధ, తెలిపి చూపు సద్గురుమూర్తిని సంపాదించుకొనిన కారణమే తెలియుచున్నది. సద్గురుమూర్తి సంపాదించుకొని తనమరుగు తెలి

యువా రితరుల మోసం బించుకయైన గమనించ రని తేటబడు చున్నది. మనయుత్పత్తి యెటుల గల్గియుండెనో యించుక యీదాసుడు పెద్దలవలన గ్రహించు దాని నాకు తెలియు ననే గర్వం బించుకయైన లేక యెల్లరు దీనిని గమనించి జననమరణప్రవాహము దాటుదు రేమోయని తెలుపబూనితిగాన సద్వర్తనగల సద్బుద్ధిగలవారలందరు యీగ్రంథం బాసాంతము చూచి తెలసి నమ్మి సర్వజనహితంబుగా యుండి సర్వ జనులకు భయపడక సర్వవ్యాపకుడగు శ్రీసద్గురుమూర్తియె దిక్కని నమ్మియుండి లేనివానివలె యుందురుగాక యని నా మనోభీష్టత యని తలంచక సాంఖ్యవిచారణ క్లుప్తముగా వ్రాసి ముగించదలచినాడ. క్లుప్త మెందుకన పూర్వమునుండియు నింతవరకు యనేకమంది మహాత్ము లనేకగ్రంథములు మనయెల్లరియందు ప్రేమతో వ్రాసియుంచిరి. వ్రాసియుండ నీ వెందు కొనర్చితి వంచని యలుగవలదు. యేలయన ఆమహాత్ములు యనేకమందికి మేలుజేయుశక్తిగలవారలు. నే నంత సమ ర్థతలేనివాడ గాన నాకు శ్రీసద్గురుమూర్తి యొసంగిన బల మెంతో అంతకే ప్రపంచముకు ఉడుతాభక్తిగా యించుక తెలుప నాసక్తిగల వాడనై తెలుపబూనితిని. వీటియందు యేవిషయము లున్నను హంస క్షీరన్యాయముగా జూడ ప్రార్థించువాడ.

### సర్వాంగలక్షణము.

## ఓం నమశివాయ.

| | | |
|---|---|---|
| శ్లో॥ ప్రథమం తారకంచైవ | ౧ ఆకాశము | ○ |
| ద్వితీయం దండ ముచ్యతే | ౨ వాయువు | — |
| తృతీయం కుండలాకారం | ౩ అగ్ని | ○ |
| చతుర్థం అర్ధచంద్రకం | ౪ జలము | ◡ |
| పంచమం బిందుసంయుక్తం | ౫ భూమి | ○ |
| ఓ మితి జ్యోతి రూపకం | పరంజ్యోతి. | |

శ్లో॥ ఓంకారం వదనా దేవి - ముఖము
వాయకారం భుజద్వయం - రెండుభుజములు
శికారో దేహమధ్య స్స్యాత్ - గర్భము
నమకార పదద్వయం - రెండుపాదములు.

శ్లో॥ ఓంకారం పంచభూతాత్మా - ౫ - పృథివి - జలము - అగ్ని - వాయువు - ఆకాశము.

నకారంచ దశేంద్రియం చెవులు - చర్మము - కన్నులు - జిహ్వా - ముక్కులు - మాట - చేతులు - పాదములు - మలము విడుచుస్థానము . గుహ్యము అనగా ఆనందము మూత్రములస్థానం.

మకార మనుపశ్యానం - ౧ మనస్సు
శికారం బుద్ధినాయకం - ౧ బుద్ధి

వకారం దశవాయవ్యాం - ౧౦ - ప్రాణవాయువు ౧ అపాన వాయువు ౨ వ్యాన వాయువు ౩ ఉదాన వాయువు ౪ సమాన వాయువు ౫ నాగ వాయువు ౬ కూర్మవాయువు ౭ క్రుకరవాయువు ౮ దేవదత్త వాయువు ౯ ధనుంజయ వాయువు ౧౦.

యకారం త్రిగుణం భవేత్ - ౩ - రజో గుణము ౧ సత్వ గుణము ౨ తమో గుణము ౩.

శ్లో॥ తారకా చరలింగంచ దండకం గురు లింగకం
కుండలీ శివలింగంచ అర్ధచంద్రచరం తథా
బిందుప్రసారకం చైవ ప్రణవం మహాలింగకం.

శ్లో॥ ఓంకారం బిందు సంయుక్తం నిత్యజ్ఞానంతు యోగినాం
కామదం మోక్షదం చైవ ఓంకారాయ నమో నమః.

శ్రుతి—వేదాంతసారం ప్రథమ స్వరాణాం
త్రియతత్వసారం ప్రణవం నమామి.

ఓంకారమందే వేదములుసహా పుట్టినవి.

శ్లో॥ ఓంకారం ప్రణవో దేవో ఓంకారం ప్రథమస్వరం
ఓంకారం ప్రణవం సర్వం త్రైలోక్యం స చరాచరం.

శ్లో॥ అకారం బ్రహ్మరూపంచ ఉకారం విష్ణురూపకం
మకారం రుద్రరూపంచ త్రిమూర్తిం ప్రణవాత్మకం.

శ్లో॥ ఆచారం గురులింగంచ యిష్టలింగంచ జాయతే
శివలింగం చరంచైవా ప్రాణలింగంచ జాయతే
ప్రసాదంచ మహాలింగం భావలింగంచ జాయతే.

అక్షరం ప్రణవమందు షడ్విధలింగములైనవి.

ఆచారలింగం ౧, గురులింగం ౨, శివలింగం 3, చరలింగం ౪, ప్రసాదలింగం ౫, మహాలింగం ౬ — వీటియందు ముప్పదియారు తత్వములైనవి. ఓం న మ శ్శి వా య అనుదానికి అర్థము. న నేను, మ మాయాతీతమైన, శి శిద్ధమైన, వా వైరాగ్యంచేత, య యావత్తు, ఓం నేనైతిని. కాలత్రియములయందును వర్తమానకాలములయందును దూష్ణీభూతాదులయందును యీ శరీరం నేనుగాక వెనుక చెప్పిన ప్రణవస్వరూపం నేనైతిని. యిఘ నాకు జన్మలేదు. నాకు చెప్పిన గురుమూర్తి పాదమాన.

ఓం నమ శ్శివాయ

అర్థము— న— ఆకాశము - శబ్దము - గుణము
మ— వాయువు - స్పర్శ - గుణము
శి— అగ్ని - రూపము - గుణము
వా— జలము - రసము - గుణము
య— భూమి - గంధము - గుణము.

ప్రశ్న—పంచాక్షరీమంత్రము ప్రణవయుక్తము గానియెడల మంత్రము కాదా?

ఉత్తరువు—కాదు - పంచాక్షరీ యనగా శరీరేంద్రియ్యములని యెరుంగవలయును.

ప్రశ్న—ప్రణవహీనమైన - శరీరము నిల్చునా ? అట్లయిన షడ
క్షరి యని యెందుకు అనగూడదు?

ఉత్తరువు—కూడదు. అయిదు అక్షరముల భావ మగు ప్రపం
చమునకు లేక శరీరేంద్రియమునకు వర్తించును. సాక్షి యగు ప్రణ
వము అయిదింటిపాటు ఆరవయక్షరముగా నంగీకరింపకూడదు. మంత్ర
మనగా ప్రణవము. ప్రణవము లేక మంత్రము కాదు.

ప్రశ్న—ప్రణవమే మంత్రమైనయెడల తక్కినపంచాక్షరము
లెందుకు?

ఉత్తరువు—పంచాక్షరితో కూడుకున్ననూ విచారమునకు ని
మిత్తము లేదు.

ప్రశ్న — మంత్రము, మంత్రార్థము, మంత్రసారము,
మంత్రగోప్యము, మంత్రైక్యము యనగా నేమి ?

ఉత్తర్వు — మంత్ర మనగా సచరాచరాదిక ప్రపంచము,
మంత్రార్థమనగా తత్సాక్షి యగు సచ్చిదానందస్వరూపం, మంత్రసార
మనగా యిట్లెరిగినందున్ను ఘటించిన యానందము, మంత్రగోప్య
మనగా యితరులు వినరానిది, పొందరానిది.

ప్రశ్న — తన కితరు లెవరు ?

ఉత్తర్వు — త న్నెరుంగనివారు.

ప్రశ్న — భేద మేమి ?

ఉత్తర్వు — యెరుగుశక్తి లేకపోవుటయే భేదము. మంత్రైక్య
మనగా సచ్చిదానందస్వరూప మగు యెరుకను విడుట.

ప్రశ్న — విడచినపదార్థము యైక్యమెట్లగును?

ఉత్తర్వు — పరిపూర్ణములేని చోటు లేదుగనుక విడచిననూ
అందే కలయును గాన ఐక్య మనబడును.

మరియొకపక్షము.

ఆకాశాదిపంచభూతములు పంచాక్షరము లగు నమశ్శివాయ
యను మంత్ర మాయెను,

దానియొక్క అర్థము-ప్రణవమే పంచభూతములుగా పరిణమించి ప్రపంచమాయెను. గనుకనే ప్రణవము మినహా పంచభూతములు లేవు. అందుచేత పంచాక్షరీ అర్థము ప్రణవమనబడును. మంత్రార్థ మగు ప్రణవము నాదబిందుకళాస్వరూప మగుటచే నాదము బిందువందును బిందువ కళయందును కలసి ఆనందముగా నుండును. గనుక అంతా ఆనందముగా నెరింగి భావించుట మంత్రసార మనబడును. ఆనందో బ్రహ్మనియెడి శ్రుతిరీతి యిట్టి ఆనందస్వరూపమగు బ్రహ్మమందు ప్రపంచభ్రాంతి దోచి విషయజ్ఞప్తిచే నానావిధభేదములుగా నెరింగి స్వజాతీయ విజాతీయ స్వగతభేదములతో కించిజ్ఞత్వాదిగుణములు వహించి యజ్ఞానులై తెలియనేరక యుందురు. గావున యీకీలుకు దెలిసి సర్వము ఆనందబ్రహ్మముగా తెలియుటయొక్క రహస్యము గోప్య మనబడును.

ఐక్య మనగా నానావిధశబ్దస్పర్శరూపరసగంధములతో దోచు ప్రపంచ మగు పంచాక్షరీమంత్రమును నిత్యనిరాకారముగా భావించి తిరిగి ప్రపంచభ్రమదోచక అంతయు నిత్యనిరాకారస్వరూపముగా దోచి తన్మయత్వమును బొందుటయే మంత్రైక్య మనబడును. ఓంకార మనే కళలో నిష్కళే తానైన పరబ్రహ్మం.

### ఇంక స్వరూపబోధ.

అండాండ పిండాండము బ్రహ్మాండము. అండాండ మనగా బాహ్యామునకు భూచక్రము. పిండాండ మనగా స్థావరజంగమములయిన పర్వతాదులు, తరువులు, చరాచరమైన జీవకోటులు. బ్రహ్మాండ మనగా ఆకాశం.

### అంతరార్థము.

అండాండ మనగా కనుగుడ్డు, పిండాండ మనగా కనుపాప, బ్రహ్మాండ మనగా ఆపాపమధ్యమున వెలిగేకళ. ఆకళలో నిష్కళే తానైన పరబ్రహ్మం.

పంచభూతములకు వివరము.

పృథివి యనగా చుట్టూ యుండేయెరుపు. ఉదకము తెలుపు. అగ్ని నలుపు. అందులో సునీలమైన పాపే వాయువు. అందులో వుండే కళే ఆకాశం. ఆకళలో నిమ్మళ్ళే తానైన పరబ్రహ్మం.

త్రివేణులకు వివరం.

నల్లగుడ్డు గంగ, సునీలమైన కుండలి యమున, ఆపాపమధ్యమున వెలిగే కళయే సరస్వతి. ఆపాపే నీలతోయదమధ్యస్థం. అదే విద్యుల్లేఖ. ఆవెలుగులో వెలుగే తానైన పరబ్రహ్మం. అదే విరాట్‌రూపము. అదే ముక్తికంత.

మూడులోకములు చరాచర జీవకోటు లెటుల పుట్టిన వన అనాదినిర్వికల్పపరబ్రహ్మమందు అవ్యక్తత మనస్సైనమూల ప్రకృతి వ్యాపించియున్నందున సంకల్పలోపంబుగా నొకమహాతత్వంబు గలిగె. ఆమహాతత్వంబునం దధిష్ఠానసత్తావలన మహదహంకారంబుగలిగె. ఆ యహంకారంబు నందు త్రిగుణాత్మకమైన మాయ గలిగె. ఆమాయ యందు తన్నిజాంశమైన యీశ్వరుడు ప్రతిఫలించి మాయాశబలిత బ్రహ్మమందు ఓంకారంబైన ప్రణవంబు గలిగె. అందు అకార- వుకార - మకారంబు లనే మాతృత్రియంబు గలిగె. అకారంబున రజోగుణ యుక్తుండై బ్రహ్మపుట్టి ప్రపంచ సృష్టికారణం డయ్యె. ఉకారమందు సత్వగుణయుక్తుండై విష్ణుమూర్తి పుట్టి సర్వపోషణకర్త యయ్యె. మకారమందు తమోగుణయుక్తుండై శివుడుపుట్టి సర్వలయకర్త యయ్యె. తత్కాలమందే ప్రణవరూపమైన శబ్దతన్మాత్రియందు నాకాశంబు గలిగె. స్పర్శతన్మాత్రింబువలన వాయువుగలిగె. రూప తన్మాత్రింబున అగ్నిహోత్రింబు గలిగె. రసతన్మాత్రింబున నుదకంబు గలిగె. గంధ తన్మాత్రింబున పృథివీభూతంబు గలిగె. ఆ పృథివియందు ఓషధులు గలిగె. ఆవోషధులయందు అన్నంబు గలిగె. ఆయన్నమువల్ల నరమృగ పశుపక్షి స్థావర జంగమాదులుద్భవించె. యీ ప్రకారం ప్రపంచం బేర్పడెను.

ఇంక పంచీకరణవివరము.

పృథివికి — శబ్ద స్పర్శ రూప రస గంధంబు లైదు. జలమునకు— శబ్ద స్పర్శ రూప రసంబులు నాలుగు. అగ్నికి — శబ్ద స్పర్శ రూపంబులు మూడు. వాయువునకు — శబ్ద స్పర్శలు రెండు. ఆకాశమునకు — శబ్దము వకటి. యివి పంచభూతగుణములు. ఆకాశము అర్ధభాగము జ్ఞానతత్వం బయ్యె తక్కిన సగము నాల్గుఖండంబులై వాటియందు మిగిలిన వాయువు అగ్ని జలము భూమ్యాంశంబులంగూడి మనో బుద్ధి చిత్తా హంకారంబు లయ్యె.

వాయువు — అర్ధభాగం వ్యానతత్వం బయ్యె. తక్కిన సగ భాగము నాల్గుఖండంబులై వాటియందు భూమి జలము అగ్ని ఆకాశాంశంబులఁ గూడి ప్రాణ అపాన ఉదాన సమానంబు లయ్యెను.

అగ్ని అర్ధభాగం నేత్రంబు లయ్యెను. తక్కినసగము నాలుగు తునియలై వాటియందు ఆకాశ వాయువు జలము భూమ్యంశంబులఁ గూడి చెవులు చర్మము నాలుక ముక్కులు యయ్యెను.

ఉదకము అర్ధభాగం రసం బయ్యె. మిగిలిన అర్ధభాగము నాలుగు ఖండంబులై ఆకాశ వాయువు అగ్ని భూమ్యాంశంబులఁ గూడి శబ్ద స్పర్శ రూప గంధంబులయ్యె.

భూమి అర్ధభాగం పాయురింద్రియ మయ్యెను. అనగా గుదస్థానమాయెను. మిగిలిన అర్ధభాగము నాలుగుఖండంబులై వాటియందు ఆకాశము వాయువు అగ్ని జలాంశంబులఁ గూడి మాట చేతులు పాదములు యోను లాయెను.

కాబట్టి జ్ఞాన మనో బుద్ధిచిత్త అహంకారంబు లైయున్న ఆకాశపంచకం. ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానంబు లైయున్న వాయుపంచకము. చెవులు చర్మము కన్నులు నాలుక ముక్కులు యిన్నాయైయున్న అగ్నిపంచకము. శబ్దము స్పర్శ రూప రస గంధంబు లైయున్న జలపంచకము. వాక్కు పాణి పాద్మ పాయున ఉపస్థ లైయున్న భూమిపంచకము.

జిహ్వాద్యష్టస్థానంబులకు దెచ్చి వైఖరీయుక్తమైన పలుకులు పలికించడమే అతిభూతం, అజుడు అధిదేవత. సమానవాయువు నాభిస్థానమాశ్రయించియుండుటే అధ్యాత్మ. భుజించినపదార్థము జఠరాగ్నిద్వారా జీర్ణమైన రసమును డెబ్బదిరెండువేలనాడులకు పంచిపెట్టి సమపుష్టిగా నడిపించడమే అతిభూతం. విజయుడు అధిదేవత. శ్రోత్రము అధ్యాత్మ. శబ్దగ్రాహికం అతిభూతం. దిక్కులు అధిదేవతా. త్వక్కు అధ్యాత్మ. స్పర్శగ్రాహికం అతిభూతం. సూర్యుడు అధిదేవత. జిహ్వ అధ్యాత్మ. రసగ్రాహికం అతిభూతం. వరుణుడు అధిదేవత. ఘ్రాణము అధ్యాత్మ. గంధగ్రాహికం అతిభూతం. అశ్వనీదేవతలు అధిదేవత. వాక్కు అధ్యాత్మ. భాషించుట అతిభూతం. అగ్ని అధిదేవ. ప్రాణి అధ్యాత్మ. దానము అతిభూత. యింద్రుడు అధిదేవత. పాదములు అధ్యాత్మ. గమనము అతిభూతం. విష్ణు అధిదేవత. పాయువ అధ్యాత్మ. మలవిసర్జనం అతిభూతం. మృత్యువు అధిదేవత. గుహ్యము అధ్యాత్మ. ఆనందము అతిభూతం. బ్రహ్మ అధిదేవత.

భూతాంశములకు వివరము.

జ్ఞానము సమానవాయువు శ్రోత్రము శబ్దము వాగింద్రియములు యీ వైదున్ను ఆకాశాంగములు.

మనస్సు వుదానవాయువు త్వగింద్రియము స్పర్శ పాణి యీ వైదున్ను వాయువాంశములు.

బుద్ధిన్ని వ్యానవాయువు నేత్రములు రూపము పాదములు యీ వైదున్నూ అగ్నిహాంశములు.

చిత్తము అపానవాయువు జిహ్వ రసము పాయురింద్రియము యీవైదున్ను ఉదకాంశములు.

అహంకారము ప్రాణవాయువు పాణేంద్రియము గంధము గుహ్యము యీవైదున్ను పృథివిహాంశములు.

భూతలక్షణములకు వివరము.

అస్థి మాంస చర్మము నాడులు రోమములు యీ యైదున్ను భూమి లక్షణములు.

చెమట మూత్రము పిత్తము శుక్లము శోణితము యీ యైదున్ను యుదకలక్షణములు.

ఆకలి దప్పిక నిద్ర ఆలస్యము సంగమము యీ యైదున్ను అగ్నిలక్షణములు.

చాచుట ముడుచుట లేచుట నడుచుట పరుగులుటయీ యైదున్నూ వాయులక్షణములు.

కామ క్రోధ మోహ భయ లజ్జ యీ యైదున్ను ఆకాశ లక్షణములు.

శరీరత్రయ వివరము.

ఇరువదినాలుగు తత్వములతో గూడినది స్థూలశరీరము. యిదియే అన్నమయకోశము.

ప్రాణాదిపంచకముతో మనస్సుగూడి ప్రాణమయకోశంబయ్యె.

మనస్సు జ్ఞానేంద్రియ పంచకముతో గూడి మనోమయకోశమయ్యె.

ఈయైదింటియందే బుద్ధి గూడినప్పుడు విజ్ఞానమయకోశంబయ్యె.

సూక్ష్మశరీర లక్షణము.

సూక్ష్మశరీర మనగా జ్ఞానేంద్రియము లైదున్ను, కర్మేంద్రియము లైదున్ను, ప్రాణాదివాయువులు యైదున్ను, మనస్సు బుద్ధి రెండున్నూ యీ మొత్తం పదిహేడుతత్వములతో గూడినది సూక్ష్మశరీరము. యీ రెండు దేహములకు కారణమైనది, అనాద్యనిర్వచనీయమైన యవిద్యే కారణదేహము. ఇదే ఆనందమయకోశము. పంచకోశములే శరీరత్రయము అయినది గనుక నిక యవస్థాత్రయ నిరూపణము.

స్థూలశరీరాభిమానియై సుఖమంతయు విషయించి విశ్వుడను పేరట జాగ్రతను భోగించును.

స్వప్నశరీరాభిమానియై ముఖము నుంచి కంఠమునకు దిగజారి [illegible] తాను వేరట స్వప్నమును భోగించు కారణదేహాభిమానియై కంఠమునుంచి హృదయకమలమునకు వసియించి అక్కడ [illegible] తాను సుషుప్తిని భోగించును. తాను శరీరత్రయ విలక్షణుడై అవస్థాత్రయసాక్షియై పంచకోశవ్యతిరిక్తుడై ప్రకాశిస్తూయున్న పరమాత్మ [illegible] తన్ను గురూత్తముగా నెరింగి వీక్షించుటయే మోక్షము.

## షట్చక్రములకు వివరము.

ఈశరీరము యున్న పెద్దయొక వీణాదండముగాను ఆధారాది చక్రము లారు మెట్లుగాను వాటిమీద వామదక్షిణమధ్య యిడాపింగళ సుషుమ్నలు మూడు తంతులుగాను అమరియున్న లక్షణము.

౧ ఆధారచక్రము గుదస్థానమం దుండును దానికి నాలుగు రేకులు వ-శ-ష-స- వర్ణంబు లుండును. పృథివి తత్వస్థానలో గణపతి అధిదేవత అక్కడ హంసలు ఆరునూర్లు.

౨ రెండవ దానిమీద గుహ్యస్థానము స్వాధిష్ఠానచక్రము వీనికి రేకులు ఆరు- బ-భ-మ-య-ర-ల- లను వర్ణంబు లుండును. వుదక భూతస్థానము, బ్రహ్మ అధిదేవత, అక్కడ రాజసగుణము అకారమాత్రక సృష్టికర్త. అక్కడ హంసలు ఆరువేలు యుండును.

౩ మూడవ అందుమీద నాభిస్థానమందు మణిపూరకచక్రము దీనికి రేకులు పది డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ- లను వర్ణము లుండును. అగ్నిభూతస్థానము విష్ణు అధిదేవత సాత్వికగుణము ఉకారమాత్రక స్థితికర్త. అచట హంసలు ఆరువేలు.

౪ నాల్గు అందుమీద వక్షస్థానము అనాహతచక్రము దీనికి రేకులు పన్నెండు క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ లను వర్ణము లుండును. వాయుభూతస్థానము రుద్రు డధిదేవత తామసగుణము మకారమాత్రక సంహారకర్త. అచ్చట హంసలు ఆరువేలు.

౫ అయిదు కందుమీద కంఠస్థానమందు విశుద్ధచక్రము దీనికి రేకులు పదియారు అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ- ఏ-ఐ- ఓ-ఔ- అం-అః-వర్ణంబు లుండును జీవుడు అధిదేవత. అచ్చట హంసలు వకవెయ్యి.

౬ ఆరు అందుమీద భ్రూమధ్యమందు ఆగ్నేయచక్రము దానికి రేకులు రెండు హం క్షం వర్ణంబు లుండును. అక్కడ ఆకాశ భూతస్థానము పరమాత్మ అధిదేవత అక్కడ హంసలు వెయ్యి.

౭ యేడు అందుమీద శిరోమధ్యమున బ్రహ్మరంధ్రమందు సహస్రారచక్రము దానికి రేకులు గురుమూర్తి అధిదేవత అక్కడ హంసలు వెయ్యి అర్పణా.

యికను వెనుకచెప్పినట్లుగా యిడానాడి ఆధారము మొదలుకొని కపాలపర్యంతము వామభాగమున వచ్చి అక్కడవుండే గంగానది చంద్రమండలము వ్యాపించి యెడముముక్కులో గుండా ప్రాణవాయువు బహిర్గత మగును. పింగళనాడి దక్షిణభాగమున ఆధారము మొదలుకొని కపాలపర్యంతము వచ్చి యచ్చట యుండే యమునానదీ సూర్యమండలము వ్యాపించి ప్రాణవాయువు కుడిముక్కులోగుండా బహిర్గత మగును. నడిమి సుషుమ్ననాడి ఆధారముమొదలుకొని కపాల పర్యంతమువచ్చి అక్కడవుండే సరస్వతీనదీ అగ్నిమండలము వ్యాపించి రెండు నేత్రములయొక్క అంతమునను మహాసూత్మ స్వరూపము లోపల వెలుపల జగద్దీప్తమై ప్రకాశిస్తూ యుండును. అంతఃకరణ ప్రతిబింబమైన తేజస్సును అధిష్టానచైతన్యమైన తెలివిన్ని ప్రాణవాయువున్ను మూడు కూటస్థమైన హంసస్వరూప మయ్యెను. సకారము ప్రకృతిన్ని, హకారము పురుషుడున్ను, యీ రెంటికిని తాదాత్మ్య సంబంధమైన బిందువు కూటస్థమై హంస యన నొప్పెను. యీహంస బైట పన్నెండు అంగుళములమీద రేచించగా నాలుగుఅంగుళములు లయించి మిగిలిన యెనిమిదిఅంగుళములు క్షరిపూర్ణములోపల కుంభకమై అచ్చట నాలుగుఅంగుళములు లయించి మిగిలిన నాలుగు అంగు

శములు పూరించును. యీప్రకారము నిరంతరము రాత్రిపగలు యిరువదియొక్క వెయ్యి ఆరున్నూరుమారులు విహరించును.

అధోలోకములు ౭న్ను.

అతల అరికాళ్ళయందును, వితల మీగాళ్లయందును, సుతల ఘుఁషిమెలయందును, తలాతల పిక్కలయందును, రసాతల మోకాళ్ల యంధును, మహాతల తొడలయందును, పాతాళ గుదమందు యీ ప్రకారం అధోలోకములు యేడు యిక్కడనే యున్నవి.

ఊర్ధ్వలోకములు ౭.

భూలోకము గుహ్యస్థానము, భువర్లోకము నాభిస్థానం, సువర్లోకము హృదయస్థానము, మహర్లోకము వక్షస్థలము; జనర్లోకము కంఠస్థానము, తపోలోకము భ్రూమధ్యస్థానము అనగా రెండుకనుబొమలమధ్య, సత్యలోకము లలాటమందు యీయేడు ఊర్ధ్వలోకములు వెరశి పదునాల్గులోకములు యీ స్థూలమందే యుండియున్నవని తెలుసుకొనుము.

సప్తద్వీపములు యేడు.

జంబుద్వీపము తలలో నుండును. ప్లక్షద్వీపము యెముకల యందును, శాఖద్వీపము శిరస్సుయందును, శాల్మలీద్వీపము చర్మమందును, పుష్కరద్వీపము గోళ్లయందును, కుశద్వీపము మాంసమందును, క్రౌంచద్వీపము వెంట్రుకలయందు, యీ యేడుద్వీపములు యీశరీరమునందే యున్నవి.

సప్తసముద్రములు యేడు. ౭

లవణసముద్రం మూత్రము, ఇక్షుసముద్రము చెమట, సురసముద్రము యింద్రియము, సర్పిసముద్రము శోణితము, దధిసముద్రము శ్లేష్మము, క్షీరసముద్రము సొల్లు, శుద్ధోదకసముద్రము కన్నీరు. యీ యేడుసముద్రములు యీకాయమందుననే యున్నవని తెలియుము.

దశవిధనాడులు.

౧. యిడానాడి అనగా చంద్రనాడి యెడమభాగమం దుండును. శివుడు అధిదేవత.

౨. పింగళనాడి అనగా సూర్యనాడి కుడిభాగమున నుండును. విష్ణువు అధిదేవత.

౩. సుషుమ్నానాడి అనగా అగ్నినాడి మధ్యమున నుండును. బ్రహ్మ అధిదేవత.

౪. గాంధారినాడి కుడినేత్రమున నుండును, యెడమనేత్రమునందును యుండును. సూర్యుడు అధిదేవత.

౫. హస్తినీనాడి జిహ్వయందుండును, యెడమనేత్రమం దుండును. వరుణుడు అధిదేవత.

౬. పూషానాడి కుడికర్ణమం దుండును. దిగ్దేవతలు అధిదేవత.

౭. పయస్వినీనాడి యెడమ కర్ణమున నుండును. [illegible] అధిదేవత.

౮. అలంబసనాడి మేఢ్రమున నుండును. [illegible] అధిదేవత.

౯. కుహూనాడి గుదస్థానమున నుండును. భూమి అధిదేవత.

౧౦. శంఖినీనాడి నాభిస్థానమున నుండును. చంద్రుడు అధిదేవత.

దశవిధవాయువులకు వివరము.

౧. సమానవాయువు నీలవర్ణము నాభిస్థానము నుండి ఆపాదమస్తకపర్యంతం వ్యాపించి అన్నము మొదలగు సమస్తపదార్థముల యొక్క సారమును సమస్తనాడులకును పంచిపెట్టును.

౨. వ్యానవాయువు గోక్షీరవర్ణము సర్వాంగములను వ్యాపించి దేహమం దంతట వ్యాపించియుండును.

౩. ఉదానవాయువు పాటలవర్ణము కంఠమున నుండి శబ్దమును దగ్గును పుట్టించును. రుచులను గోర నియమించును. అన్నరసమును ఆత్మకు పానముచేయించును. కలవరించును.

౪. ప్రాణవాయువు యింద్రనీలవర్ణము హృదయమునందు నుండి అంగుష్టము మొదలు శిఖాగ్రపర్యంతము వ్యాపించి ఉచ్ఛ్వాసనిశ్వాసములచేత అన్నమును జీర్ణముచేయించును.

౫. అపానవాయువు హరితవర్ణం గుదస్థానమం దుండి మలమూత్రిముల్లను విడిపించి అధోద్వారమును బంధించి అన్నరసమును వ్యాపించి సకలరోమనాడులయందు వ్యాపింపజేయును.

ఉపవాయువులు.

౬. నాగవాయువు పీతవర్ణం చలనము లేక గీతరాగాదులను చేయించును రోమనాడులయందు వుండును.

౭. కూర్మవాయువు శ్వేతవర్ణము పాదములయం దుండి శుష్కమైన దేహమును పుష్టిచేయించును. కన్నులు నోరు మూయించును, తెరిపించను కర్తయై యుండును.

౮. క్రికరవాయువు రక్తవర్ణము నాశికాగ్రిమం దుండి క్షుధాది ధర్మములను బుట్టించును. గమనాగమనంబులు చేయించును.

౯. దేవదత్తవాయువు స్ఫటికవర్ణం గుహ్య, నేత్రిములయం దుండి కూర్చుండినచోటనే పరుండబెట్టును. లేపి నిలువజేయును. వ్యక్తముగా మాటలాడించును.

౧౦. ధనుంజయవాయువు నీలవర్ణము బ్రిహ్మస్థానమం దుండి కర్ణరంధ్రిములలో ప్రివేశించి సముద్రిముభంగి చిత్రివిచిత్రిములుగా ఘోషించును. మరణకాలముకు ముందుగా నిర్దోషమై పోయినట్లు కనుపించకయుండి తదుపరి చచ్చినదేహమును వాచేటట్లు చేసి మూడు దినములకు యీ శరీరము వుబ్బి పగులజేసివెళ్ళును.

సప్తవ్యసనములు.

తనువ్యసనము — దేహభారము సంభవించి కలవరించుట. ౧

మనోవ్యసనము — మనోవికారము గలిగినపిమ్మట దొంగతనమైనా చేయగోరుట. ౨

ధనవ్యసనము — ధనము సంపాదించవలె నని లోభకాంక్షతో యుండుట. 3

రాజ్యవ్యసనము — మనోత్సాహము గలిగి వాహనవస్త్రాభరణములను ధరియించి యేమో యెట్లాగో యని మనమున చింతించుట. ౪

విశ్వాసవ్యసనము — మోక్షమును సాధించవలె ననియును, దివ్యక్షేత్రములకు పోవలెననియును చింతించుట. ౫

ఉత్సాహవ్యసనము — వుత్సాహము కలిగినపుడు పుత్రమిత్రకళత్రాదులమీాద వాంఛించుట. ౬

సేవకావ్యసనము — పోయెదను వచ్చెదను యిచ్చెదను పుచ్చుకొనెద నని వినయము బొందుట. ౭

యీా వ్యసనంబులు ఆత్మజ్ఞానంబునకు విరోధ మని తెలిసి విడువవలెను.

అష్ట మదములు.

కులమదము ౧, బలమదము ౨, ధనమదము ౩, రూపమదము ౪, యవ్వనమదము ౫, విద్యామదము ౬, రాజ్యమదము ౭, తపోమదము ౮, యీా యెనిమిది మదములలో మనము బడిపడి మోసమందుచుంటిమి గాన వీటిని విడచిన సత్యనిత్యసంజ్ఞల నందని నెద్దియో గురుమూర్తిద్వారా తెలుసుకొను మని మనవి.

తాపత్రయముల వివరము.

ఆధ్యాత్మికతాపము - తలనొప్పి, కడుపునొప్పి, చలిజ్వరాల వల్లవచ్చే వుపద్రవములు అగును.

అతిభౌతికతాపము - చోర వ్యాఘ్ర సర్ప వృశ్చిక పిపీలికాదుల వల్ల వచ్చెడి యుపద్రవములు యగును.

అతిదైవికతాపము - ఎండగాలి వాన పిడుగులు వీనివల్లవచ్చెడి యుపద్రవములు యగును.

సప్తధాతువుల వివరము.

రసము - రుధిరము - మాంసము - మేధస్సు - అస్థి - మజ్జ శుక్లము - యీాతత్వములతో కూడిన శరీరము.

### జ్ఞానేంద్రియపంచక చేష్టలు.

చర్మమునకు విషయము - స్పర్శము - వాయువుసంబంధమైన- అన్నిటియొక్క శీతోష్ణాదిలక్షణ మెరుగును.

కన్నులకు విషయము - దృష్టి - అగ్నిసంబంధమై సమస్తప్రపంచమును చూచును.

చెవులకు విషయము - శబ్దము - ఆకాశసంబంధమై సకలమైన ధ్వనులను వినుచుండును.

జిహ్వకువిషయము - రసము - జలముతో కూడుకొని నానా రుచుల నెరుంగును.

ముక్కులకు విషయము - గంధము - పృథివితో సంబంధమై సుగంధదుర్గంధములను నెరుంగును.

### కర్మేంద్రియపంచక చేష్టలు.

వాక్కుకు విషయము - వచనము - ఆకాశసంబధమై సకలశబ్దములను నుచ్చరించును.

చేతులకువిషయము-దానములు - ప్రతిగ్రహములు-అగ్నిసంబంధమై తాను వొకరికి యిచ్చుటయు యితరులయొద్ద పుచ్చుకొనుటయు యీకార్యముగలదై యుండును.

పాదములకు విషయము - గమనము - వాయువుసంబంధమై అన్నిచోటులయందు తిరుగుచుండును.

గుదమునకు విషయము - మలవిసర్జనము యుదకసంబంధమై భుజించినపదార్థములను వెలికి జేయుచుండును.

గుహ్యమునకు విషయము - సంగమము పృథివిసంబంధమై మూత్రవిసర్జనచేయుచు యానందాభిలాషియై యుండును.

### జ్ఞానేంద్రియపంచకలీలము.

స్పర్శము — వాయువునందును చర్మమునందును సంగాగును.
రూపము — అగ్నియందును కన్నులయందును సంగాగును.
రసము — యుదకమందును నాలుకయందును సంగాగును.
గంధము — భూమియందును ముక్కునందు లీనమాగును.
శబ్దము — ఆకాశమందును చెవియందును లయమాగును.

### కర్మేంద్రియపంచకలీనము.

వచనము — ఆకాశమందును నోటియందును యమాగును.
గమనము — వాయువునందును పాదములయందును సంగాగును.
దానము — అగ్నియందును చేతులయందును సంగాగును.
విసర్జనము — యుదకమునందును గుదమునందును సంగాగును.
ఆనందము — భూమియందును ఉపస్థయందును సంగాగును.

### దశవిధనాదములు.

జలధినాదం భేరీనాదం చిణీనాదం మృదంగనాదం ఘంటానాదం కాహళనాదం కింకిణీనాదం వేణునాదం భ్రమరనాదం ప్రణవనాదం.

### అంతఃకరణచతుష్టయముల చేష్టలు.

మనస్సు సంశయించును, బుద్ధి నిశ్చయించును, చిత్తము చింతన జేయును, అహంకారము నేను అని పలుకుచుండును.

### రేచకపూరకకుంభకాదులకు వివరము.

ప్రాణాయామ మనగా రేచకపూరకకుంభకములు, రేచక మనగా యెరుపు శ్వాసను విడుచుట పూరకమనగా తెలుపు శ్వాసను యెక్కించుట కుంభకమనగా నలుపు రేచకపూరకములు షట్చక్రస్థాన మందు యీరెంటిని నిలుపునదే గుదే ప్రాణాయామము.

### త్రివేణులకు వివరము.

పైనలుపు గంగ ఆనలుపుపైగా సుషుమ్నాయను సరస్వతి తెలుపే పాపే యమున ఆపాపే నీలతోయదమధ్యస్థ ఆపాపమధ్యమునందు వెలిగే

వెలుగు సరస్వతి. అదే విద్యుల్లేఖ ఆవెలుగులో నిష్కళే తాను ఆదే ముక్తికంత చుట్టూయుండే యెరుపు బ్రహ్మ తెల్లగుడ్డు విష్ణువు పై నల్ల గుడ్డు రుద్రుడు యిది హృదయకమలం యెరుపుఅయిన బ్రహ్మకు అకారమాత్రక తెలుపుఅయిన విష్ణువుకు ఉకారమాత్రక నలుపుమైన రుద్రునకు మకారమాత్రక నిద్రాసంగమాములు అక్కడనే బుట్టును.

పంచశక్తుల వివరము.

యెరుపు క్రియాశక్తి తెలుపు జ్ఞానశక్తి నలుపు యిచ్ఛాశక్తి సునీలమైనపాప ఆదిశక్తి ఆపాపమధ్యమున వెలిగేకళ పరాశక్తి ఆకళలో నిష్కళే తాను.

మండలత్రియముల వివరము.

పైనలుపు అగ్నిమండలము పాపే సూర్యమండలం, సునీలమయిన బిందువే చంద్రమండలం, అందులో వెలిగే కళయె సకలప్రపంచమున్ను ఐదే ధూమ్రమండలం, ఆకళలో నిష్కళె యెరుకమరుపులు అంతా యెరిగేది తాను.

వాసనత్రియములవివరము.

లోకవాసనా - దేహవాసనా - శాస్త్రవాసనా అని మూడు విధములు.

౧. లోకవాసన యనగా సమస్తమయినవారున్ను - స్తోత్రము చేయవలసినది యనిన్నీ యెవరు నిందించకుండా అట్లా యుందురో అట్లుండవలయును, అని తలచుట లోకవాసన. దీనికి నివృత్తి యేమనగా బ్రహ్మాదులుగూడా నిందింపబడ్డారు. అల్పులమైన మనము నిందను పొందుట యొకలెఖ్ఖ యని చెప్పనలెనా? యనిన్నీ - యొకవేళ నిందిస్తే స్థూలదేహాన్ని నిందింతురు. దాన్నీ మనమున్నూ యొకానొకసమయమునందు నిందిస్తూయున్నాము. యితర్లు నిందించుట మనకు సహాయముచేయుచున్నారు. యది మనకు చాలామంచిదే. వారు స్థూలదేహమును నిందింపుచున్నారుగాని సూక్ష్మకారణదేహాలు అగుపడవు.

గనుక వాటిని యెవరు నిందించటము లేదు. ఆత్మకు నిందిస్తే ఆత్మ సర్వాత్మకుడై నందువల్ల తన్ను తానే నిందించుకున్నట్లు అని అట్లా వోర్చుకోవటమే లోకవాసనవృత్తి యగును.

౨. దేహవాస ననగా — ఆయువును అధికముగా సంపాదించవలె ననియు ఆరోగ్యము సంపాదించవలె ననియు సౌందర్యము సంపాదించవలెననియు యిచ్ఛయుంచటమే దేహవాసన యనబడును. దీనికి నివృత్తి యెటు లనగా యోగాభ్యాసముచేసి ఆయుష్యమును అధికమగునట్లు చేయుద మనిన ఆయుష్యము అధికమయినందువల్ల మోక్షము రానేరదు. మోక్షమే రానియెడల జన్మరాహిత్యం యెటుల గల్గునో గమనించగలరు. యేల యన సర్వకోరికెలు నశింపని హేతువుచే కోరికె లున్న మోక్షము రాకపోగా జన్మకు కారణంబౌను. ఆరోగ్యం పురుషప్రయత్నముచేత సిద్ధించక పోయిన హర్ష - శోకాలు అంతః కరణకేగాని ఆత్మయయిన నాకు లేదు. సౌందర్యపురుషులయందు కాలాంతరేణ అకురూపత్వప్రాప్తి కన్నారముగనుక సౌందర్యము సంపాదించుట వ్యర్థమని తెలుసుకొనుటయే దేహవాసన నివృత్తి యగును.

3. శాస్త్రవాస ననగా శాస్త్రములు చదివి ఆశాస్త్రములు శిష్యులకు పాఠములు చెప్పవలెనని తలంచుట. దీనికి వృత్తి యేమనినా శాస్త్రములో యున్న అర్థముగాక అందర్థములో అర్థము తెలుసుకొని ఆ యనుభవము తాను పొంది పొందినదానిని నిల్పుకొని నిలుపుకొనిన దానిని నిదురవచ్చువరకు తాను చచ్చువరకు లోగడ చదివినదానిని జ్ఞప్తికి రానీక యుంచటమే దీనికి వృత్తి.

## త్రిమూర్తుల పురములు.

నాభిస్థానము బ్రహ్మపురము, హృదయస్థానము, విష్ణుపురము, కంఠస్థానము శివపురము ముఖస్థానము వైకుంఠపురము, కపాలము స్వర్గద్వారము.

## వేదములు నాలుగు.

నోరు ఋగ్వేదము, కన్నులు యజుర్వేదము, నాసిక సామవేదము, కర్ణములు అథర్వణవేదము.

## నవఖండములు.

కపాలము భరతఖండము, కన్నులు యింద్రఖండము, కర్ణములు చరుఖండము, నాసికము గభస్థిఖండము, నోరు నాగఖండము, కంఠము తామ్రిఖండము, హృదయము వారుణిఖండము, నాభి సౌమ్యఖండము, గుదగుహ్యములు గంధర్వఖండము.

## సప్తక్షేత్రములు.

శిరస్సున శ్రీశైలపర్వతము, లలాటము కేదారేశ్వరము, భ్రూమధ్యము కాశీ, కుచములు కురుక్షేత్రము, హృదయస్థానము ప్రయాగ, హృన్మధ్యము చిదంబరము, ఆధారము కమలాలయము.

## సప్తవారములు.

కుడిపుటము ఆదివారము, యెడమపుటము సోమవారము, కుడికన్ను జయవారము, యెడమకన్ను బుధవారము, జింహ్వా గురువారము, యెడమచెవి శుక్రివారం, కుడిచెవి శనివారము.

## నవగ్రహములు.

తాలుమూలములు అనగా లోభాగము దవడలు అనునవే బృహస్పతి, భ్రూమధ్యము అనగా రెండుకనుబొమల నడిమిస్థానము శుక్రుడు, నేత్రస్థానము కుజుడు, ముఖము రాహువు, మనస్సు చంద్రుడు, కంఠము సూర్యుడు, హృదయము బుధుడు, నాభి శనేశ్వరుడు, గుదము కేతువు.

## నక్షత్రములు - ౨౭

శిరస్సు కృత్తిక, ముఖము రోహిణి, నోరు మృగశిర, నేత్రములు ఆరుద్ర, కంఠము పునర్వసు, భుజములు పుష్యమి, కరములు

ఆశ్లేష మఖ పుబ్బ, హృదయము ఉత్తర హస్త, నాభి చిత్త స్వాతి, గుదము విశాఖా అనురాధ, గుహ్యము జ్యేష్ఠ పూర్వాషాఢ శ్రవణము ఉత్తరాషాఢ, జానువులు ధనిష్ట, జంఘలు ఉత్తరాభాద్ర రేవతి, పాదములు అశ్వని - భరణి.

శ్రీజగన్నాథము యిచ్చటనే యున్నది.

ఉత్తరువు దేహము దేవాలయము, నాశికముప్రసాదములుంచు స్థానము, మనస్సు గరుడస్థంభము, కుతిక తుసి, కంఠము పదునెనిమిది నాళము, కంఠముదిగువను యిరువది రెండు పాలవంచములు, నేత్రములు సురటీలు, స్లీం - క్లీం - హ్రీం - జగన్నాథ సుభద్ర బలభద్రులు.

కాశీ విశ్వనాథుడు యచ్చటనే యుండెను.

త్రికూటస్థానము - కాశీ - అచ్చటనుండు స్వయం జ్యోతియగు - ఆత్మయే విశ్వనాథుడు - అదియే జ్యోతిర్లింగము - యిది - దెలిసినవారే నిజమయిన కాశీయాత్రచేసి విశ్వనాథుని దర్శించువారగుదురు.

రామేశ్వరము యిచ్చటనే యున్నది.

సోహంభావమే నిజమయిన రామేశ్వర దర్శనము - గాని - కావళ్లు మోసుకొనివచ్చుటకాదు. సోహంభావ మనగా గంగా - యమునాలయందు - చెలించు రాకపోకల యందు - శబ్దం శబ్దించెడు - హం క్షం అను యీ రెండక్షరములే తిరుమంత్రద్వయము. యీ తిరుమంత్రద్వయమే హంస. యిదియె అజపము. హంసను త్రివేణి సంగమమున కలుపుటయే యోగము అనగా యిడా పింగళా సుషుమ్నలను సంగమము జేయుటయే ప్రణవము. ఆధారము మొదలు సహస్రారమందుగల సహస్రదళములే సహస్రపగడలు. అందుపైని నిశ్చయముగా శయనించియుండే యోగపురుషుడు శ్రీరంగనాథుడు.

తిరుపతి యన నదియు నిచ్చటనేయున్నది.

ఆధార స్వాధిష్ట మణిపూరక అనాహత విశుద్ధ ఆగ్నేయ సహస్రారము లను యేడుకమలములును దొంతియగు యేడుపర్వతములు.

సహస్రారము లందు ప్రజ్వరిల్లుచుండెడు కళయందు నిష్కళయగు సర్వసాక్షియే వేంకటరమణుం డగును.

బిడ్డా వినుము. నేత్రము అండము పిండాండము బ్రహ్మాండము లెట్లనగా నేత్రమనెడి అండమును అట్టిదై యున్నది. అదియెట్లనగా తెల్ల గుడ్డు అండాండము, బిందువనే స్ఫటికపుపాప పిండాండము, ఆపాపలో వెలుగు తేజమే బ్రహ్మాండము, ఆ తేజస్సుమధ్య నిష్కళయే పర బ్రహ్మం, యిదియే శ్రీ వేంకటరమణుడు.

ముక్తిపంచకము.

౧ సాలోక్యము, ౨ సామీప్యము, 3 సారూప్యము, ౪ సాయుజ్యము, ౫ కైవల్యము, యీ వైదున్ను ముక్తిపంచక మనబడును.

౧ సాలోక్యమనగా విష్ణులోకమం దుండుట. ౨ సామీప్యమనగా విష్ణువద్దర జేరియుండుట. 3 సారూప్యమనగా విష్ణురూపుడై యుండుట. ౪ సాయుజ్యమనగా విష్ణులో జేరియుండుట. ౫ కైవల్యమనగా విష్ణులో నైక్యంబునొందుట. యీ విచారమునకు ఫలంబే మనిన యే యే దైవము నుపాసించువారలు యాదైవముల సంబంధమైన పంచముక్తులలో స్వకర్మానుసారమున ముక్తిని పొందుదురని తెలుసుకొనుటే ఫలము.

పంచాకాశములు.

౧ హృదయము, ౨ గుణరహితాకాశము, 3 పరాకాశము, ౪ మహాకాశము, ౫ తత్వాకాశము, యీ వైదున్నూ పంచాకాశములనబడును. ౧ హృదయాకాశ మనగా కనుచూపుమేర గనుపించునది. ౨ గుణరహితాకాశ మనగా కేవల నిరాకాశమై యుండునది. 3 పరాకాశ మన నిబిడ నిష్ఠుర గాఢాంధకారంబై యుండునది. ౪ మహాకాశ మనగా ప్రళయకాల ప్రజ్వాలా జలాభీలదావానలాకారమైనది. ౫ తత్వాకాశ మనగా వివిధవిచిత్ర వితతాద్యుతి భరితంబై యుండునది. యీ పంచాకాశములు నిత్యము చూచుటచే దృష్టికి స్థిరత్వంబు గలుగునని తెలుసుటే ఫలము.

## పంచాగ్నులు.

౧ ఉదరాగ్ని, ౨ మందాగ్ని, 3 కామాగ్ని, ౪ శోకాగ్ని, ౫ బడబాగ్ని, యీ యైదున్ను పంచాగ్ను లనబడును.

౧ ఉదరాగ్ని యనగా - ఆకలిచే తపించుట. ౨ మందాగ్ని యనగా - ఆకలిలేక తపించుట. 3 కామాగ్ని యనగా - పరస్త్రీసంగమము గోరి తపించుట. ౪ శోకాగ్ని యనగా అధ్యాత్మికాది దుఃఖములచే తపించుట. ౫ బడబాగ్ని యనగా - మరణతుల్యమైన ఆపత్తును బొంది తపించుట. యీ తాపములు శరీరమునకే గాని తచ్ఛరీర సాక్షినైన నాకు లేవని యెరుంగుటే యీ విచారమునకు ఫలము.

## సప్తావరణములు.

అనగా దుఃఖం మొదటి ఆవరణము ౧. శరీరపరిగ్రహణము ౨ ఆవరణము - కర్మ మూడో ఆవరణము 3. రాగద్వేషాదులు ౪ ఆవరణము. అభిమానము ౫ ఆవరణము. అవివేకము ౬ ఆవరణము. అజ్ఞానము యేడో ఆవరణము ౭. దుఃఖము యెందువల్లవచ్చినదంటె శరీరపరిగ్రహమువల్ల వచ్చినది. శరీరపరిగ్రహము యెందువల్లవచ్చినదంటె కర్మవల్ల వచ్చినది. కర్మ యెందువల్ల వచ్చినదంటె రాగద్వేషాదులవల్ల వచ్చినది. రాగద్వేషాదులు యెందువల్ల వచ్చినదంటె అభిమానమువల్ల వచ్చినవి. అభిమానము యెందువల్ల వచ్చినదంటె అవివేకమువల్ల వచ్చినది. అవివేకము యెందువల్ల వచ్చినదంటె అజ్ఞానమువల్ల వచ్చినది. అజ్ఞానము యెందువల్ల వచ్చినదంటె యిందువల్ల వచ్చినదన వీలులేదు. అజ్ఞానము యెట్లాబోవునంటె బ్రహ్మజ్ఞానము గల్గితే అజ్ఞానము బోవును. అజ్ఞానము పోతె అవివేకము పోతుంది. అవివేకము పోతె అభిమానము పోతుంది. అభిమానము పోతె రాగద్వేషాదులు పోతున్నవి. రాగద్వేషాదులు పోతె కర్మము పోతుంది. కర్మముపోతే శరీరపరిగ్రహం పోతుంది. శరీరపరిగ్రహంపోతె దుఃఖము పోవును.

దశేంద్రియముల వివరార్థము.

౧. శ్రోత్రేంద్రియ మనగా - శబ్దంబు లెల్ల దేనిచేత గ్రహించ బడుచున్నవో అదే శ్రోత్రేంద్రియము. ఆశబ్దంబు లెన్నివిధంబు లనినా లౌకిక మనియు వైదిక మనియు రెండు విధంబులు యందు లౌకికం బెయ్యది యనిన ప్రాకృత రూపంబులైన అష్టాదశ భాషలును; లౌకికము వైదికం బన నెయ్యదియనినా సంస్కృత రూపంబు లగు వేద శాస్త్రాదులు వైదికము; లౌకికము యెన్ని విధంబులనిన అదియు అనంత విధంబులు; వైదికం బెన్నివిధంబులనినా యదియు అనంత విధంబులు యిన్ని శబ్దంబులును దేనిచేత గ్రహించబడుచున్నదో అది శ్రోత్రేంద్రియము. యీ శ్రోత్రేంద్రియము యెచ్చట యున్నదనినా కర్ణ శష్కుల్యావచ్ఛిన్న నభోదేశంబు నాశ్రయించుకొని యున్నది. ఆ నభోదేశమే శ్రోత్రేంద్రియ మని చెప్పుదామంటె నిద్ర మృత మూర్ఛిత శరీరంబుల్లందుండెడి నభోదేశముద్వారా సర్వశబ్దంబు లన్నియును గ్రహించ బడవలయును. అటుల గ్రహింపలేదుగాన ఆ నభోదేశ వ్యతిరిక్తమై శబ్దగ్రహణ శక్తిమత్తయి సూక్ష్మమై యొకవస్తువా నభోదేశంబు నాశ్రయించుకొని యున్నది. దానికి శ్రోత్రేంద్రియ మనిపేరు. దాని కధిష్టానదేవత దిక్కులు. ఆ యధిష్టానదేవతచేత ప్రేరేపింపబడిన శ్రోత్రేంద్రియము శబ్దంబులెల్ల గ్రహించుచుండును.

౨. త్వగింద్రియ మనగా స్పర్శంబులన్నియు దేనిచేత గ్రహించ బడుచున్నదో అది త్వగేంద్రియము. ఆస్పర్శంబు లెన్నివిధంబులనిన శీతలమనియు శీతోష్ణమనియు వుష్ణమనియు మృదువనియు కఠిన మనియు అయిదు విధంబులు. అందులో నొక్కొక్కటి యనంతవిధంబులు. యీ స్పర్శంబులన్నియు దేనిచేత గ్రహించుచున్నవో అది త్వగేంద్రియము. యీత్వగేంద్రియ మెచ్చట నున్నదనిన త్వక్కును సర్వత్రా వ్యాపించుకొనియున్నది. అదే త్వగింద్రియమని చెప్పుదామంటే నిద్ర, మృత, మూర్ఛిత, శరీరంబులయందుండెడి త్వక్కుచేతను స్పర్శంబులన్నియు గ్రహింపబడవలయును. అటుల గ్రహింపబడ

లేదు. గనుక ఆత్వగ్వ్యతిరిక్తమైన స్పర్శగ్రిహణశక్తి మత్తయి సూక్ష్మమై యొకవొస్తువా త్వక్కు నాశ్రియించుకొని యున్నది. దానికి అధిష్ఠాన దేవత వాయువు. ఆయధిష్ఠానదేవతచేత ప్రేరేపింపబడిన త్వగేంద్రియము స్పర్శంబులన్నియు గ్రిహించుచుండును.

౩. చక్షురింద్రియమనగా సమస్తరూపంబులును దేనిచేత గ్రహింపబడుచున్నవో అది చక్షురేంద్రియము. ఆరూపంబు లెన్నివిధంబులనిన తెలుపు, నలుపు, మెరుపు, పసుపు, ఆకుపచ్చ-పొడుగు, పొట్టి, లావు సన్నము, వొక్కి అని పదివిధంబులు. అందులో నొకటొకటి యనేక విధంబులు. యిన్నిరూపంబులు దేనిచేత గ్రిహించబడుచున్నవో అది చక్షురేంద్రియము. యీ చక్షురేంద్రియము యెచ్చటనున్నదనిన కంటి నల్లగుడ్డు నాశ్రియించుకొని యున్నది. ఆనల్లగుడ్డే చక్షురేంద్రియమని చెప్పుదామంటే నిద్రి, మృత, మూర్ఛిత శరీరంబులందుండెడి. నల్ల గుడ్డుచేత రూపంబులు గ్రిహింపబడవలయును. అట్లుల గ్రిహింపబడ లేదు. గాన నల్లగుడ్డునకు వేరై రూపగ్రహణశక్తిమత్తులయి సూక్ష్మమై యొకవొస్తువ నల్లగుడ్డు నాశ్రియించుకొని యున్నది. దానికి చక్షు రేంద్రియమనిపేరు. సూర్యుడధిష్టానదేవత. ఆ యధిష్టాన దేవతచేత ప్రేరేపింపబడిన చక్షురేంద్రియము రూపంబులన్నిటిని గ్రహించుచుండును.

౪. రసేంద్రియము. రసేంద్రియ మనగా రసంబు లన్నియు దేనిచేత గ్రిహించ బడుచున్నవో అదియే రసేంద్రియము. ఆ రసంబు లెన్ని విధంబు లనిన ఉప్పు, పులుసు, కారము, తీపి, వగరు, చేదు అని ఆరు విధంబులు. వీనిలో నొక్కొక్కటి యనేక విధంబులు. యీ రసంబు లన్నియు దేనిచేత గ్రిహింప బడుచున్నవో యది రసేంద్రియము. యీ రసేంద్రియ మెచ్చట నున్నదనిన నొక నాలుక నాశ్రి యించుకొని యున్నది. ఆ కొన నాలుకే రసేంద్రియ మని చెప్పుదా మంటే సుషుప్తి మృత మూర్ఛిత శరీరంబులం దుండెడి నాలుక వలన రసంబులన్నియు గ్రిహింపబడలేదు గాన నాకొన నాలుకకు వ్యతి రిక్తమై రసగ్రిహణశక్తిమత్తై, సూక్ష్మమై యొక వొస్తు వాకొన నాలుక

నాశ్రయించుకొని యున్నది. దానికి రసేంద్రియమని పేరు. వరుణుం డధిష్ఠానదేవ. ఆ యధిష్టాన దేవతచేత ప్రేరేపింపబడిన రసేంద్రియము రసంబులన్నిటిని గ్రహించుకొనుచుండును.

౫. ఘ్రాణేంద్రియము. ఘ్రాణేంద్రియ మనగా గంధంబులన్నియు దేనివలన గ్రహింపబడుచున్నవో అది ఘ్రాణేంద్రియము. ఆగంధంబు లెన్నివిధంబు లనిన సుగంధము, దుర్గంధము, మిశ్రగంధంబులని మూడువిధంబులు. అందులో నొక్కొక్కటి యనేకవిధంబులు యున్నిగంధంబులును దేనివలన గ్రహింపబడుచున్నవో యది ఘ్రాణేంద్రియము. యీ ఘ్రాణేంద్రియ మెచ్చట నున్నదనిన నాసికాగ్రము నాశ్రయించుకొనియున్నది. ఆ నాసికాగ్రమే ఘ్రాణేంద్రియమని చెప్పుదామంటే నిద్ర, మృత, మూర్ఛిత శరీరంబులయందుండెడి నాసికాగ్రంబువలన గంధంబులన్నియు గ్రహింపబడవలయును. అటుల గ్రహింపబడలేదు గాన నాశికాగ్ర వ్యతిరిక్తమై గంధగ్రహణశక్తిమత్తై, సూక్ష్మమై నొకవస్తువ నాశికాగ్రంబును నాశ్రయించుకొని యున్నది. దానికి నాసికేంద్రియమని పేరు. దాని కధిష్ఠానదేవత అశ్వనీదేవతలు. ఆయధిష్ఠానదేవతలచేత ప్రేరేపింపబడిన ఘ్రాణేంద్రియమువలన గంధంబులన్నియు గ్రహింపబడుచున్నవి.

## కర్మేంద్రియముల వివరము.

౬. వాగింద్రియమనగా శబ్దంబులన్నియు దేనిచేత నుచ్చరింపబడుచున్నవో అది వాగింద్రియము. ఆవాగింద్రియ మెక్కడ నున్నదనిన యెనిమిది స్థానముల నాశ్రయించుకొని యున్నది. ఆ యెనిమిదిచోటు లెవ్వియనిన నాలుకయు, లోపల దవడలును, క్రింది పెదిమెయు, పై పెదిమెయు, కంఠహృదయంబులును, బ్రహ్మరంధ్రంబును యను నీ యెన్నిమిది స్థానముల నాశ్రయించుకొని యున్నది. యీ యష్టస్థానములే వాగింద్రియ మని చెప్పుదామంటే నిద్ర, మృత, మూర్ఛిత శరీరంబులయందు యుండునట్టి యెనిమిదిచోటులచేతను శబ్దంబులు నుచ్చరింపబడవలయును. యటుల నుచ్చరించబడలేదు గనుక ఆయష్ట

స్థాన వ్యతిరిక్తమై వచనగ్రహణశక్తి మత్తై, సూక్ష్మమై, యొక వస్తువా యెనిమిదిచోటుల నాశ్రయించుకొనియున్నది. దానికి వాగింద్రియమని పేరు. దానికి యధిష్ఠానదేవత చతుర్ముఖుడు. ఆయధిష్ఠాన దేవతచేత ప్రేరేపింపబడిన వాగింద్రియము శబ్దంబులన్నిటి నుచ్చరించు చుండును.

౭. పాణేంద్రియము. పాణేంద్రియ మనగా అన్నఉపాన దానాదిక్రియలు దేనిచేత చేయబడుచున్నవో అది పాణేంద్రియము. ఆ పాణేంద్రియ మెచ్చట నున్నదనిన అరచేతి నాశ్రయించుకొనియున్నది. ఆ యరచెయ్యి పాణేంద్రియమని చెప్పుదామంటే నిద్ర, మృత, మూర్ఛిత, శరీరంబులయం దుండెడి అరచేతివలన అన్నోపదానాది క్రియలు చేయబడవలయును. అటుల చేయబడలేదు. కాబట్టి అర చేతికంటె వ్యతిరిక్తమై అన్న, ఉపాన, దానాదిక్రియా శక్తిమత్తై సూక్ష్మమై యొకవస్తువా యరచేతి నాశ్రయించుకొనియున్నది. దానికి పాణేంద్రియ మని పేరు. దీనికి యధిష్ఠానదేవత యింద్రుడు: ఆయధి ష్ఠానదేవతవలన ప్రేరేపింపబడిన పాణేంద్రియము అన్న, ఉపాన, దానాదిక్రియలను చేయుచుండును.

౮. పాదేంద్రియము. పాదేంద్రియ మనగా గమనాగమనాదిక్రి యలు దేనివలన చేయబడుచున్నవో యది పాదేంద్రియము. యాపా దేంద్రియము యెచ్చటనున్నదనినా యరకాలిని నాశ్రయించుకొని యున్నది. యాయరకాలే పాదేంద్రియ మని చెప్పుదామనినా నిద్ర మృత మూర్ఛిత శరీరంబులందు యుండెడీ యరకాలివలన గమనాగమనాదిక్రి యలు చేయబడవలయును. అటుల చేయబడలేదు గాన ఆయరకాలికంటే వ్యతిరిక్తమై గమనాగమనాదిశక్తి మత్తై సూక్ష్మమై యొకవస్తువా యరకాలి నాశ్రయించుకొని యున్నది. దానికి పాదేంద్రియ మని పేరు. దీనికి యధిష్ఠానదేవత యుపేంద్రుడు. ఆ యధిష్ఠానదేవతవలన ప్రేరేపింపబడిన పాదేంద్రియము గమనాగమనాదిక్రియలను చేయు చుండును.

౯. పాయురేంద్రియము - పాయురేంద్రియ మనగా పురీష విసర్జనము మొదలైనక్రియలు దేనివలన జేయబడునో అది పాయురేంద్రియము. యీ పాయురేంద్రియము యెచ్చట నున్నదనిన గుదము నాశ్రియించుకొనియున్నది. ఆగుదమే పాయురేంద్రియ మని చెప్పుదామంటే నిద్ర మృత మూర్ఛిత శరీరంబులయం దుండెడి గుదమువలన పురీషవిసర్జనము మొదలైన క్రియలు చేయబడవలయును. అటుల చేయబడలేదు గాన ఆగుదవ్యతిరిక్తమై పురీషవిసర్జనాది క్రియాశక్తి మత్తై సూక్ష్మమై యొకవస్తువా గుదమును నాశ్రియించుకొనియున్నది. దానికి పాయురింద్రియ మని పేరు. దీనికి మృత్యువు అధిష్ఠానదేవత. యీ యధిష్ఠానదేవతవలన ప్రేరేపింపబడిన పాయురింద్రియము పురీష విసర్జనము మొదలైన క్రియలను జేయుచుండును. ౪

౧౦. ఉపస్థేంద్రియము - వుపస్థేంద్రియ మనగా శుక్ల మూత్రములు విసర్జనము జేయుట మొదలైన క్రియలు దేనివలన చేయబడుచున్నవో అది యుపస్థేంద్రియము. అది యెక్కడనున్నదంటే యోనిలింగము నాశ్రియించుకొనియున్నది. ఆ యోనిలింగమే ఉపస్థేంద్రియ మని చెప్పుదామంటే నిద్ర మృత మూర్ఛిత శరీరంబులయందు యుండెడి యోనిలింగమువలన శుక్లమూత్ర విసర్జనముచేయుట మొదలైన క్రియలు చేయబడవలయును. అటుల చేయబడలేదు గనుక శుక్ల మూత్ర విసర్జనాదిశక్తి మత్తై సూక్ష్మమై యొకవస్తువా యోనిలింగము నాశ్రియించుకొని యున్నది. దానికి వుపస్థేంద్రియ మని పేరు. దీనికి ప్రజాపతి యధిష్ఠానదేవత. యీ యధిష్ఠానదేవతవలన ప్రేరేపింపబడిన ఉపస్థేంద్రియము శుక్ల మూత్రముల విసర్జనము మొదలైన క్రియలను జేయుచుండును. ౫

## మలత్రయము.

౧ యణవమలము, ౨ మాయామలము, 3 కార్మికమలము, యీమూడు మలత్రయ మనబడును.

౧. యణవమలము యనగా పరమాత్మ తెలియలేక సంసారియై నేను జీవుడను, అజ్ఞానుడను అని తలంచుచుండుట యణవమలము.

౨. మాయామలము, యనగా పరులకు మనోవాక్కాయములచేత అపకారంబు జేయుచు పరులు నేనను భిన్నభావంబు గలిగియుండుట మాయామల మనబడును.

3. కార్మికమలము యనగా పుణ్యాపాపములచేత స్వర్గనరకములును జననమరణములును గల వని నిశ్చయించుకొని కర్మశీలుండగుట కార్మికమల మనబడు నని సకలార్థగురుబోధసారం.

యీ మలత్రయము జ్ఞానమునకు ప్రతిబంధకముగనుక సర్వావస్థలయందును బుద్ధియం దెక్కనీక త్రోసివేయవలయు నని శాస్త్రసిద్ధాంతం.

ఇచ్ఛాత్రయము.

స్వేచ్ఛా పరేచ్ఛ అనిచ్ఛ యీమూడు యిచ్ఛాత్రయము.

౧. స్వేచ్ఛ తా నొకకార్యమును మనస్ఫూర్తిగా కోరి చేసిన దానివలన వచ్చిన సుఖదుఃఖముల యనుభవించుట స్వేచ్ఛ యనబడును.

౨. పరేచ్ఛ యనగా తాను యొకకార్యమును కోరిచేయక పరులచే ప్రేరేపింపబడి చేసి అందుచే కలిగిన సుఖదుఃఖముల ననుభవించుట పరేచ్ఛ యనబడును.

3 అనిచ్ఛ తాను యొకకార్యమును కోరిచేయక పరులచేతనున్ను ప్రేరేపింపంబడి చేయక దైవికమువల్ల వచ్చిన సుఖదుఃఖముల ననుభవించుట అనిచ్ఛ యనబడును.

జ్ఞానికి స్వేచ్ఛ నీచమనిన్ని, పరేచ్ఛ మధ్యమమనిన్ని, అనిచ్ఛ వుత్తమమనిన్ని వేదాంతసిద్ధాంతము.

ఈషణత్రయము.

౧ ధనేషణ. ౨ పుత్రేషణ. 3 దారేషణ, యీ మూడు యీషణత్రయం.

౧. యణవమలము యనగా పరమాత్మ తెలియలేక సంసారినై నేను జీవుడను, అజ్ఞానుడను అని తలంచుచుండుట యణవమలము.

౨. మాయామలము, యనగా పరులకు మనోవాక్కాయములచేత అపకారంబు జేయుచు పరులు నేనను భిన్నభావంబు గలిగియుండుట మాయామల మనబడును.

3. కార్మికమలము యనగా పుణ్యాపాపములచేత స్వర్గనరకములును జననమరణములును గల వని నిశ్చయించుకొని కర్మశీలుండగుట కార్మికమల మనబడు నని సకలార్థగురుబోధసారం.

యీ మలత్రియము జ్ఞానమునకు ప్రతిబంధకముగనుక సర్వావస్థలయందును బుద్ధియం దెక్కనీక త్రోసివేయవలయు నని శాస్త్రసిద్ధాంతం.

## ఇచ్ఛాత్రియము.

స్వేచ్ఛ పరేచ్ఛ అనిచ్ఛ యీమూడు యిచ్ఛాత్రియము.

౧. స్వేచ్ఛ తానొకకార్యమును మనస్పూర్తిగా కోరి చేసిన దానివలన వచ్చిన సుఖదుఃఖముల యనుభవించుట స్వేచ్ఛ యనబడును.

౨. పరేచ్ఛ యనగా తాను యొకకార్యమును కోరిచేయక పరులచే ప్రేరేపింపబడి చేసి అందుచే కలిగిన సుఖదుఃఖముల ననుభవించుట పరేచ్ఛ యనబడును.

3 అనిచ్ఛ తాను యొకకార్యమును కోరిచేయక పరులచేతనున్ను ప్రేరేపింపంబడి చేయక దైవికమువల్ల వచ్చిన సుఖదుఃఖముల ననుభవించుట అనిచ్ఛ యనబడును.

జ్ఞానికి స్వేచ్ఛ నీచమనిన్ని, పరేచ్ఛ మధ్యమమనిన్ని, అనిచ్ఛ వుత్తమమనిన్నీ వేదాంతసిద్ధాంతము.

## ఈషణత్రయము.

౧ ధనేషణ. ౨ పుత్రేషణ. 3 దారేషణ, యీ మూడున్ను యీషణత్రయం.

3. వెర్రిబట్టినవానివలె దర్వ్యాసక్తిచే తిరుగుచుండుట విశేషమనబడును.

భావత్రియము.

దేహభావానుభవము, మనోభావానుభవము, ఆత్మభావానుభవము యీమూడున్ను భావత్రియ మనబడును.

౧. దేహభావానుభవము యనగా బాహ్యప్రపంచమునంతయు విచారముచే బయలుజేయుట.

౨. మనోభావానుభవము యనగా ఆబయలుతోడ నున్న దేని తారూపమైన చతుర్దశవృత్తులను అఖండాకారవృత్తిగా భావించుట మనోభావానుభవ మనబడును.

3. ఆత్మభావానుభవ మనగా అవృత్తియును లేక ఆత్మమాత్రుండై యుండుట.

దీక్షాత్రియము.

౧ దృగ్దీక్ష, ౨ స్పర్శదీక్ష, 3 వాగ్దీక్ష లని మూడు విధంబులు గలవు.

౧. దృగ్దీక్ష యనగా మత్స్యమువలె శిష్యునకు ఆపరోక్షజ్ఞానము కలుగునా యని కరుణాంతరంగుడై గురుడు వీక్షించుట.

౨. స్పర్శదీక్ష యనగా పక్షిచందమున హస్తమస్తకసంయోగంబుచేయుట. సద్గుణభరితుండైన శిష్యుండు గురుపాదాబ్జములపై శిరసువుంచి దండప్రణామంబుచేయగా గురుండు అభయహస్తమును శిష్యుని శిరంబుపై బెట్టును. యిది గురుశిష్యులకు గల ప్రమాణ మని యనుచవచ్చును యెట్లనగా శిష్యుండు తనువును మనస్సును సొమ్మును ధారబోసి యీదేహమునకు ప్రధానమగుశిరస్సును పాదములపైబెట్టుట యనునది. ఆచార్యు లానతిచ్చినవాక్యములను శిరసావహించి జవదాటననియు, అట్లతిక్రమించిన గురుద్రోహి నగుదుననియు శిష్యుని ప్రమాణము. శిష్యుండు నిష్కపటచిత్తుండై యున్న దినముల నూరు

సాధన మగు పూర్ణానుభవము బోధించెద నని గురుడు అభయ హస్తం బిచ్చుట.

3. వాగ్దీక్ష యనగా భ్రమరకీటకన్యాయము. గురుడు శిష్యుని నిస్సంశయాత్ముని గా జేసి శిష్యుని తనవలె పూర్ణానుభావజ్ఞునిగా జేసి కొనుట. శిష్యుండు రాజ్యాధిపతియై యుండి రాజ్యమంతయు ధారబోసె దను, యుపదేశ మిమ్మని కోరినప్పటికిని గురుండు డుపదేశ మియ్యగూడదు. అనగా ధనాదులచే నిమిత్తము లేదు. సకలాభిమానములను విడచి శమదమాదిసంపత్తి గలిగి సకలేంద్రియములకు ప్రధానమైన శిరస్సును గురుపాదములకు సమర్పించి గురుభక్తిగా యున్నవారికి యుపదేశమియ్యవచ్చునుగాని పాత్ర మెరుగక దానముచేయగూడదని భావము.

## త్రివిధప్రసాదములు.

భుక్తశేషము పాదతీర్థశేషము భక్తశేషము యని మూడు. యీమూడు అతిరహస్య మగుటచే యిందులో బాహ్యార్థము పదార్థము తీసిచేసుకొని వ్యర్థులై పోక శ్రీసద్గురుమూర్తిని సేవించి ధ్యానించి పూజించి తెలుసుకొనుట మంచి దని నాయభీష్టత. యీమూడు పదములకు రహస్యార్థము అంతరార్థ మున్నది.

## అష్టప్రకృతులు.

౧ మనస్సు, ౨ బుద్ధి, 3 అహంకారము, ౪ శబ్దము, ౫ స్పర్శ, ౬ రూపము, ౭ రసము, ౮ గంధము యీయెనిమిదిన్ని అష్టప్రకృతు లనబడును.

## అష్టాత్మలు.

౧ జీవాత్మ, ౨ అంతరాత్మ, 3 పరమాత్మ, ౪ నిర్మలాత్మ, ౫ శుద్ధాత్మ, ౬ జ్ఞానాత్మ, ౭ మహాత్మ, ౮ భూతాత్మ యీయెనిమిదిన్ని అష్టాత్మ లని యెరుగవలయును.

౧ జీవాత్మ యనగా తన్ను తా నెరుగకుండునది. ౨ అంతరాత్మ యనగా శరీరజడత్వమును గన తా నెవరో యని చింతించుట.

౩ పరమాత్మ యనగా తన్ను తా నెరిగి సుషుప్తిని నివర్తించునది. ౪ నిర్మలాత్మ యనగా మలత్రియాదులను మీరి ఆనందించునది. ౫ శుద్ధాత్మ యనగా సర్వవ్యాపకుడై జడముతో కలసి కలియక యుండునది. ౬ జ్ఞానాత్మ యనగా సకలభూతహృదయకమలములయం దుండునది. ౭ మహాత్మ యనగా సకలభూతకార్యాకార్యముల నెరుంగునది. ౮ భూతాత్మనగా సర్వభూతములు తానై ప్రకాశించునది.

యీ విచారమునకు ఫలం బేమి యనినా అద్వయుం డగు పరమాత్మయే వుపాధివశమున యిన్నివిధముల చెప్పబడినదిగాని వుపాధుల తోసివేసిన ఆత్మ యొక్కడే యని తెలియుటే ఫలము.

## అష్టతనువులు.

౧ పృధివి, ౨ జలము, ౩ అగ్ని, ౪ వాయువు, ౫ ఆకాశము, ౬ ఆత్మ, ౭ సూర్యుడు, ౮ చంద్రుడు యీ యెనిమిది అష్టతనువులు.

## అంతరంగాష్టమదములు.

౧ పృధివిమదము, ౨ జలమదము, ౩ అగ్నిమదము, ౪ వాయుమదము, ౫ ఆకాశమదము, ౬ ఆత్మమదము, ౭ సూర్యమదము, ౮ చంద్రమదము యీ యెనిమిదిన్ని అంతరంగాష్టమదములు.

౧. పృధివిమద మెత్తినప్పుడు స్రక్చందనాదులు గోరును.

౨. జలమద మెత్తినపుడు దారాపుత్రాదిజీవనార్థమై ధనము గోరును.

౩. అగ్నిమద మెత్తినప్పుడు స్త్రీసంపర్కము గోరును.

౪. వాయుమద మెత్తినప్పుడు ప్రయాణము గోరును.

౫. ఆకాశమద మెత్తినప్పుడు వాహనాదుల గోరును.

౬. ఆత్మమద మెత్తినప్పుడు శరీరసౌఖ్యము గోరును.

౭. సూర్యమద మెత్తినప్పుడు శత్రుసంహారము గోరును.

౮. చంద్రమద మెత్తినప్పుడు సంశయూపన్ను డగును.

యీబాహ్యాంతరమదములన్నియు జ్ఞానంబునకు ప్రతిబంధకంబు గాన వీనిని రాకుండా త్రోసివేసి నిరంతరం బాత్మానాత్మవిచారణ చేయుచుండవలెను అని తెలియుటే యీవిచారమునకు ఫలము.

## అష్టమదములు.

౧ ధనమదము, ౨ విద్యామదము, ౩ కులమదము, ౪ శీలమదము, ౫ రూపమదము, ౬ యవ్వనమదము, ౭ రాజ్యమదము, ౮తపోమదము యీయెనిమిదిన్ని అష్టమదము లనబడును.

౧. ధనమద మనగా నాయంతధనవంతుడు లేడని గర్వించుట.

౨. విద్యామద మనగా నావంటివిద్వాంసుడు లేడని గర్వించుట.

3. కులమద మనగా నేను యెక్కువకులమందు బుట్టినా నని గర్వించుట.

౪. శీలమద మనగా నావంటిఆచారవంతుడు లేడని గర్వించుట.

౫. రూపమద మనగా నావంటి సౌందర్యవంతుడు లేడని గర్వించుట.

౬. యవ్వనమద మనగా నావంటి బలవంతుడు లేడని గర్వించుట.

౭. రాజ్యమద మనగా నాకు సర్వరాజ్యాధిపత్యము గల దని గర్వించుట.

౮ తపోమద మనగా నేను స్నానసంధ్యానుష్ఠానపరుడ నని గర్వించుట.

దీనికి నివృత్తి- యీఅష్టమదముల విడచి, సర్వాత్మానుభావమందియుండుటే దీనికి నివృత్తి.

## అష్టాంగయోగములు.

౧ యమము, ౨ నియమము, 3 ఆసనము, ౪ ప్రాణాయామము, ౫ ప్రత్యాహారము, ౬ ధ్యానము, ౭ ధారణ, ౮సమాధి యీయెనిమిదిన్ని అష్టాంగయోగము లనబడును.

వీటిలో మొదటినాల్గును పూర్వాంగములనిన్ని, తక్కిన నాల్గును వుత్తరాంగము లనిన్నీ చెప్పబడును. ౧ అహింస, ౨ సత్యము, ౩ అస్తేయము, ౪ బ్రహ్మచర్యము, ౫ అపరిగ్రహము, ౬ సిద్ధి, ౭ మిత భోజనము, ౮ సర్వజనప్రియత్వము యీరాయనిమిదియున్న యమము అన బడును. యిది లేనిది యోగము సిద్ధించదు.

అష్టసిద్ధులు.

౧ అణిమ, ౨ మహిమ, ౩ గరిమ, ౪ లఘిమ, ౫ ప్రాప్తి ౬ ప్రాకామ్యము, ౭ యీశ్వరత్వము, ౮ వశిత్వము, యీరాయనిమిది అష్టిసిద్ధు లనబడును.

౧. అణిమ యనగా అణుప్రమాణములైన ప్రాణులయందు పరమాణుప్రమాణుడై యుండుట అణిమ యనబడును.

౨. మహిమ యనగా బ్రహ్మ విష్ణు రుద్ర సదాశివ విరాట్పు రుషాంతములకంటె పెద్దవాడై యుండుట మహిమ యనబడును.

౩. గరిమ యనగా బహ్మాండమంతకంటె భారముగ యుండుట.

౪. లఘిమ యనగా మేరువుయంతటి బరువుగలిగియుండి దూది లేశమువలె తేలికై యుండుట.

౫. ప్రాప్తి యనగా యిష్టపదార్థములను లభింపజేసుకొనుట.

౬. ప్రాకామ్య మనగా గగన గమనాదిసిద్ధి.

౭. యీశ్వరత్వ మనగా సూర్య-చంద్ర-మహేంద్ర-యమ-వరుణ-అగ్ని ప్రముఖ దేవతలను పనులలో నియమించుట.

౮. వశిత్వ మనగా సకలజంతువులను వశముజేసికొనుట.

అష్టదళపద్మములు.

౧. పూర్వదళమున హంసవాలిన పుణ్యముజేయు ఆసక్తి యుండును.

౨. ఆగ్నేయదళమున హంసవాలిన భోజనాసక్తి గలుగును.

౩. దక్షిణదళమున హంస వాలిన క్రూరమైన పనులయందు ఆ సక్తి గల్గును.

౪. నైరుతిదళమున హంసవాలిన దోషము లెన్ను చింతాసక్తి గలుగును.

౫. పశ్చిమదళమున హంస వాలిన నిద్రాసక్తి గలుగును.

౬. వాయువ్యదళమున హంస వాలిన సంచారాసక్తి గలుగును.

౭. వుత్తరదళమున హంస వాలిన ధర్మాసక్తి గలుగును.

౮. యీశాన్యదళమున హంసవాలిన వైరాగ్యచింతగలుగును.

యీయెనిమిది అష్టచింతలు గలిగియుండునది అష్టదళపద్మము. హృదయమందుండు అష్ట దళపద్మముయొక్క మధ్యను హంస దీపాకృతిగా వెలుగుచు గాలిచే అష్టదళములలో యే యే దళముపై చలించి వాలిన పూర్వోక్తమైన యీచింతలు గలుగు ననియును ఆదీపాకృతియైన జ్యోతి పద్మకర్ణికయందు నిలచియున్నప్పుడు పరమార్థచింత యనియు తెలియుటే యీవిచారమునకు ఫలము.

## పంచకోశములు.

౧ అన్నమయకోశము, ౨ ప్రాణమయకోశము, ౩ మనోమయకోశము, ౪ విజ్ఞానమయకోశము, ౫ ఆనందమయకోశము లనే పంచకోశములు గలవు. అందు—

౧. అన్నమయకోశము యనగా యేమియంటె అన్నరసమువల్ల పుట్టి అన్నరసమువల్ల పెరుగుచూయున్నది గనుక అన్నమయకోశమని పేరు.

౨. ప్రాణమయకోశ మనగా కర్మేంద్రియము లైదు, పంచప్రాణము లైదు. యీ పదింటితో కూడుకున్నదే ప్రాణమయకోశమని పేరు.

౩. మనోమయకోశ మనగా యేమియంటే జ్ఞానేంద్రియము లైదు, మనస్సు వకటి యీ ఆరింటితో కూడుకున్నదే మనోమయకోశము.

౪. విజ్ఞానమయకోశ మనగా జ్ఞానేంద్రియాలు అయిదు, బుద్ధి యీ ఆరింటితో కూడుకున్నదే విజ్ఞానమయకోశ మని పేరు.

౫. ఆనందమయకోశ మనగా మలినసత్వరజస్తమోగుణాత్మిక మైన అవిద్యే అనందమయకోశ మని పేరు.

పంచకోశధర్మములు.

౧ అన్నమయకోశధర్మములు యేవియన వర్ణధ్యాస నామధ్యాస రూపధ్యాస ఆశ్రిమధ్యాస క్రియాధ్యాస జీవధ్యాస దేహాధ్యాస అన్నమయకోశనిష్టధర్మలు. ఆత్మయందున ఆత్మయొక్క సచ్చిదానందము అన్నమయకోశమందున అన్యోన్యధ్యాసచేత కూటమై యున్నవి. ఆయన్యోన్యధ్యాసకు దృష్టాంతము వోడ నడుస్తూయుంటే వృక్షములు కదిలినట్లు కనుపించును. వోడయొక్క చలనము వృక్షములయందున వృక్షములయొక్క నిలకడ వోడయందున ఆరోపితమైనట్లు అన్యోన్యఆశచేత కూటమై యున్నవి.

౨. ప్రాణమయకోశధర్మ లనగా కర్మేంద్రియములైదు పంచప్రాణములైదు గూడుకొన్నదే ప్రాణమయకోశ మని పేరు. వాటియొక్క ధర్మలనల్లనే క్షుత్పిపాసగలవాడను శక్తి జలము ఆకలి దప్పిక రాకడ పోకడ ప్రాణమయకోశధర్మములు. ఆత్మయందు ఆత్మయొక్క సచ్చిదానందము ప్రాణమయకోశమందున్ను అన్యోన్యధ్యాసచేత కూటమై యున్నది.

౩. మనోమయకోశధర్మ లనగా మనస్సున్ను జ్ఞానేంద్రియములయందున్ను మనోమయకోశధర్మములు సంకల్పవికల్పము మనోమయకోశనిష్టధర్మలు. ఆత్మయందున్న ఆత్మయొక్క సచ్చిదానందములు మనోమయకోశమందున్ను అన్యోన్యధ్యాసచేత కూటమై యున్నవి.

విజ్ఞానమయకోశధర్మ లనగా - జ్ఞానేంద్రియములైదున్ను బుద్ధిఆరింటితో కూడుకున్నదే విజ్ఞానమయకోశము. నేను శాస్త్రజ్ఞుడను. పండితుడను - నేను వినేవాడను - మొదలయిన కర్తవ్యములు విజ్ఞానమయకోశముయొక్క నిష్ఠధర్మలు. ఆత్మయందున ఆత్మయొక్క సచ్చిదానందములు విజ్ఞానమయకోశమందున కూటమైయున్నవి.

ఆనందమయకోశ ధర్మలనగా - ప్రియామప్రమోద వృత్తిమత్తై అజ్ఞానప్రమోదమయిన - అంతఃకరణానందమయకోశమనేపేరు. వీటి ధర్మలు - నేనుభోక్తను - అసంతుష్టుండను - సువాసిని శాస్త్రికుడను - రాజను - తామసుడను ఆయాయజ్ఞానములు - ఆత్మయందున - ఆత్మ యొక్క సచ్చిదానంద ధర్మములు - ఆనందమయకోశమందున కూటమై యున్నవి. పంచకోశములు దేనివల్ల వచ్చినవి? ఆత్మవల్ల వచ్చినవి. ఆత్మవల్లవచ్చిన పంచకోశములు ఆత్మను కప్పవచ్చును. కప్పవచ్చునను టకు, దృష్టాంతము యేమి? వేటిని నివి కప్పుకొనియున్న వనినా కత్తిని వొరకప్పు కొనునట్లును, తాంబూర రాగవశిన కప్పునట్లును, పసిరిగ పురుగు పసిరిగ తిత్తి కప్పినట్లును, చింతపండును చింతగుల్ల కప్పినట్లును, అరటిబొందిన అరటిపట్ట కప్పినట్లును పంచకోశములు ఆత్మను కప్పి యున్నవి. అవి పగిశ్రమ మగుటవలన వకటిని వకటి కప్పవచ్చును. ఆత్మ సత్తునను వుపజీవించుకొని వచ్చిన మేఘములు విశ్వాప్రియత్నము లేని సూర్యకిరణములద్వారా యేర్పడి, ఆమేఘము సూర్యుని కమ్మి, అది వర్షకిరణమై వర్షించి, ఆవుదకములో తాను ప్రతిఫలించి, తిరిగి తన కిరణములద్వారా రసమును పీలిస్తే ప్రతిబింబమున్ను జలమున్ను లేకపోయినట్టున్ను అగ్ని సత్తువ నుపజీవించుకొని వచ్చినందున మేఘము అగ్నిని కప్పినట్టునన్ను, సువర్ణము సత్తున నుపజీవించుకొని వచ్చినట్లును, ఆనుండలములు సువర్ణమును కప్పినట్లును, మృత్తుక సత్తువ నుపజీవించుకొని వచ్చినట్లున్ను, ఘటమును ఆమృత్తుక కప్పినట్లు, రజ్జువు సత్తా నుపజీవించుకొని వచ్చిన సర్పమును రజ్జువు కప్పినట్లున్ను ఆత్మసత్తా నుపజీవించుకొని వచ్చిన పంచకోశములు ఆత్మను కప్పుకొనియున్నవి.

ఆత్మ పంచకోశవిలక్షణు డని చెప్పుతూ యున్నారుగదా. పంచకోశములను అంతఃకరించి, ఆత్మను తెలుసుకొనుటెట్లు? తెలుసుకొనవచ్చును. పంచేంద్రియములు దృష్టాంతము పదిమందిపిల్లకాయలు చదువుకుంటూ యుంటె, పిల్లల ఆగమనకుండా శ్రోత్రేంద్రియముల

ద్వారా తన పిల్లవానిస్వరమును తెలుసుకొనవచ్చును. ఉష్ణోదకము తీసుకవచ్చి అక్కడపెట్టితే పంచితీయలేకపోయిన త్వగింద్రియముల ద్వారా నూష్ణ మని, శీతల మని గ్రహించినట్లున్ను, దశవిధరంగులు గల కాకితములు అక్కడ తెచ్చిపెట్టితే పంచితీయలేక పోయినను నేత్రేంద్రియములద్వారా తెలుపు ఎరుపు నలుపు పచ్చ యీా మొదలైనరంగు గ్రహించునట్లును, షడ్రసములు తీసుకొనివచ్చి అక్కడ పెట్టితే పంచితీయలేకపోయిన జిహ్వేంద్రియములద్వారా యిది వుప్పు పులుపు తీపి యని గ్రహించినట్లున్ను, త్రివిధగంధములు గల పదార్థములు అక్కడ తెచ్చిపెట్టితే పంచితీయలేక పోయి నా ఘ్రాణేంద్రియములద్వారా సుగంధము దుర్గంధము మిశ్రిగంధము అని గ్రహించినట్లును, పంచకోశములను అంతఃకరించి ఆత్మను తెలుసుకొనవచ్చును. తెలుసుకొన్నందుకు అనుభవము యేలాగంటె యేలా తెలుసుకొన్నామో ఆలాగు యుండుటమే ప్రధానము.

ఆత్మయందు పంచకోశములు, యేలా యున్నవి? పంచకోశములయందు ఆత్మ యేలాయున్నది? ఆత్మయందు పంచకోశములు అనుశ్రుతముగా లేవు. అనగా జాగ్రితయందు యేకోశము లున్నవి? స్వప్నమందు నాలుగుకోశములు యున్నవి. సుషుప్తియందు వకకోశము యున్నది. పంచకోశములయందు ఆత్మ అనుశ్రుతముగా యున్నది. ఆలాయున్నందుకు తనఅనుభవమే ప్రమాణము. యింత వరకు పంచకోశములను వకవొస్తువుగా చుట్టుకొని ఆత్మపంచకోశముల కంటె వ్యతిరిక్తు డని వివేకించి యెరిగేప్రకారం చెప్పబడినది. ప్రస్తుతము విచారించినప్పుడు రజ్వాదులయందు ఆరోపింపబడిన సర్పాదులు రజ్వాదివ్యతిరిక్తముగా యెటువలె లేవో అటువలెనే ఆత్మయందు ఆరోపింపబడిన పంచకోశములు అధిష్ఠానం బగు ఆత్మకంటే వేరుగా లేవు. యధార్థమైన రజ్జుజ్ఞానముగలిగిన తరువాత సర్పప్రతీతి రావటము లేదు. ఆలాగే ఆత్మజ్ఞానముగలినతరువాత పంచకోశములయొక్క ప్రతీతి రాకయుండవలెను. వస్తువయున్నది. అందువల్ల మరుమరీచకలయందు

జలభ్రాంతి వచ్చినవెనుక విచారించి యివి మరుమరీచికలుగాని జల ములు గావని తెలుసుకొన్నప్పటికి తిరుగా జలప్రతీతి యెటువలె తోచు చున్నదో అటువలెనే ఆత్మయందు ఆరోపింపబడిన పంచకోశములు ఆత్మకంటే వేరుగా లేవని తెలుసుకొన్నప్పటికి పంచకోశముల యొక్క ప్రతీతి రావచ్చును. మరుమరీచికలయందు జలప్రతీతి మాత్రమేగాని స్నానపానాదిక్రియ జరగటము లేనట్లు ఆత్మయందు ఆరోపింపబడిన పంచకోశములు మిథ్య యని తెలుసుకొని అధిష్ఠాన జ్ఞానము వచ్చినతరువాత పంచకోశముల ప్రతీతిమాత్రము కలుగ వలెను గాని వ్యవహారము యెందు కుండవలయును. ఉదా॥ మృ త్తికయం దారోపింపబడిన ఘటశరాదులు మృత్తునకు వ్యతిరిక్తముగా లేనప్పటికీ ఆఘటశరాదులయొక్క ప్రతీతియు వ్యవహారము యెటువలె వచ్చుచున్నదో అటువలెనే ఆత్మకంటే వ్యతిరిక్తముగా పంచకోశములు లే వని తెలిసినప్పటికి ప్రతీతియు వ్యవహారము రావచ్చును. ఆలావచ్చి నప్పటికి సూక్ష్మబుద్ధియైనవానికి ఆత్మకు వ్యతిరిక్తముగా పంచకోశము లు లేవని బుద్ధియందు దృఢపడవచ్చును. యిటు లెరుగుటే పంచకో శవ్యతిరిక్తజ్ఞానము.

శ్లో॥ గురుబ్రహ్మా గురు ర్విష్ణు గురుదేవో మహేశ్వరః
గురుసాక్షా త్పరబ్రహ్మం తస్మై శ్రీగురువే నమః.

అస్య శబ్దవాక్యం సుసత్వప్రధానం మాయాశబళితం బ్రహ్మ బ్రాహ్మణో అవ్యక్తః అవ్యక్తాని మహాత్ మహతో అహంకారం అహంకారపంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యో పంచమహాభూతాని పంచ మహాభూతేభ్యో అఖిలం జగత్తు.

శ్లో॥ పంచీకృతమహాభూతా సంభవం కర్మసంచితం
శరీరం సుఖదుఃఖానాం భోగా యాతు స్మృత్యతే.

తచ్ఛబ్దవాచ్యమైనటువంటి శుద్ధసత్వప్రధానమైన మాయా శబ ళితం బ్రహ్మమును ఆశ్రయించియున్న దే ప్రకృతి. ఆప్రకృతి యుపాధి

వశంబుచేత రెండువిధంబు లాను. ఆ రెండు యేవి యనినా మాయ యనిన్ని, అవిద్య యనిన్ని రెండువిధము లాయెను. రజోగుణ తమో గుణములతో కూడిన మలినసత్వ అవిద్య ప్రతిఫలించి ప్రతిన్యం జీవుడౌట వల్ల కించిజ్ఞత్వాది గుణములున్నూ శుద్ధసత్వమాయాప్రతిబింబచై తన్యము యీశ్వరు డౌటవల్ల సర్వజ్ఞత్వాది గుణములున్ను యీావిద్య లయందు ప్రతిఫలించిన ఆత్మయందు ఆవరణవిక్షేపశక్తిద్వయాత్మకమై సత్వరజస్తమోగుణాత్మకమైన మహాతత్వము కల్పిత మాయెను. ఆమ హాతత్వముయందు ప్రతిఫలించిన ఆత్మయు ఆవరణవిక్షేపశక్తిద్వయా త్మకమై సత్వరజస్తమోగుణాత్మకమైన అహంకారము కల్పిత మాయె ను అహంకారమునందు ప్రతిఫలించిన ఆత్మయందు ఆవరణవిక్షేపశక్తి ద్వయాత్మకమై సత్వరజస్తమోగుణాత్మకమై శబ్దగుణాత్మమైన ఆకాశము కల్పితమాయెను. ఆయాకాశమందు ప్రతిఫలించిన ఆత్మయందు ఆవర ణవిక్షేపశక్తిద్వయాత్మకమై సత్వరజస్తమోగుణాత్మకమైన శబ్దస్పర్శ గుణకమైన వాయువు కల్పిత మాయెను. ఆవాయువుయందు ప్రతిఫ లించిన ఆత్మయందు ఆవరణవిక్షేప శక్తిద్వయాత్మకమైన సత్వరజస్తమో గుణాత్మకమైన శబ్ద స్పర్శ రూపగుణకమైన అగ్ని కల్పిత మాయెను. ఆయగ్నియందు ప్రతిఫలించిన ఆత్మయందు ఆవరణవిక్షేపశక్తిద్వయా త్మకమైన సత్వరజస్తమోగుణాత్మకమైన శబ్ద - స్పర్శ-రూప - రసమైన జలమ్ము కల్పిత మాయెను. ఆజలమందు ప్రతిఫలించిన ఆత్మయందు ఆవరణవిక్షేపద్వయాత్మకమైన సత్వ రజస్తమోగుణాత్మకమైన శబ్దస్పర్శ రూపరసగంధగుణకమైన పృధివికల్పిత మాయెను. ఆపృథివియందు ఓషధులు ఓషధులయందు అన్నముపుట్టె. ఆయన్నమువలన జీవులు వృద్ధిపొందిరి. యిక్కడను ఈశ్వరసృష్టి వెళ్ళిపోయెను.

ఇంక జీవసృష్టి యేలా గనిన ఆకాశతమోహాంశము వాయు మోహాంశము అగ్నితమోహాంశము. ఆకాశతమోహాంశము వచ్చి ఒకటిరెండై, రెండో భాగము నాలుగై అందులో సాత్వాంశం అంతఃకర ణాస్థానమందు జేరి అంతఃకరణ మాయెను. కర్మము నాలుగుభాగముల

లో ఒకభాగము తామసవాయువులో కలసి మనస్సునకు కంఠస్థాన మాయెను. రెండోభాగము తామసాగ్నిలో కలిసి బుద్ధికి ముఖస్థాన మాయెను. మూడోభాగము తామసజలములో కలసి చిత్తానికి నాభిస్థాన మాయెను. నాలుగోభాగము తామసపృథివిలో కలసి అహంకారానికి హృదయస్థాన మాయెను. యిక్కడికి ఆకాశపంచకము వెళ్ళిపోయెను.

ఇక వాయుపంచకము - వాయువు తమోహంశము వచ్చి ఒకటిరెండై రెండోభాగము నాలుగై అందులోనిజాంశం వ్యాపక స్థానమందున జేరి వ్యానవాయువు యాయెను. కడమ నాలుగోభాగములో వక భాగము తామసాకాశములో కలసి సమానానికి నాభిస్థాన మాయెను. రెండోభాగము తామసాగ్నిలో కలగి ఉదానానికి కంఠస్థాన మాయెను. మూడోభాగము తామసజలములో కలసి ప్రాణానికి హృదయస్థాన మాయెను. నాలుగోభాగము తామసపృథివిలో కలిసి ఆధారానికి గుదస్థాన మాయెను. ఇక వాయుపంచకము పోయెను.

ఇక అగ్నిపంచకము యెటువలెనంటె అగ్ని తమోహంశము వచ్చి వకటిరెండై రెండోభాగము నాలుగై అందులో నిజాంశము చక్షుస్థానమందున జేరి నేత్రేంద్రియ మాయెను. కడమ నాలుగు భాగములలో నొకభాగము తామసాగ్ని ఆకాశములో కలసి శ్రోత్రానికి శ్రోత్రస్థాన మాయెను. రెండోభాగము తామసవాయువులో కలసి త్వక్కుకు త్వక్కుస్థాన మాయెను. మూడోభాగము తామస జలములో కలసి జిహ్వకు జిహ్వస్థాన మాయెను. నాలుగోభాగము తామసపృథివిలో కలసి ఘ్రాణానికి ఘ్రాణస్థాన మాయెను. యిక్కడికి అగ్నిపంచకము వెళ్ళిపోయెను.

ఇంక జలపంచకము యెటువలెనంటె జలముయొక్క తమోహంశము వచ్చి వకటి రెండై రెండోభాగము నాలుగై అందులో నిజాంశము జిహ్వకు విషయరస మాయెను. కడమ నాలుగుభాగము

లలో వకభాగము తామసాకాశములలో కలసి శ్రోత్రానికి విషయ శబ్ద మాయెను. రెండోభాగము తామసవాయువులో కలసి త్వక్కుకు విషయస్పర్శ యాయెను. మూడోభాగము తామసాగ్నిలో కలసి చక్షువుకు క్రియారూపక మాయెను. నాలుగోభాగము తామసపృథివిలో కలసి ఘ్రాణముకు విషయగంధ మాయెను. ఇక్కడికి జలపంచకము వెళ్లిపోయెను.

పృథివి తమోహాంశము వచ్చి వకటికి రెండై రెండోభాగము నాలుగై అందులో నిజాంశము గుహ్యస్థానమందు జేరి గుహ్యేంద్రియ మాయెను. కడమనాలుగోభాగంలో వకభాగము తామసఆకాశములో కలసి వాక్కుస్థాన మేర్పడెను. రెండోభాగము తామసవాయులో కలసి పాణిస్థాన మాయెను. మూడోభాగము తామసాగ్నిలో కలసి పాదానికి పాదస్థాన మాయెను. నాలుగోభాగము తామసజలములో కలసి పాయువకు పాయుస్థాన మాయెను. యిక్కడికి పృథివిపంచకము పోయెను.

సమాధులకు జెప్పుచున్నారము.

సమాధు లనగా యేమియంటే శ్రోత్రేంద్రియము నేను గాను. చక్షురేంద్రియము నేను గాను. ఘ్రూణేంద్రియము నేను గాను. జిహ్వేంద్రియము నేను గాను. త్వగేంద్రియము నేను గాను. పాణేంద్రియము నేను గాను. పాదేంద్రియము నేను గాను. పాయురేంద్రియము నేను గాను. వాగింద్రియము నేను గాను. గుదేంద్రియము నేను గాను. మనస్సు బుద్ధి చిత్తము యివి నేను గాను. అహంకారము నేను గాను. అంతఃకరణ నేను గాను. వీటియన్నిటికి తెలివిగా విలక్షణముగా వెలిగే ఆత్మస్వరూపాన్ని నేను. అని యీప్రకారం యహోరాత్రులు లుంచుకొనుటే సమాధు లనబడును. ఇదే తన్మయత్వం బని యెరుగవలయును.

ఆత్మ యని అనాత్మ యని రెండుపదార్థంబులు గలవు.

ఆత్మ యన నేమి టంటే దేహత్రయవిలక్షణుడు అవస్థాత్రియ

సాక్షికి పంచకోశవిలక్షణుడు సచ్చిదానందస్వరూపుడు సచ్చిదానంద స్వరూప మనగా సత్తు యని చిత్తు యని యానంద మని మూడుపదములు గలవు. అవియేమి యనినా—

సత్తు యనగా భూతభవిష్యద్వర్తమాన కాలములయందు యున్నాడుగనుక సత్తని పేరు. చిత్తు యనగా యేమనిన తనకు తానే ప్రకాశిస్తూయున్నాడు గనుక చిత్తు యని పేరు. ఆనంద మనగా దేహేంద్రియాదులు నేను గాను. తెలివిగా విలక్షణముగ వెలిగే ఆత్మస్వరూపము నే నని తెలుసుకుంటే ఆనందముగా యుంటుంది గనుక ఆనంద మని పేరు. మరియొక దేహత్రయములకు చెప్పుచున్నారము. దేహత్రయము లనగా యేవియంటే స్థూలదేహమనిన్ని సూక్ష్మదేహమనిన్ని కారణదేహమనిన్ని మూడువిధములు. అందు స్థూలదేహ మనగా యేమియంటే చర్మ - మాంస - రుధిర - మేధో - మజ్జ - శుక్ల - అస్థి - యనే సప్తధాతువులతో కూడుకొన్నటువంటిదిన్ని మాతాపితృశుక్లశోణితమువల్ల పుట్టబడినదిన్ని కరచరణావయములతో కూడుకొన్నదిన్ని స్తంభమువలె కనుపడుచున్నదిన్ని గనుక స్థూలదేహ మనిపేరు పేరు. సూక్ష్మదేహ మనగా శ్రోత్రములనగా చెవులు - చర్మము - నేత్రములు - నాలుక - ముక్కులతో కూడుకొన్నటువంటి జ్ఞానేంద్రియాలు - అయిదున్ను - నోరు - చేతులు - పాదము - గుదము లనే కర్మేంద్రియాలు అయిదున్ను, ప్రాణ - అపాన - వ్యాన - వుదాన - సమానము లనే పంచప్రాణములైదున్ను - మనోబుద్ధులు రెండున్ను - యీపదిహేడు యింద్రియములతో కూడుకున్నదే సూక్ష్మదేహ మని పేరు. కారణదేహ మనగా మలినసత్వరజస్తమోగుణాత్మకమైన అద్యే కారణదేహ మని పేరు.

అవస్థాత్రయములు చెప్పుచున్నారు.

అవస్థాత్రయము లనగా జాగ్రదవస్థ స్వప్నావస్థ నిద్రావస్థ లని మూడువిధంబులు. జాగ్రదవస్థ యనగా యింద్రియములచేత పదార్థములన్ని తెలుసుకోవడము యేది కద్దో అదే జాగ్రదవస్థ యనిపేరు.

దీనికి అభిమాని విశ్వజుడు. స్వప్నావస్థ ఏమి యనినా జాగ్రదవస్థలో అనుభవించిన పదార్థములు యేవి కద్దో అవి జ్ఞాపకము రావటము స్వప్నావస్థ యని పేరు. అభిమాని తైజసుడు. సుషుప్త్యవస్థ యేమి యనినా సుషుప్తికాలమందున ప్రాణములు తిరిగి తిరిగి అవిద్యయందు యెట్లు లీనమై పోవుచున్నవో అదే సుషుప్త్యవస్థ యని పేరు. దీనికి అభిమాని ప్రాజ్ఞుడు.

శ్లో॥ స్థావరో లక్షవింశత్యా జలజో నవలక్షకః
క్రిమీణాం రుద్రసంఖ్యాశ్చ చాతుర్లక్షంతు మానుషః.
త్రింశలక్షగవానాంచ పక్షిజాం దశలక్షకసు.

అనగా వృక్షాదిస్థావరములు ౨౦ యిరువై లక్షలున్ను, నీటి యందుబుట్టిన మత్స్యాదిజలచరవర్ణములు ౯ తొమ్మిది లక్షలున్ను, పురుగులు మొదలగు క్రిమికీటకవర్ణములు ౧౧ పదకొండులక్షలున్ను, మనుష్యజాతి భేదములు ౪ నాలుగులక్షలున్ను, గోవులు మృగములు పిండజములవర్ణములు ౩౦ ముప్పదిలక్షలున్ను, పక్షివర్ణములు ౧౦ పదిలక్షలున్ను మొత్తము ౮౪ యెనభై నాలుగులక్షల జీవరాసులు గలవు. వీటిలో మనుష్యులుగా జన్మరావటము మహాదుర్లభం గాన అన్ని జన్మములలో విశేషమగు మానవజన్మ వొచ్చినందుకు శ్రీసద్గురు మూర్తి సంపాదించుకొని తన జన్మవృత్తాంతము తెలుసుకొని తిరిగి యీజన్మకు గర్భనరకప్రాప్తి చెందక తప్పించుకొను యుక్తిని యెల్లరిలో తిరిగి మెలగుచు అటుల గాదేని దేహభ్రాంతి నొదలి నిర్జన ప్రదేశమున మెలగి యీ ప్రపంచసుఖములు క్షణములో యరక్షణ మాత్రమంత వని తెలసి యీక్షణసుఖమునకు బద్ధులమైన శాశ్వతమై పెరుగుతరుగులు లేని నిత్యసత్యబుద్ధ్యం బగు పరలోకసంఖ్యము నొదుల యుపయోగ ముండదని నిశ్చలత్వంబు నొంది జననమరణాంబుధిని దాటి యావల యుండుట విశేషము. గాన యీజన్మ యిక దొరకుట దుస్తరము - మస్థము. ఆనందమే.

## మనుష్యప్రమాణము.

౯౬ అంగుళముల పొడవు లేక యెనిమిదిజానలు పొడవు, ౪ జానల వెడల్పు అనగా చుట్టూయుండేప్రమాణము. 33 కోట్ల రోమములు, ౭౨౦౦౦ నరములు, ౬౬ యెముకలు, ౧౨ కీళ్ళు, 33 మూరల పేగు, శేరు గుండెలు, అర్ధశేరు రుధిరము, మణుము నాలుగుశేర్లు మాంసము, సోలెడు పైత్యం, అరసోలెడు శ్లేష్మము యున్నింటితో కూడుకొనిన స్థూలశరీరము గాని బంగారుశరీరముగాదు. యీ తోలుశరీరములో యున్నవానిని నెరిగి, నెరిగినదానిని మరగి, మరుగుదానిని మరువకయుండి, యుండినదానిలో యుండి, లేనిదానిని లేదనక యున్నదనక యుండుటే సరి, సరి, సరి.

## అధ్యారోపాపవాదప్రకరణము.

నిష్ప్రపంచ మగు నీబ్రహ్మమును బోధించుటకు పెద్దలు అధ్యారోపాపవాదరూప మగు నొక నుపాయమును గనిపెట్టిరి.

అధ్యారోప మనగా నొకవస్తువయందు వస్తువకాని దానిని ఆరోపించుట, శుక్తియందు శుక్తిక కాని రజితమును ఆరోపించినటుల ప్రస్తుతమందు వాస్తు వనగా సచ్చిదానంద మగు బ్రహ్మము. వాస్తువ కానిదానికి అనగా యజ్ఞానము మొదలు స్థూలమువరకు నగు నీ ప్రపంచము—అట్లు ప్రపంచమునందు నీబ్రహ్మమును ఆరోపించుట ఆధ్యారోప మనబడును. సత్తు యనగా కాలత్రియములందు దేని చేత బాధింపబడనిది. చిత్తనగా స్మరణరూపకమైనది. ఆనంద మనగా దుఃఖాభావము. దీనియం దారోపింపబడు అజ్ఞానస్వరూప మేమనిన యున్నదనుటకును లేదనుటకును కూడా వీలుగాక సత్వరజస్తమోగుణా త్మకమైన యొకటియై యున్న అది బ్రహ్మజ్ఞానముచేత పోవునది గనుక యున్న దని చెప్పవచ్చును. యిదిగాక లోకములో యింద్రజాలమంటిది నవచ్చును. యింద్రజాలము లేని దని యంతవరకు విశదమయ్యే యున్నది. తోచునప్పుడు యున్న దని కూడా యనుకొనుచున్నాము.

యిది యేమో నాకు తెలియదు అనునన్పుడు అజ్ఞానానుభవము అందరికినీ యున్నది. ఘటమునకు మన్ను భంగిని యీయజ్ఞానమే జగత్తునకు ఉపాదానకారణము. బ్రిహ్మసాన్నిధ్యంబు లేక నీయజ్ఞానము స్వతంత్రిముగా కారణము కానేరదు. గనుక ఘటమునకు కులాయిభంగి బ్రిహ్మము యీజగత్తునకు నిమిత్తకారణము. యిదిగాక జగత్తునకు నుపాదానకారణ మగు నీయజ్ఞానముకూడా బ్రిహ్మయం దారోపింపబడినది గనుక యీయజ్ఞానమునకు బ్రహ్మవివర్తఉపాదానకారణముకాక బ్రహ్మము యీజగత్తునకువుపాదానకారణమున్ను అయియున్నదని యీయజ్ఞానమునకు తమోగుణాత్మక మగు ఆవరణశక్తి రజోగుణాత్మక మగు విక్షేపశక్తి యని రెండుశక్తులు గలవు. అందులో నావరణశక్తి తనస్వరూపమును తెలియకుండ జేసి పై విక్షేపశక్తియందు కర్తృత్వాదులనుఆరోపించును. తమోగుణప్రిధానమైన విక్షేపశక్తితో కూడిన అజ్ఞానము వుపాధిగల బ్రిహ్మమువలన ఆకాశమును, దానివలన వాయువును యీరీతిగా సూక్ష్మభూతము గలిగినవి. యీభూతములు త్రిగుణాత్మికములేయైనను జాడ్యాంశము అధికముగా యుండుటచేత వీటికి తమఃప్రాధాన్యము. వీటి సత్వాంశములచేత జ్ఞానేంద్రియ అంతరేంద్రియములున్నూ, రజోంశములచేత కర్మేంద్రియ ప్రాణేంద్రియములున్నూ కలిగినవి. ఆ సూక్ష్మభూతములను పంచీకరించుటచేత స్థూలభూతములను వాటివలన చతుర్దశభువనములు ప్రాణములు మొదలగు సమస్తజగత్తు గలిగినది. యిటుల జగత్తునకు నుపాదానకారణమగు యీయజ్ఞానకార్యములు యేవి యనిన నిత్యసుఖస్వరూపు డగు తనను దుఃఖవంతునిగాను, నిత్యశుద్ధు డగు తనను అశుచివంతునిగాను, అఖండుడగు తనను ఖండవంతునిగాను, పరిమాణరహితు డగు తనను స్థూలత్వ కృశత్వ హ్రిసత్వ దీర్ఘత్వము మొదలగునవి కలవానిగాను, వాతపిత్తాదులు లేని తనను వ్యాధివంతునిగాను, నిస్సంగు డగు తనను దారాపుత్రాదిసాంగత్యముకలవానినిగాను, చలనాదివికారరహితు డగు తనను వికారవంతునిగాను, సంకల్పాదిరహితు డగు తనను సంకల్పాదులుగలవానినిగాను,

కర్తృత్వాదిరహితు డగు తనను కర్తృత్వాదులు గలవానినిగాను, ప్రియాప్రియమోదవృత్తులు లేని తనను ఆయావృత్తులు కలవానినిగాను తోఁచింపబడుచున్నది. అహంపదార్థ మగు బ్రహ్మయం దారోపింప బడు విశేషములు యేవియనిన నేను కృశించితిని, నేను స్థూలముగా యుంటిని అనునప్పుడు యింద్రియములకు యన్వయించును గనుక నేను అనునది యింద్రియము లని సిద్ధాంతము చేయుచున్నారు. ప్రాణము మొదలగువాటికి అన్వయించి నేను అనునప్పుడు కొందరు ప్రాణము లనియు, కొందరు మనస్సనియు, కొందఱు అహంకార మనియు, కొందరు అజ్ఞానమనియు, కొందరు శూన్యమనియు, కొందరు అజ్ఞానవిశిష్టచైతన్య మనియు అనేకవిధముల నపార్థసిద్ధాంతముల చేయు చున్నారు. యిది అంతయు అధ్యారోప మనబడును. అపవాద మనగా పైనుదహరించిన ప్రకారము అజ్ఞానమువలన కలిగిన ప్రపంచము అజ్ఞానమునకు వేరుగాదు. యెట్లనినా రజ్జువునందు అజ్ఞానంచేత కల్పింప బడిన సర్పము అజ్ఞానమే గాని అంతకంటె వేరుగాదు. యీయజ్ఞానము బ్రహ్మమందు యారోపింపబడినదిగనుక లేనిదే కాగా యీలేనిది దేని యందు కల్పింపబడినదో యదే సత్యము. తక్కినవి మిథ్యా అనగా లేని దానిని లేనట్టున్ను యున్నదానిని యున్నట్టున్ను చూచుట యపవాద మనబడును.

## సత్తాప్రకరణము.

బ్రహ్మ సత్తనియు, ప్రపంచము మిథ్యయనియు పైనచెప్ప బడెను. బ్రహ్మము సత్తా ప్రపంచమునం దారోపింపబడుటచే ప్రపంచము సత్యముగా దోఁచుచున్నది. గాని సత్తా బ్రహ్మముగాక వేరే లేదు. సత్తా మూఁడువిధములు. పారమార్థిక మని వ్యవహారిక మని ప్రాతిభాసిక మనిన్నీ చెప్పబడును. పారమార్థికసత్తా యనగా త్రికాల బాధ్యము. యిదియేకదా బ్రహ్మము తప్ప వేరేదియు కాదు. వ్యావహారికసత్తా యనగా పరమార్థముగా లేక వ్యవహారమునకు మాత్రము యున్నది. ప్రపంచము యీతరగతిలోనిది. ప్రాతిభాసికసత్తా యనగా

స్వప్నవాస్తవులు సుషుప్తికారచితాదులభంగిని తత్కాలమాత్రము యుండునవి, యీవ్యవహారదశయందుకూడా బాధింపబడునవి యై యున్నవి. బ్రహ్మము అసత్తు కానేరదు. లోకములో అధిష్టానము లేని కల్పన యెక్కడను యుండదు. శుక్తిక యొకటే యధిష్టానముగా యుండిన దానియందు రజితము కల్పింపబడునుగాని శుక్తికమినహాగా రజితము కల్పింపబడనేరదు గనుక ప్రపంచ మగు కల్పనకు యధిష్టానముగా యొకవాస్తవ యుండవలెను. యిది లేకపోలేదు. యెప్పుడును యుండక తీరదు. దీనినే బహ్మ మని వాడుకుంటూ యున్నాము. మనము యే మని పేరుపెట్టినను పదార్థము యేకతీరుగానే యున్నది. జగత్తు సత్తుకానేరదు. అనగా మిధ్య. కాలత్రియములందు పరమార్థము లేనిది, స్థాణుపురుషునివలె యున్నది. స్థాణుపురుషుడు యెప్పుడును తోచక భ్రాంతియందుమాత్రము తోచును. యొకప్పుడు యుండి యొకప్పుడు తోచదుగనుక మిధ్య యనగా యెప్పుడు లేని వాడే. భ్రాంతికాలమందు మాత్రి మెప్పుడు పురుషుడు పరమార్థము కాగలదా? గనుక యొకప్పుడు మాత్రము తోచి యొకప్పుడు తోచనివి అంతయు అసత్యమే. యీప్రపంచము యెప్పుడు తోచునది గాదు. సుషుప్తియందు జాగ్రిత తోచదుగనుక జాగ్రిత మిధ్య. ఇదిగాక స్వప్నము మిధ్య యని యందరూ వాడుకుంటూ యున్నారు. దీనికి కారణము జాగ్రితయుండి లేదుగనుక స్వప్నము అసత్యము. స్వప్నమునందు జాగ్రితమాత్రము యున్నదా? గనుక స్వప్నముభంగి జాగ్రిత యేల మిధ్య కాకూడదు? సుషుప్తియును జాగ్రిత స్వప్నములయందు లేదుగదా! గనుక మూడవస్థలలో ప్రతిదీ తక్కిన రెండు అవస్థలలోనూ లేనిదే. గనుక మూడవస్థలు మిధ్యయనుటకు సంశయ మెందుకు గనుక జగత్తు మిధ్య.

పంచభూతముల లయము.

పృధివి- జలము - అగ్ని - వాయువు - ఆకాశము-యివిపంచభూతములు. పృథివి జలమందు లయము యయ్యె యదియెట్లాగంటే పెద్ద

మడుగులో చిన్నమట్టిపెల్ల వేస్తే యది యెట్లా కరుగునో యటువలెనే పృథివి జలమందు లయంచేస్తిమి పృథివి లేదు. జలము అగ్నియందు లయముచేస్తిమి. యది యెట్లాగంటే కాలేకాలే వృక్కమీాద యుదక బిందువు వేస్తే యది యెటుల యినికిపోవునో అటులనే జలము అగ్ని యందు లయము చేస్తిమి. జలము లేదు. అగ్ని వాయువునందు లయము చేస్తిమి. యది యెటులనగా గాలిలో దీపముపెడితే యది యెట్లా ఆరిపోవునో వాయువునందు లయము చేస్తిమి. అగ్ని లేదు. వాయువు ఆకాశమందు లయముచేస్తిమి. అది యెట్లాగనిన సుషుప్తి కాలమున ప్రాణము తిరిగి తిరిగి అవిద్యయందు యెటుల లీనమై పోవునో అటువలెనే వాయువు ఆకాశమందు లయం చేస్తిమి. వాయువు లేదు. ఆకాశము మాయయందు లయంచేస్తిమి. యది యెటు లనగా యేనుగు కడుపులో వెలగకాయ మాదిరిగా ఆకాశము మాయ యందు లయంచేస్తిమి. ఆకాశము లేదు. మాయలేనిది గనుక యెప్పుడూ లేనే లేదు. నిత్యమై నిరుపాధికమై నిర్గుణపరబ్రహ్మం యొకటియే కలదు.

శ్రీ వేంకటేశ్వర సమర్థ.



# తారకవిచారణ.

ఈలోకంబున యనేకమంది తారకమంత్రోపదేశము పొందితి మని, యహోరాత్రులు తన్మంత్రమును ధ్యాన్నించుచూ యుంటి మని యొకరి కొకరు చెప్పుచూ వినుచూ మురయుచుందురు. యిటుల బల్కువారలు యేమి యోచున్నదో గమనించగలరు. యేలయన యున్నద్యున్నట్లు దెలసిన చచ్చినట్టుబడియుండి యుండుటయే గుర్తను నార్యోక్తి జ్ఞాపకము యెందు కుంచుకొనరో తెలియకున్నది. గాన యిటుల యొకరి కొకరు చెప్పుకొని మురయువారలు సత్య మగు వస్తు దర్శనమంది మురయుచుందురో విశదముగాదయ్యె. లేక సత్య మగు దానినే నందియున్నా రనుకొనిన సత్య మగు వస్తువకు మురిపె తిరిపె ములు లేవుగదా! ఇందునగురించి యీప్రకారము చెప్పుకొనువారె ల్లరు ఆమంత్ర మన యేదియో శ్రీగురుమూర్తిద్వారా తెలసి చచ్చి యున్నవారు గారుగాన తారకము మంత్రము అని రెండుపదములలో యున్నగుట్టు కొంచెము పెద్దలవల్ల గ్రహించి నిద్రించి పెద్దనిద్ర పొంద నాసక్తితో యుండుకాలములో యణుమాత్రము మేల్కొయుండి యుండకపోవు టయములో మీబోట్ల సుజ్ఞాన సుయుక్తి సుశక్తి సు సూక్ష్మ బుద్ధిగలవారలకు రవంత యీదాసుడు పరోపకారార్థ మిదం శరీరం అను నార్యోక్తి నవలంబించి తెలుపబూను మని నాసద్గురుం డగు శ్రీమన్మాధవరాజు వేంకటేశ్వరప్రభుస్వాములవా రానతిచ్చిన ప్రకారం వారియాజ్ఞ శిరసా వహించి తెలుపుటకు నారంభముచేయు

మనే ఆజ్ఞ యొసంగు మని నాగురుమూర్తిని ప్రార్థించి వ్రాయబూని నాడ. తారకము యనేదే మంత్రమా ? మంత్రి మనునదే తారకమా? మంత్రము తారకము యొకటియేనా ? యదియాదె యిదియిదేన? యీ రెండుగాన యొకఅర్థము యుండెనా? యని మదిని చర్చించిచూడ మంత్రము తారకము రెండు నకటియేయని తేలుచున్నది. యది యెట్లు లనిన తారకము యనగా తా తనయొక్క రకము అనగా వర్ణము అనగా పంచరంగులతో యుత్పత్తియైన యీస్థూలము - దీనియందు తారకము యనగా ఆధారము - యట్టిఆధారముద్దై యున్న వాడు యెవ డు ? వానినామరూపకులగోత్రము లెవ్వి ? వాని నివాసం బెచట ? వాడు యెవరిప్రేరేపణచే యుండె ? లేక తానంతట తానే యుండెనా? యిటుల యుండి తాను యేమి పొందుచున్నాడు ? లేక యేమి పొంద టములేదా ? యేమీ పొందనివాడు యేరకము వాడు ? యని యీ సంగతులు విచారించుకొని యీవిచారించువాని తారకము గనిన తాను యేతారకం బౌనో యదియే తారక మని తారకములో యున్న అర్థమే మంత్రి మని యీమంత్రమంత్రార్థమునకై సాధనచతుష్టయ సంపన్నుడై సద్గురుమూర్తిని సేవించి తెలుసుకొని తిరిగి పుట్టుగిట్టుల నొల్ల, నే నకర్త నని యెల్లరు సద్భక్తితో యుందు రని నావందనములు.

తారకము - తా తనయొక్క రకము యన రంగులు - పంచరం గులతో కూడి యుత్పత్తియైన తనువునందు తన స్వరూపుడై అంతర్బా హ్యములందు యుండి ప్రళయమా పను లోనర్చుచు దొకప్పుడు యేమి యెరుంగనివానివలె యుండువాడు. సర్వభూతజాలములలో యుండి యెన్నో చిత్రవిచిత్రపల్కులు పల్కుచు తాను పల్కులు పల్కనివాని వలె యుండు వా డెట్లు యుండె ననగా హంసస్వరూపుడై హంస యను నామ మేర్పరచుకొని యుండెను. యది యెట్లు లనిన ?—

శ్లో॥ గురుబ్రహ్మ గురు ర్విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరంబ్రహ్మం తస్మై శ్రీగురువేనమః.

శ్లో॥ మ మాత్మ సర్వభూతాత్మా మద్గురు శ్రీజగద్గురుః
మన్నాథ శ్రీజగన్నాథః తస్మై శ్రీగురువే నమః.

గురువాక్యం — సోహం.

హంస - శివ - సోహం —

అర్థము - హం నేను, స సర్వవ్యాపకమైన, సోహం సోహ స్వరూపమగు శివ శివుణ్ణి. హం నేను, సో నీవు, నీవే నేను, నేనే నీవు.

ధ్యానశ్లోకములు.

శ్లో॥ హంసో గణే సేవితరాజహంసా హంసో హరిం శంభుమయోపి
హంస। జీవోపి హంస గురుదేవ హంస జ్ఞానశ్చ హంస పర
మాత్మ హంస। హంస స్సోహం హంసోహం.

శ్లో॥ అకారంనాదరూపంచ సాకారంబిందురూపకం
నాదబిందుశ్చ హంసశ్చ జీవసర్వజపే కృతుం.

శ్లో॥ అకారం శివరూపంచా సాకారం శక్తిరూపకం
శివ శ్శక్తిశ్చ హంసశ్చ జీవ సర్వజపేకృతుం.

శ్లో॥ ఏకహంస దశా వాయు ప్రాణయోగప్రకీర్తితాః
హంసాఇతి సుమంత్రేణ ద్వాదశాష్టాంతరాంగుళం.

శ్లో॥ ఉశ్వాసంచ అకారం విశ్వాసంచ సాకారకం
శ్వాసనిశ్వాసహంసశ్చా జీవసర్వ జపేకృతుం.

శ్లో॥ ఆకారేణ బహిర్యాది సాకారో విశ్వతః పునః
హంసహంసేతి యన్మంత్రం జీవో జపతి సర్వదా.

శ్లో॥ గమాగమ స్తం గమనాదిశూన్యం చిద్రూపదీపం తిమిరాపహారం
పశ్యామి తే సర్వజనాంతరస్థం నమామి హంసం పరమాత్మరూపం.

శ్లో॥ హంసహంస పరమహంస స్సోహం హంస స్సోహం
హంసః హంసహంసేతి మో బ్రూయా తద్హంసో నామ సదాశివా.

శ్లో॥ గురోర్వాక్యానుపూర్వాయా విపరీతభవే జపం
సోహం హంసా మితి ప్రాజ్ఞమంత్రయోగప్రముచ్యతే.

సోహమునకు అంగన్యాసము.

ఓం అస్యశ్రీగురుగీతామాలామంత్రస్య భగవాన్ సదాశివఋషిః నిరాట్ఛందః శ్రీగురుపరమాత్మా దేవతా హం బీజం సః శక్తి సోహం కీలకం శ్రీగురుకృపాప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః.

అథ కరన్యాసః.

ఓం హం సాం సూర్యాత్మనే అంగుష్ఠాభ్యాం నమః, ఓం హం సీం సోమాత్మనే తర్జనీభ్యాం నమః, ఓం హం సూం నిరంజనాత్మనే మధ్యమాభ్యాం నమః, ఓం హం సైం నిరాభాసాత్మనే అనామికాభ్యాం నమః ఓం హం సౌం అతనుసూక్ష్మాత్మనే కనిష్ఠికాభ్యాం నమః ఓం హం సః అవ్యక్తాత్మనే కరతలకరపృష్ఠాభ్యాం నమః.

యీచెప్పిన ప్రకారము చేతియంగుష్ఠము మొదలైన వానియందు క్రమముగా నుంచవలయును.

అథ హృదయాదిన్యాసః.

ఓం హం సాం సూర్యాత్మనే హృదయాయ నమః, ఓం హం సీం సోమాత్మనే శిరసేస్వాహా, ఓం హం సూం నిరంజనాత్మనే శిఖాయై వషట్, ఓం హం సౌం అతనుసూక్ష్మాత్మనే నేత్రత్రయాయ వౌషట్, ఓం హం సః అవ్యాక్తాత్మనే హస్త్రాయ ఫట్.

ఈప్రకారము హృదయము మొదలైనవానియందు క్రమము నుంచవలయును. భూర్భువస్సువరో మితి దిగ్బంధః.

ధ్యానం.

శ్లో॥ హంసాభ్యాం పరివృత్తపత్రకమలైర్దివ్యైర్జగత్కారణం
విశ్వోత్తీర్ణ మనేకదేహనిలయం స్వచ్ఛంద మానందకం

ఆద్యంతైక మఖండచిద్ఘనరసం పూర్ణం హ్యనంతం శుభం
ప్రత్యక్షాక్షరవిగ్రహం గురుపదం ధ్యాయే ద్విభుం శాశ్వతం.

శ్లో॥ విశ్వవ్యాపిన మాదిదేవ మమలం నిత్యం పరం నిష్కళం
నిత్యోద్బుద్ధ సహస్రపత్రకమలే లుప్తాక్షరే మంటపే
నిత్యానందమయం సుఖైకనిలయం నిత్యం శివం స్వప్రభుం
ధ్యాయే ద్ధంస పరం పరాత్పరతరం స్వచ్ఛందత స్సర్వదా.

శ్లో॥ ధ్యాయామ్నాయగురోఃపదం త్రిభువ నోంకారాఖ్య సింహాసనం । సిద్ధాచారసమస్తవేదపఠితం షట్చక్రసంచారిణం । అద్వైతస్ఫురదగ్ని మేక మమలం పూర్ణప్రభాశోభితం । శాంతం శ్రీగురుపంకజం భజ మన శ్చైతన్యచంద్రోదయం.

శ్లో॥ నమామి సద్గురుం శాంతం ప్రత్యక్షం శివరూపిణం
శిరసా యోగపీఠస్థం ముక్తికామార్థసిద్ధిదం.

శ్లో॥ ప్రాతః శిరసి శుక్లాబ్జం ద్వినేత్రం ద్విభుజం గురుం
వరాభయకరం శాంతం స్మరే త్తం నామపూర్వకం.

శ్రీ అనంతలక్ష్మీసమేత శ్రీమద్భాగవత శ్రీకృష్ణసద్గురుపరబ్రహ్మణే నమః.

## మహావాక్యము.

మహావాక్య మనగా మహా అనుపదములో యున్న అర్థం శేమనిన మహా యన విస్తార మనిన్ని, యెక్కువనిన్ని, జాస్తియనిన్ని, పెద్దదనిన్ని, గొప్పదనిన్ని, మిక్కిలి యానన్ను, అంతులేనిదనిన్ని, చెప్ప శక్యంబు లేని దనిన్ని, యింకా యెన్నో నామములతో యుండు హా మహా యను పదము యుండే వాక్య మనగా ఆచెప్ప శక్యముగాని దని బత్కే పలుకు అట్టిగొప్పవస్తువను తెలియజేయు తెలివికి తెలివై యున్న దని అర్థము. అట్టి చెప్పశక్యముగాని వొస్తువ చెప్పశక్యమగు పంచ భూతమ్ములతో జన్మించి దశేంద్రియాదిసహితమై యాస్థూలము, మాంసము, కండలు, తోలు, నరములు, యెముకలు, మలము,

మూత్రము, శుక్లము, శోణితము, చీమిడి, పుసులు, గుబిలి, సొల్లు, మెదడు, రక్తము యింకా యెన్నో యసహ్యమగు యీతనువు సందు చెప్పశక్యముగాని దని తెలియజేయు తెలివికి తెలివై యున్న వాక్యము యేవిధముగా యున్నదో అది యెట్టిస్వరూపై యున్నదో యిట్టి మహావాక్యము యిట్టి యసహ్యకళేబరమును యెందుకు ఆశ్రియించి యున్నదో యీదేహమును ఆశ్రియించి యెప్పటికి యీఅంగవాక్యము నకు యుండే స్నేహము చెడదో చెడెనో యిది యెటుల వర్తించునో శరీరయింద్రియాది పనికరములు యేమి యగునో యీయింద్రియము లుండిన యుండకపోయిన యీయింద్రియములకు అంటక సాక్షిభూత మగు అనంతమయిన యిన్ని యేద్వంద్వరూపములను తెలుసుకొని ద్వంద్వాదినామభేదం బెరింగి నిశ్చేష్టితులై యుండుసాధన యేమి యగు నని దలచుచు నాసద్గురుమూర్తి యగు శ్రీమన్మాధవరాజు వేంక టేశ్వరప్రభుస్వాములవారిని భక్తిశ్రద్ధల ధ్యానించి పూజించి తెలుసు కొనుదానిని యీవన్మంది సుజనబృంద ముందుచోటున నెగజల్లి నే నను నది యేమియు లేక పోదలచి నాసద్గురుమూర్తియే దిక్కు యని నేను నీవు అను ద్వంద్వవాక్యములను విడి నాప్రభు వగు గురుస్వాములు నావాక్కున యుండి కన్నులతో చూచుచు చెవులతో వినుచు చేతు లతో చేయించ నేను అను శబ్దము లేనివాడనై యీచిన్నిపొత్తమును వ్రాయజూచి యీసాంతం బర్థము తెలసి స్థాలిత్యంబు లనే విషమున్న విడి స్థాలిత్యరహితమగు యేయమృత మని ఆరోగ్యత్త్రమోత్తములు వాడెదరో నద్దానిని స్వీకరించి నే నని యొనర్చు యహంకారము నొదలి ద్వంద్వసహితముయుండునది యెద్దియో నద్దాని నొదలజేసి ద్వంద్వరహితమగు యేవొస్తువ యున్నదో దాని తెలసి తెలసిన తెలి వికి తెలివై సర్వసాక్షిమాత్రుడై యన్నింటియందు నున్నట్టు తోచ్చి లేనివా డగు వానిగుర్తు నంది నందితి ననే గుర్తుపై యున్న భ్రమ నొదలి యుండి యెప్పటికి తిరిగి పుట్టిపుట్టి చచ్చిచచ్చి గర్భనరకములు బడక సద్భక్తి సచ్చేవ సద్భజన సద్విచారణ సద్వినియోగము సత్సాంగ

త్యము సలుపుకొని తిరిగి యీయేహ్యమై కనుపడు శరీరముకు రామనే దృఢమై యెల్లరు యుందు రని యిందు వ్రాయు మహావాక్యములు వెల్లడిజేయనైనది. నాప్రజ్ఞ యించుకయు లేదు. యించుకయు లేక యెటులవ్రాసితి వని నలుగవలదు: సమస్తము చేయించు కర్త నాసద్గురుమూర్తి యున్న హేతువుచే నా దేమియు లేదు. నేను యేమిలేనిది' నాపనియే లేదు. నాతనువే లేదు.

అస్య శ్రీగురుమహావాక్య మంత్రస్య బ్రహ్మవిష్ణుమహేశ్వరఋషిః యజుర్వేద ఋగ్వేద సామవేద అథర్వణవేద ఛందాంసీ శ్రీగురుపరమాత్మా దేవతా ఓం నమః.

ప్రజ్ఞానం బ్రహ్మ మితి బీజం, అహం బ్రహ్మాస్మి తత్వ మసీతి శక్తిః, అయ మాత్మా బ్రహ్మ సోహ మితి కీలకం, శ్రీగురుప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః.

## కరన్యాసః.

ఓంనమః అంగుష్ఠాభ్యాం నమః, ఓం ప్రజ్ఞానం బ్రహ్మ తర్జనీభ్యాం నమః, ఓం అహం బ్రహ్మాస్మి మధ్యమాభ్యాం నమః, ఓం తత్వ మసి అనామికాభ్యాం నమః, ఓం అయ మాత్మా బ్రహ్మ కనిష్ఠికాభ్యాం నమః, ఓం సోహం కరతలకరపృష్ఠాభ్యాం నమః.

## అంగన్యాసః.

ఓంనమః హృదయాయై నమః, ఓంప్రజ్ఞానం బ్రహ్మ శిరసే స్వాహా, ఓం అహం బ్రహ్మాస్మి శిఖాయై వషట్, ఓం తత్వమసి కవచాయహుం, ఓంఅయ మాత్మా బ్రహ్మ నేత్రత్రయాయ వౌషట్, ఓం సోహం హస్త్రాయ ఫట్, భూర్భువస్సువ రో మితి దిగ్బంధః.

## ధ్యానం.

శ్లో॥ ఊర్ధ్వామ్నాయగురోఃపదం త్రిభువనోంకారాఖ్యసింహాసనం
సిద్ధాచారసమస్తవేదపఠితం షట్చక్రసంచారిణం

అద్వైతస్ఫురదగ్ని మేక మమలం పూర్ణప్రభాశోభితం
శాంతం శ్రీగురుపంకజం భజ మనశ్చైతన్యచంద్రోదయం.

లం పృధివ్యాత్మనే శ్రీగురుపరమాత్మదేవాయ గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే శ్రీగురుపరమాత్మదేవతాయ పుష్పం సమర్పయామి. యం వాయువ్యాత్మనే శ్రీగురుపరమాత్మదేవాయ ధూపం సమర్పయామి. రం తేజోత్మనే శ్రీగురుపరమాత్మదేవాయ దీపం సమర్పయామి. వం ఆకాశాత్మనే శ్రీగురుపరమాత్మదేవాయ అమృతనైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే శ్రీగురుపరమాత్మదేవాయ సర్వోపచారాన్ సమర్పయామి.

శ్లో॥ గురుబ్రహ్మ గురు ర్విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్పరబ్రహ్మం తస్మై శ్రీగురువే నమః.

శ్రీజానకాంబాసమేత శ్రీమన్మాధవరాజు వేంకటేశ్వరప్రభు
నిజగురుపరబ్రహ్మణే నమః.

అధమనుః.

ఓం - ప్రజ్ఞానం బ్రహ్మ - అహం బ్రహ్మాస్మి - తత్త్వమసి - అయ మాత్మా బ్రహ్మ - సోహం. ——జపం—— ౧౦౮

సర్వం శ్రీనిజగురుచరణారవిందార్పణ మస్తు.

తీర్థగ్రహణం.

శ్లో॥ అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారణం
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్.

హా నానిజగురుదేవా! యీమహావాక్యములకు అర్థం వ్రాయరా యని తమరు ఆజ్ఞపురికొల్పియుంటిరి. దేవా మునీశ్వర్లు ఋషీశ్వర్లు యోగీశ్వర్లు ఆర్యులు ఆర్యోత్తములు అయ్యలు అమ్మలు యింకా యెంతోమంది పెద్దలు యీవాక్యములకు అర్థం వ్రాయజాలక యుండిరా? యర్థము వ్రాయలేదా? వ్రాసినను వ్రాసినంత చెప్పరు. చెప్పిరో

నమ్మరు. నమ్మిరో చేయరు. చేసిరో నిలుపరు. నిలిపిరో సార్వకాలము నిదురవచ్చువరకు తాము చచ్చువరకు నమ్మి చేసి, చేసినదానిని నిలుపుకొని జననమరణప్రవాహముకు వెలివొడ్డుచారలై యుండువారు 'మనుష్యాణాం సహస్రేషు' యని యనగా వెయ్యిమంది గురువులలో యొకరు సంసారాంబుధి దాటి కేవలపరిపూర్ణపరబ్రహ్మమందు గలయు నని ఆర్యోత్తమోత్తములు బల్కుచుండ నేను జడుడను ఖలుడను పాపుడను నీచుడను తామసుడను రోగుడను చోరుడను జారుడను మోహుడను కాముడను క్రోధుడను లోభుడను మదోన్మత్తుడను మత్సరుడను భయుడను లజ్జకుడను దురాత్ముడను దురాచారుడను దుర్నీతుడను దుశ్చేష్టుడను దుర్వినియోగుడను దుర్జనసాంగత్యుడను దురాలాపావృతుడను ధూర్తుడను దూరదృష్టిరహితుడను దుర్విషయాసక్తుడను దుర్బుద్ధిని దురహంకారుడను దుశ్చిత్తుడను దుర్విషయాలోలుడను కుత్సితుడను క్రూరుడను రాగుడను శ్రవణాసక్తుడను నేత్రాసక్తుడను హింసాసక్తుడను జిహ్వాసక్తుడను పరనిందాపరుడను స్వస్తోత్రుడను. దేవా! కర్ణాసక్తి నేత్రాసక్తి జిహ్వాసక్తి యిన్ని యాసక్తులు గల నేను నావల్ల యగు నని యెట్లు దలచెద? యేల యన? యొక్కొక్కాసక్తిగల పాములు చేపలు మొదలగు జంతువులు మిడతలు మొదలగు యీజంతుజాలములు నశించిపోవుచుండె. యేలయన—కర్ణాసక్తిగల పాము లోగడ యితరులు చూచిన చంపు నని యేదో యొకబొక్కలోనో లేక పుట్టలోనో గాక చెట్లతొర్రలోనో తనప్రాణసంరక్షణకై దాగి యద్విధముగా యుండక యొకపాములబట్టువాడు పాముకొరకు తిరుగుతూ పాముదొరికిన దానిని పట్టి కోరలు పీకి నిర్బంధముగా బుట్టనుంచి యాబుట్ట నెల్లరకు చూపుచూ, చూచి యితరు లొసగు ధాన్యముచే తాను జీవించు నుద్దేశ్యముంచుకొని యొక అడవిలో పాము కనులకు కనుపించక యొకచోట కూర్చొని తనయొద్దనున్న బుర్ర నూదుచుండ ఆశబ్దము సర్పముయొక్క చెవులలో జొచ్చి కొంత విచారించి ధైర్య మవలంబించి శ్రవణాసక్తి మిక్కిలిగా నొందుటకు తాను

దాగిన ప్రదేశ మీాడి వెంటనే బయలు కొచ్చి యుండి వినుచుండ నాపాములబట్టువాడు వోడుపుచే దానిని బట్టి వెంటనే కోరలు పీకి బుట్టలో బెట్టుకొని వెళ్ళుచుండ నాసర్పము మిక్కిలి దుఃఖితమై వా పోనర్చు యిడుముల నొందుచు తుదకు జీవం బిడుట యిది దృష్టాంతంబై యుండె. నేత్రాసక్తి గల మిడతలు విస్తారముగా వెలుగు అగ్నిగుండములను చూచి యిది మహామంచిపక్వమైన పండు యని యా పండును కొంచెము కొంచెము నమిలి తినుట యాలస్యం బౌ నని తలచి త్వరలో యెగిరి యా యగ్నిగుండములో దుముక దానిని తినక పోగా యామిడతలు నశించిపోవుట గుర్తుగదా! జిహ్వాసక్తి గల చేపలు మిక్కిలి యద్భుత మగు లోతుగానున్న సముద్రమునయుండి యానందించుచుండక నొకగాలమును బట్టుకొని నాగాలముకు యెర్రను యుపయోగించి యొకవొడ్డున గూర్చొని యొకడు చేపను బట్టునిమిత్తము మనస్సునం దుంచుకొని గాలమును నీళ్ళలో బడవేసియుండ చేపచూచి జిహ్వాసక్తిగలిగి కొంతకాలము విచారించుకొని వెంటనే నాజిహ్వాసక్తిని నాపుకొనలేక నాగాలమందున్న యెర్రను గాల మున్న దను గుర్తు నొదలి గుటుక్కునను మ్రింగ నాయెర్రను తిని యానందము పొందక పోగా యెర్రలోపలయున్న గాలము నాచేప కుతుకకు పడి తన్నుకొనుచుండ గాలముపట్టువాడు విసిరి వొడ్డునవేయ నాచేప గిజగిజ తన్నుకొనుచు యెంత మతిలేనిదానిని, నాప్రదేశములో యున్న పదార్థముల దిని యానందముగా నుండక మరియొక వస్తువకు నాసించిన నాజిహ్వాసక్తి నన్ను ముంచె నని దుఃఖించి మరణించుట చూచుచునే యుంటిమి. యొక్కొక్కాసక్తిగల జంతువులు యిటులై పోవ నేను యెన్నో ఆసక్తులతో నుండ నే నొనర్చుగల కర్త నెట్లగుదు? 'బిడ్డా! జడియకు. సమస్తాసక్తులలోను, సమస్తాసక్తులకు అతీతముగాను నుండి నే నన్నిటిలో నుండునటుల తోచి తోచనీయక చేయువాడనై యుండి నావల్ల సమస్తము జరుగుచుండె. నీవు చేసిన ర్చునది యేదియు లేక పేరుమాత్రము నీకు యుండెగాని నిజము నీవల్ల

జరుగునది యణుమాత్రమైన లేదు. నీయందుండి యెన్నో చిత్రవిచిత్రపనులు చేయించినటుల తోచింపజేయుచుంటిని. గాని నీవు యెప్పటికి లేనివాడవే. నీవు యేమిపనులు జేయలేనివాడవె. సర్వము నావల్ల జరుగుతూ యుండె. యేనానర్చని పనులు నేను యుండని స్థలములు యెచ్చటనైనా లేవు. నే నెప్పుడూ యుండువాడనే, నే నొకప్పుడు లేనివాడను గాను. నీవు యెప్పుడూ లేనివాడవే నే నున్నానను కొనకు. నన్నే నమ్మి లేనివాని వని తెలుసుకొనుము. సర్వము నీవల్ల వ్రాయటముగాని చదువుట గాని చూచుటగాని వినుటగాని తినుటగాని చేయుటగాను నడుచుటగాని యీమొదలగుపనులు యేమిన్నీ జరుగవు. జరుగుదు ననుకొనెదవా? నీవల్ల నేమి జరుగునో దెలుపుము, వినుచుండెద. కాళ్ళు నీవి యని మురయుచుందువా నేను లేనిది నడువజాలవు. చేతులు నీవని దలచెదవా? నేను లేక నీచేతులు యేపని చేయగలవు? కన్నులు నీవనెదవా? నేను లేక యేమి చూడగలవు? చెవులు నీ వనెదవా? నేను లేక యేమి వినగలుగుదువు? తినెద ననుకొంటివా? నేను లేక యేమి తినగలుగుదువు? వాసనల తెలుసుకొన దగుదు నంటివా? నేను లేక యేమివాసనల తెలుసుకొనగలుగుదువు? రుచుల నెరుగుదు ననుకొంటివా? నేను లేక యేరుచుల దెలియగలవు? శీతోష్ణముల నెరుగుదు ననుకొంటివా? నేను లేక శీతోష్ణముల యేమిగాంచగలవు? మలమూత్రముల విడచెద ననుకొంటివా? నేను లేక యేమిమలమూత్రముల విడువగలవు? నీవానందముల పొందుదు వనుకొంటివా? నేను లేక యేమి ఆనందముల పొందగలవు? గావున సర్వము నావల్ల నౌచున్నదిగాని లేశమాత్రము నీవల్ల జరుగటములేదు. సర్వభీతుల సర్వాసక్తుల నొదలి నీ వేమి లే దనుకొనుము. ఇది నమ్మక యుంటివేని నిరర్థుడ వయ్యెద' వనిన యట్లే నేను లేనని నమ్మి వ్రాయబూనితి. దేవా! నాయందు గలుగు లోపములో—ఆలోపములో నా వేమియు గావు. నేను నెన్నడు తప్పొలొప్పు లెరుగని వాడనే. నేను ముమ్మాటికి లేక కోటిసారులకు నేను లేను. నేను జేయునది లేదు. ఇదియే నమ్మకము.

## మహావాక్యములు.

బిడ్డా! ప్రజ్ఞానం బ్రహ్మ యను ఋగ్వేదమహావాక్యము, అహం బ్రహ్మాస్మి యను యజుర్వేదమహావాక్యము, తత్వమసి యను సామవేదమహావాక్యము, అయ మాత్మా బ్రహ్మ యను నథర్వణవేద వాక్యములకు—సోహం యను పదములకు అర్థము.

౧. ప్రజ్ఞానం బ్రహ్మ యనగా ప్రక్ జ్ఞానము బ్రహ్మ యని మూడు పదము లుండె. అందు ప్రక్ యనగా ప్రకృతి యని ప్రకృతి యనగా మాయ యనిన్ని మాయ యనగా యేమి లేనిదిన్ని యీశరీరము యేమీలేని దని యేమిలేని దనగా మూలము యేమీ లేక యున్న దని భావము. మూలములేక యెటుల యున్న దనగా పాచితీగ లాగు ప్రకాశించుచు చూస్తూయుండగా యేమీలేక పోవునది గనుక మూలములేని ప్రకృతి మాయ యనఁనొప్పెను. గనుక మాయయున్నట్టు కనుపించినంతలో లేకపోవును. అనగా అరక్షణకాలములో పోవును. గనుక ప్రకృతి యని పేరుగలిగె. ఈప్రకృతికి లోపల వెలుపల నిండియున్న యేజ్ఞాన మున్నదో యట్టిజ్ఞానము బ్రహ్మం బగును. యీబ్రహ్మము తాను బ్రహ్మను గుర్తు యితరులకు గనుపించకుండా గనుపించని హేతువుచే బొత్తిగా బ్రహ్మ మనునది లేదనకుండా అంతర్బాహ్యములందంతట నిండి నిబిడీకృతంబైన హేతువుచే ప్రజ్ఞానము బ్రహ్మ మన నొప్పెను. యీబ్రహ్మమునకు అవయవములుగాక యే అవయవములు యున్నట్టు తోచబడక యే అవయవములు యున్నవానివలె సమస్తవ్యవహారములు చేయుచుండును. జ్ఞాన మను బ్రహ్మకు కన్నులు లేకయే కన్ను లున్నవానివలె యెరుపు నలుపు తెలుపు పసుపు ఆకుపచ్చ పొడుగు పొట్టి లావు సన్నము పొక్క బక్క లను వానిని జూచి తెలియునది యే జ్ఞాన మున్నదో ఆజ్ఞానము బ్రహ్మ యౌను. ఇటువలెనే దశేంద్రియముల కన్నింటినల్లా సమస్తపనులు జేయుచు జేసినదానిని గ్రహించునట్టి యేజ్ఞానమున్నదో అట్టిజ్ఞానము—ఇదియే బ్రహ్మమౌను. ఇదే నిశ్చయం.

౨. అహం బ్రహ్మాస్మి యను యజుర్వేదమహావాక్యము. ఇందు అహం బ్రహ్మ అస్మి యని మూడుపదములు గలవు. అహం యనగా నేను నాది యని పలుకు వాక్యమై యున్నది. ఆవాక్యము యే యే సందర్భములకైన వాడుచుందురు. అవి యేవి యనినా నాయిల్లు, నాదోటు, నాభూమి, నాపొలము, నాతల్లి, నాతండ్రి, నా తాత, నాభార్య, నాకొడుకులు, నాకూతుండ్లు, నాద్రవ్యము, నా సొమ్ము, నాయవ్వ, నాయన్న; నాయక్క, నాచెల్లెలు, నాఅత్త, నా మామ, నామనవులు, నామనమరాండ్లు, నాముత్తవ్వ; నాశరీరము, నాప్రాణము, నాధాన్యము యని యనేకవిధముల వర్ణించు యేజ్ఞాన మున్నదో అదియే అహం బన నొప్పు. ఆయహం బనునదియే బ్రహ్మ. అట్టి బ్రహ్మవల్లనే సమస్తము జరుగుచుండె. ఆబ్రహ్మ చెవులు లేకయే సమస్తశబ్దముల వినుచుండును. చెవులు బ్రహ్మ స్వరూపము గావు. కండ్లు లేకయే యెరుపు నలుపు తెలుపు పసుపు నీలము లావు సన్నము పొడుగు పొట్టి వొక్క బక్క లని యీ విధము లగు రూపముల యీబ్రహ్మము చూచుచుండు. ఇట్టి తెలుసుకొను యేజ్ఞాన మను బ్రహ్మ ముక్కులులేకయే సుగంధ దుర్గంధములను మిశ్రగంధములను తెలుసుకొనుచుండును. చర్మము బ్రహ్మకు లేకయే చర్మ మున్నవానివలె వుడుకు చల్లన సమశీతోష్ణముల తెలుసుకొను చుండును. యీబ్రహ్మకు నాలుకలేకయే వుప్పు కారము తీపి చేదు వగరు పులుసు యని ఆ రుచుల నెరుగుచుండును. యట్టి బ్రహ్మకు పాదములు లేకయే చాచుట ముడుచుట లేచుట నడుచుట యురుకుట మొదలగు పనులు చేయుచుండును. వాక్కు లేకయే యీబ్రహ్మము సుభాష దుర్భాష మిశ్రభాషలను యనగా బాడుట చెప్పుట మొద లగు మాటలను మాట్లాడుచుండును. యీబ్రహ్మకు చేతులులేకయే చేతులు యున్నవానివలె యిచ్చుట తీసుకొనుట యీ మొదలగు పనులు చేయుచుండును. బ్రహ్మకు గుదములేకయే మలవిసర్జన జేయు వానివలె మలవిసర్జనజేయుచుండును. యీబ్రహ్మకు యుపస్థలేకయే

యుపస్థయున్న వానివతు మూత్రవిసర్జన యానందభోగముల సౌఖ్యమును పొందును. యీసమస్తపనులు చేయు అహం బనునది యెవ్వరో? ఆ యహం బనునదియే బ్రహ్మము. యట్టి బ్రహ్మస్వరూపమును యస్మి—అహోరాత్రులు యెరుకమరుపులు లేక అస్మి అయితిని అనగా సమస్తజ్ఞానానందములతో నున్న నేను బ్రహ్మమైతి నని భావము.

3. తత్వమసి యను సామవేదవాక్యము. తత్వమసి యిచ్చ్యభేదవాచకము. 'యే జపన్తే శివసాయుజ్యము క్తిః భాజః భవన్తిః' అని ప్రమాణము. గురువునందు క్రియాద్వైతము, ప్రపంచమందు ద్రవ్యాద్వైతము, ఆత్మయందు భావాద్వైతము గలిగినదే యభేదవాచకము ఇదే యెల్లప్పుడు ధ్యాస గలిగియుండవలెను.

తత్ త్వం అసి - తత్ అనగా నిరాకారస్వరూపము. త్వం అనగా హంసస్వరూపము అసి అనగా నిరాకారమందు తిరిగి గలియుటము. జీవు డనగా ప్రపంచము సత్యమనే భ్రమ. ఈశ్వరు డనగా నీసర్వప్రపంచమును ననాత్మ యని యేకత్వసిద్ధిగలిగినదే యీశ్వరత్వము. కాబట్టి సర్వప్రపంచము నిరాకారమే. నే నన్నజ్ఞానము గలిగితే అభేదజ్ఞాన మనియును, భేదమే యజ్ఞానమనియును సమస్తశాస్త్రములయందు చెప్పబడ్డది. కాబట్టి జీవేశ్వరులకు నైక్యమయ్యే పరిణమించును.

తత్ త్వం అసి—తత్ అనగా అజ్ఞాన మను బ్రహ్మము. నకటి యని యదే గుర్తు. గుర్తన అదే యని, త్వం అనగా నీవు, అదే యని బల్కుబ్రహ్మ మున్నదో యది నీవు. అసి యాబ్రహ్మస్వరూపము మైతి వని భావము. గాన నీవు యెప్పుడు అబ్రహ్మస్వరూపంబె యని తెలియు మని భావము.

4. అయమాత్మా బ్రహ్మ యను అథర్వణవేదవాక్యము. అయం ఆత్మా బ్రహ్మ అను మూడుపదములు గలవు. అందు అయం అను

పదం నిత్యమై స్వప్రకాశమై యపరోక్షమై యుండునది యీయాత్మ యని తెలియును. అహంకారము మొదలు స్థూలదేహపర్యంతమును నా యహంకారము నాదేహ మని యెరిగెడి చైతన్యమే ప్రత్యగాత్మ స్వరూపము. ఇందుకు అర్థము చూడగా సర్వము బ్రహ్మ మని చెప్పబడిన లక్ష్యార్థము. సర్వము బ్రహ్మమైనప్పుడు జగదధిష్ఠానమైన ఆత్మ—ఆయాత్మస్వరూపమే తాను.

అయం అను శబ్దమును జూడ యొకపిండమందే తాత్పర్యము గనుక నండపిండబ్రహ్మాండములకు భేదము లేక యభేదనిష్కర్షగా నీవాక్యము పలుకును. అండాండ మనగా గుడ్డు. పిండాండ మనగా సమస్తదేహములయందు కారణమైన హంసస్వరూపము. బ్రహ్మాండ మనగా పదునాలుగులోకములు తనకుక్షియందు యిముడ్చుకొని తాను నిలక్షణుడై సర్వసాక్షియై యున్న పరమాత్మ. వీటికి యేకత్వసిద్ధి యేలా గనిన బ్రహ్మాండమువలన పిండాండము, పిండాండమువలన యండాండము, అండాండమువలన బ్రహ్మాండము, బ్రహ్మాండమువలన ననంతకోటిబ్రహ్మాండములు, అనంతకోటిబ్రహ్మాండములవలన నండాండము, అండాండమువలన సమస్తజగదుద్భవము, సమస్తజగత్తు నండము లోను, అండము పిండములోను, పిండము బ్రహ్మాండములోను నైక్య మగుచున్నది. ఈనాలుగు మహావాక్యముల యర్థానుభవముగలిగిన వారే జీవన్ముక్తులు. ఇందుకు సందియము లేదు.

ఈనాలుగుమహావాక్యములయందు నీవే బ్రహ్మము, బ్రహ్మమే నీవు అని ప్రతిపాదించుచున్నది గనుక నీవే సచ్చిదానందస్వరూపమై అద్వితీయమైన ఆత్మస్వరూపుడవు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రచం డాలవర్ణములు నీకు లేవు. బ్రహ్మచర్యాది ఆశ్రమములును వాని ధర్మములును నీకు లేవు. నీవు అసంగుడవు. కాలయత్రియములయం దును నీవు జీవుడవుగావుగనుక నీకు ఆగామిసంచితప్రారబ్ధకర్మములు లేవు. అఖండైకరసమై సుఖస్వరూపమైన ఆత్మవు నీవు. ఈప్రకారము

అనుభవమును సద్గురుమూర్తివలన తెలుసుకొని బ్రహ్మానందవారా శిలో మునిగియుండి లేకపోవుటే మైక్య మనబడును.

౧. ప్రజ్ఞానం జీవుడు, బ్రహ్మ యీశ్వరుడు. జీవుడే యీశ్వరుడు, యీశ్వరుడే జీవుడు. ప్రజ్ఞానం నేను, బ్రహ్మ నీవు. నేనే నీవు, నీవే నేను.

౨. అహం జీవుడు, బ్రహ్మ యీశ్వరుడు, అస్మి అయెను. జీవుడే యీశ్వరు డాయెను, యీశ్వరుడే జీవు డాయెను. అహం నేను, బ్రహ్మ నీవు, అస్మి యైతిమి. నేనే నీవైతివి, నీవే నేనైతిని.

3. తత్ యీశ్వరుడు, త్వం జీవుడు, అసి యైరాయెను. యీశ్వరుడే జీవు డాయెను. తత్ నీవు, త్వం నేను, అసి యైతిమి. నీవే నేనైతిని, నేనే నీవైతివి.

౪. అయమాత్మా జీవుడు, బ్రహ్మ యీశ్వరుడు. యీశ్వరుడే జీవుడు. అయమాత్మా నేను, బ్రహ్మ నీవు. నేనే నీవు, నీవే నేను.

సోహం - అనగా ఇందు గురుసాక్షి. సద్గురుమూర్తి శిష్యునకు మహావాక్యార్థముల అర్థమును బోధించి శిష్యునకు సరిగా బోధపడి నదో లేదో యని సంపూర్ణకరుణాకటాక్షవీక్షణ ఆధాత్రునియం దిమిడ్చి బిడ్డా! యింకొకసూత్రము నిచ్చెద. సావధానచిత్తుడవై విని బ్రహ్మానంద మొందు మని బోధించ, శిష్యుడు నిశ్చేష్టుడై నిశ్చలుండై యుండ నా సద్గురుమూర్తి యిట్లు లనియె. ఓ గురుశిష్యశిరోభూషణా! బ్రహ్మం బన నెట్టివాడో బ్రహ్మ యన నేమి చేయునో తెలిపెద. యెట్టివాడో వా డెవ్వరో యనిన అనేవాడు వినేవాడు చూచేవాడు చేసేవాడు పొయ్యేవాడు నవ్వేవాడు తినేవాడు పండేవాడు ఖేదమోదముల జెందేవాడు సుఖదుఃఖముల పొందేవాడు - యిట్టివా డెవడో వాడే బ్రహ్మము యని యూరకుండె. అంతట యాశిష్యుడు యా బ్రహ్మమును అంది పొందియుండె సద్గురుమూర్తి దయామయులై సో యనెను. సో యనగా యాబ్రహ్మము నీవ రని సాక్షిగా యడి

గెను. అంతట నాశిష్యతిలకుం డమితానందంబున హాం యనెను. హాం యనగా సద్గురుస్వామివా రానందాత్మోత్కర్షాదచే రాజ్ఞానుకూలుతై యడిగిన యేసాజ్ఞయున్నదో సద్దానిని నేను అని బల్కెను. అనగా హాం అనే పదార్థము నేనే యని తెలుపబడుచున్నది. యీ ప్రకారం గురుశిష్య లన్యోన్యమై త్రైక్యము నందిరి. ఇదియే శివజీవైక్యము.

గాయత్రీమంత్రము.

ఓంభూర్భువస్సువః ఓంతత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధీయో యోనః ప్రచోదయాత్.

ఇందుకు అర్థము.

భూః అనే పదమునకు పృథివి వుదకము అగ్ని యీ మూడు కలసి ఋగ్వేదం బ్రహ్మ అకారం. భువః అనే పదమునకు వాయువు ఆకాశము యీ రెండు కలసి యజుర్వేదము విష్ణువు ఉకారం. సువః అనే పదమునకు జ్ఞానాజ్ఞానములు కలసి సామవేదము మహేశ్వరుడు మకారం. యీ అకారఉకారమకారములు గలసి అయ మాత్మ ఓంకారం - యీ ఓంకారమే తత్పదము. తత్సవితుర్వరేణ్యం అంటె సూర్యునికంటె శ్రేష్ఠము. భర్గో యనగా శివస్వరూపం. దేవస్య అనగా కారణము. ధీః అనగా బుద్ధి. మహీ యనగా బుద్ధివల్లనుంచే జగత్తు. యీ బుద్ధినుంచే నేనే తిరిగి ఆతత్పదమందు అర్పిస్తూ యున్నాము. (సారాంశము) పిపీలికాది బ్రహ్మపర్యంతం సమస్త జీవరాసులు ముప్పదిమూడుకోట్లదేవతలు అరవైయారుకోట్ల రాక్షసులు సముద్రములు పర్వతములు తరువులు మొదలగు విశిష్టవాస్తువులు త్రిమూర్తులు యావన్మంది ఓం అనే ప్రణవమందే యుత్పత్తి యని తెలియుము. యిందుకు గుర్తు పృథివ్యాపస్తేజో వాయు రాకాశాత్ ఓం నమోభగవతే వాసుదేవాయ యనే ప్రమాణము. ఓం అనేకప్రణవము. దేవుడైన ప్రణవముయొక్క యాధార మేమో యని తెలుసుకొనదగిన అంతరార్థము సద్గురుమూర్తివల్ల తెలియ

దగును. రహస్యముగాన యిందు వ్రాయలేదు. నిశ్చయం. నిశ్చయం. నిశ్చయం.

శ్రీ గురుభ్యో నమః.

పంచాక్షరీమంత్రముయొక్క జపప్రకరణము.

అస్య శ్రీశివపంచాక్షరీ మహామంత్రస్య పరబ్రహ్మఋషిః అనుష్టుప్ఛందః శ్రీసాంబసదాశివదేవతా ఓం బీజం నమః శక్తిః శివాయేతి కీలకం శ్రీసాంబసదాశివ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః.

కరన్యాసః.

ఓం శ్రీసాంబసదాశివాయ అంగుష్ఠాభ్యాం నమః ఓం నం గంగాధరాయ తర్జనీభ్యాం నమః ఓం మం మృత్యుంజయాయ మధ్యమాభ్యాం నమః ఓం శిం శూలపాణయే అనామికాభ్యాం నమః ఓం వాం పినాకి పాణయే కనిష్ఠికాభ్యాం నమః ఓం యం ఉమాపతయే కరతలకరపృష్ఠాభ్యాం నమః.

అంగన్యాసః.

ఓం శ్రీసాంబసదాశివాయ హృదయాయై నమః ఓం నం గంగాధరాయ శిరసే స్వాహా ఓం మం మృత్యుంజయాయ శిఖాయై వషట్ ఓం శిం శూలపాణయే కవచాయ హుం ఓం వాం పినాకి పాణయే నేత్రత్రయాయ వౌషట్ ఓం యం ఉమాపతయే అస్త్రాయ ఫట్ భూర్భువస్సువ రోమితి దిగ్బంధః.

ధ్యానం.

శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షభాగేత్రిశూలం
నాగం పాశంచ ఘంటాం ప్రళయహృతవహం సాంకుశం వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి.

పంచపూజా.

లం పృథివితత్వాత్మనే శ్రీసాంబసదాశివాయ గంధం సమర్పయామి హం ఆకాశతత్వాత్మనే శ్రీసాంబసదాశివాయ పుష్పం సమర్పయామి. యం వాయుతత్వాత్మనే శ్రీసాంబసదాశివాయ ధూపం సమర్పయామి. రం తేజోతత్వాత్మనే శ్రీసాంబసదాశివాయ దీపం సమర్పయామి. వం ఉదకతత్వాత్మనే శ్రీసాంబసదాశివాయ అమృత నైవేద్యం సమర్పయామి. సం సర్వాత్మనే శ్రీసాంబసదాశివాయ సర్వోపచారాన్ సమర్పయామి.

శ్లో॥ గురుబ్రహ్మ గురు ర్విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురుసాక్షా త్పరబ్రహ్మం తస్మై శ్రీగురువే నమః
శ్రీజానకాంబాసమేత శ్రీమన్మాధవరాజు వేంకటేశ్వరప్రభునిజగురు
పరబ్రహ్మణే నమః.

అథ మనుః.

ఓం నమ శ్శివాయ. — జపము ౧౦౮ సార్లు.

శ్లో॥ అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారణం
జ్ఞానవైరాగ్య సిధ్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్.

మూడుసార్లు జలమును పుచ్చుకునేది.

సర్వం శ్రీసద్గురుచరణారవిందార్పణ మస్తు.

నాలుగువేదములయందు నీవే బ్రహ్మవు బ్రహ్మ నీవె యనుచు బల్కుచుండే వుపనిషద్వాక్యములను మిగుల పరిశీలించి చూడగా నీవే బ్రహ్మవు బ్రహ్మ నీవె యని దెలియుచుండె. యోగాభ్యాసములలో అనేకవిధముల కష్టపడి ఆకష్టపడిన దానిలో యున్న యుక్తి యేమి యని విచారించి జూడగా దానిలో నీవే బ్రహ్మవు నీవే బ్రహ్మవు యని తెలుపబడుచుండె. యెన్నియో మంత్రముల జదివి జపించి

చూడగా యీమంత్రిములలో యున్న మర్మము నీవే బ్రిహ్మవు బ్రి హ్మమే నీవని నిశ్చయార్థం బయలుపడుచుండె. వేదవేదాంతసిద్ధిపొం దిన మహావేత్త లందరు నీవే బ్రిహ్మవు బ్రిహ్మమే నీ వని బలుకు చుందురు గాన తగినజాగ్రితతో మహావాక్యముల శ్రీసద్గురుమూర్తి దయచే గ్రిహించి యం దర్థము బోధరూపకముగాను పొంది అనుభ వముకు తెచ్చుకొని కించిజ్ఞత్వాదిగుణములతో జీవు డని పేరొందిన భ్రిమ నొదలి జీవుని బ్రిహ్మమం దైక్యముచేయుట మిగులకష్టము. కష్టముచేసి గ్రిహించిన యతిసులభము. ఇదే జీవబ్రిహ్మైక్యము. ఈ ప్రిపంచములో పంచభూతంబులచే జననమా మనుష్యులు మొదలగు సమస్తవారలకు బ్రాహ్మణులని, రాజులని, కోమట్లుయని, శూద్రులని, చండాలులని యిత్యాదికులవర్ణభేదములు లేవు. నాలుగుఆశ్రమములు. అవి యేమి యనిన బ్రిహ్మచర్యము గృహస్థాశ్రిమము వానప్రిస్థా శ్రిమము యత్యాశ్రిమము యీమొదలగు ఆశ్రిమములు య్యాయా యాశ్రిమధర్మలు నీకు లేవు. స్వజాతి యని పరజాతి యని యిత్యాది స్వగతభేదములు నీకు లేవు. కులము గోత్రిము నామము రూపములు మొదలగునవి నీకు లేవు. మోదఖేదములు పాపపుణ్యములు సుఖదుఃఖ ములు జననమరణములు హెచ్చుతగ్గులు యీవిధము లగు ద్వంద్వంబు లెన్నడు నీకు లేవు. ఇదే నిశ్చయ మని శ్రీసద్గురు వగు వేంకటేశ్వర ప్రిభు హనుమద్దాసా రారా యని సంపూర్ణకరుణారసామృత హృద యులై బోధించిరి. ఇదే వారికి యెల్లప్పుడు నాద్వాదశవిధవందనములు.

## అంటియంటని పద్ధతి.

బిడ్డా ! యింకొకచిన్నపద్ధతి దెలిపెద విని మనస్సం దుంచు కొను మని దెలుపసాగిరి. నాయనా ! తామరాకుపైన పడిన వర్ష జలములు ఆతామరాకుపై బడియున్నట్లు యెల్లరకు కనుపించుచుండే గాని యానీరు యెన్నడు తామరాకుకు అంటదు. యిదిన్నిగా కుమ్మరిపురుగు యెల్లప్పుడు అతిహేయమైన బురదలో తిరిగి మురికి

యుండుట చూచుచునే యుంటిమి. గాని చూచువారలకు యేహ్యా ణముగా దోచుచుండు. వీరి యేహ్యాముతో యాపురుగుకు నిమిత్తము లేదు. యాపురుగుకు యెప్పుడైన యాబురద అణుమాత్రమైన యంటక యుండు. యెంతోకష్టపడి విస్తారము భ్రాంతితో నెయ్యిని తాగినను తననాలుకకు యెంతమాత్రము యానెయ్యి జిడ్డు యేమీ యంటకుండు. చింతపండుపైన యున్న బెరడు లేక బొబ్బర యాచింత పండుకు యెప్పుడైన యేవిధముగానైన యణుమాత్రము చింతపం డుకు బెరడు యంటుట చూచియుంటి మనినవా రెవ్వరు లేరు. యింకా వినుము చల్లలో వెన్నపూసముద్ద గలియదుగదా! సూర్యు నకు చీకటి యంటదుగదా! అగ్నిహోత్రునకు చదలు అంటదుగదా! ఆకాశముకు గాలియంటదుగదా! కత్తిపై యున్నవార కత్తికి యేమి యంటదుగదా! విత్తుచే యనేకరూపంబు లౌనుగాని యారూపులు విత్తుకు యంటిగాని, విత్తురూపు, విత్తుచేయైన రూపులు విత్తుగాని యీ విధముగా యెన్నడైన అంటియుండవుగదా! తత్ప్రకారమే యీ ప్రపంచములో మమత లని గనుపించు యెల్లపనులు మహనీయులు చేయుచు యెల్లరకు వారివతు వారలే యని గమనించులాగు చేయుచు యీ మాయాప్రపంచమాయలో భ్రాంతిని యిమిడ్చియుండక యుండి నట్లు యుండి సర్వపనులు జేయుచు దేనికి యంటక యుందురు. బిడ్డా! యీవిధముగా మెలగు మని ఆజ్ఞయిచ్చిరి.

జూప తెలియుచుండె. యీమూలములేని గురుతెరిగే శరీరము మూలములేకనే వచ్చి మూలములేని పారిసాంగత్యముచేయుచు మూలము లేనిదానిని పెండ్లియాడి మూలములేనికూతుండ్లు, కొడుకులను గని మూలములేక పోవుచుండె. యింతేగాని యెన్నడైన యీశరీరముకు మూలమే లేదు. మూలములేక యీశరీర మెటుల వచ్చియుండెనె దనిన. నీటిపై బుగ్గరీతి, మెరుగుడు పువ్వురీతి, మేడలు కేకలు వేసినవనిననతు, కత్తులు నరికిన వను మాదిరి, ఛత్రిచామరములు పరుగులిడినవనిన యట్లు, మంచెలు యరచిన వని చెప్పురీతి, యిల్లు వ్రాగిన దనుమాదిరి, యెద్దు యీనినదనుకీవి, గుడ్డితనము పుట్టుకలోనే గల్గువాడు పంచరంగులు యింకా యెన్నోచిత్రవిచిత్రములు గాంచె నను మాదిరి, జన్మరావటముతోనే కాళ్లుచేతులులేని కరపాదమొండి ఘంటకు యాభైమైళ్లదూరము రైలుమోటరు సైకలు బండీ యీమొదలగు వనికరములు యేవియు లేకయే త్వరలో వెళ్లె నని బల్కురీతి, చిన్నతనములోనే చెముడుచేయున్నవారలవద్ద భేరీనగారతప్పెటమృదంగవాయిద్యములు యెంతో గ్రామము ఘోషజెందురీతి కొట్టినా వినరానివాడు ఫర్లాంగుదూరములో యిద్దరు రహస్యపుమాటలు మాట్లాడుచుండ యీచెవిటివాడు విని యితరులకు చెప్పి పోట్లాట తెచ్చినాడనువతు, అద్దమందు తనరూపము అంటుకున్న దనురీతి, జిహ్వకు నేతిజిడ్డుపట్టిన దను మాదిరి, జన్మ వచ్చిన లగాయతు మాటలేరాని మూగివాడు అమృతతుల్య మగు పలుకులు పలుకుచు యుండ విన్నా మనురీతి, గొడ్డురాలు కొమారుడు మహాపరాక్రమశాలి, విస్తారమైనదానము చేయువాడు, మంచిసౌందర్యశరీరము గలవాడు, యితనిభార్య మిగుల గుణరూపవతి, యీయన సంతానము మహాశాంతశమముగల దనురీతి, స్థాణుపురుషుడు అను దొంగ యెంతోమందిని కొట్టి చంపి సొమ్ము తీసుకొనెను యని బల్కుమాదిరి, యెండమావులలో నీరు దప్పికైయై త్రాగుచుండ కుందేటికొమ్ము పగిలిన తునక గొంతుకు యడ్డుపడి చచ్చెననురీతి, యిసుకతైలము తలనొప్పికి రాచి రుద్దిన శ్రేష్ఠ మను

రీతి, రాతినార త్రాడుచే గొంతుకు యురిబెట్టుకొని చచ్చెననురీతి, ఖల్లపు చెరుకుల జొన్నలు తినుటకు యెంతో శ్రేష్ఠమైన వనినవతు, కోడిపాలు తెచ్చి యౌషధము చేయించుకొని భుజించ నారోగములు యావత్తు పోయె నని చెప్పినరీతి, రజ్జు వను సర్పము కాటువేయ విష మెక్కి చచ్చిపోయినాడు యని చెప్పినమాదిరి, శుక్తికయందు మంచి నాణ్యమైన వెండి యున్న దనురీతి, నపుంసకునిసంతానము విస్తార మను వతు, ఆకాశపుష్పముల తెచ్చి భగవంతుని పూజించి ధ్యానించితి నను మాదిరి, మేడిపుష్పములసువాసనతో సమాన మగు యేపుష్ప ములవాసన సరిరా వనువతు, మేకలగళమున యున్న చన్నులపాలు తీసి అనగా పితికి కాచి త్రాగిన విస్తార మగు రుచి యని చెప్పినరీతి, యక్షరాజధానిలో మహాసత్యమైన యుపన్యాసములు చేయుట వింటి ననువతు, నాకు విస్తారమైన బుద్ధయుండ దానిబలముచే యీతరా కున్నను ప్రళయవెల్లువలుచే ప్రవహించుచున్న మూడుయేరుల యెకా యకీ యీది వస్తినని చెప్పినమాదిరి, యిప్పటికి షుమారు మాసము రోజులనుంచి నాభార్యాపిల్లలు వకపూట భోజనముచే రోజులు తీయుచు నేను మిగుల సంతాపాగ్నిచే మగ్గి ప్రాణములు పోయిన బాగుగదా యని చింతించుతూ నాస్నేహితులమిత్రుల వకపావలా యివ్వమని యడిగినా యివ్వని హేతువుచే నాలుగురోజులనుంచి నా యింటివారలందరు పచ్చిగంగయైన త్రాగక యున్నా మనువాడు అట్టి స్థితిలోనే నూర్గురకు పంచభక్ష్యములతో పెట్టి వీరలందరకు సంభావన మనిషికి రూపాయివంతున యిచ్చి పంపితి నని చెప్పినరీతి, నిద్రబోవు వాడు కలవరింతలుచేయగా యితరులు విని వానిని లేప మేల్కొచ్చి లేచి కూర్చొని యెందుకు కలవరిస్తివన నేను కలవరించలే దను మాదిరి యీ వృత్తబట్టబయలునందు యెరుకపుట్ట నేరదు. పుట్టనే లేదు. పుట్టినట్టు తోచబడుటమే గాని విచారించిన యీమూలములేని గురు తెరిగేశరీరము యేమీ లేదు. యీమూలములేని గురుతెరిగే శరీరము యేమో యున్నదని యున్నదానివలె యెన్నియో పేరులుబెట్టుకొని

యెన్నియో నీమములు పెట్టుకొని యెన్ని భేదములుంచుకొని పాప పుణ్యములు లేనిదానికి పాపపుణ్యము లున్నవని దలచుచు జనన మరణములు లేనిదానికి జననమరణము లున్నవని యెంచుచు భేద మోదములు లేనిదానికి భేదమోదములు యుండినరీతి దెల్పుచు నీమనిష్ఠలు లేనిదానికి నీమనిష్ఠలు యున్నవని బల్కుచు సర్వభేద ములు వావివరసలు లేనిదానికి వావివరసలు పెట్టి పిలచుచు మానావ మాననిందాపనిందెలు లేనిదానికి మానావమాననిందాపనిందెలు వొచ్చిన వని నగచుచు యెన్నియో చిత్రములు యెన్నియోపనులు యీ మూలములేని గురుతెరిగే శరీరము జేయుచు మూలములేని ముచ్చటలు జెప్పుచు మూలములేని భ్రాంతుల నొందుచు మూలములేని గుర్తులు దెల్పుచు చూపుచు యీమూలములేని శరీరము చూచు చుండగా యేమియులేకపోవును. యిట్టి మూలములేని శరీరము మరుగు శ్రీసద్గురుమూర్తివల్ల దెల్సుకొని మూలములేని శరీరము యేమియులేదు యని నిశ్చయించుకొని భ్రాంతిరహితులై చెల్లువ్రాసిన నోటురీతి యుండి మూలములేని దానితో యీ మూలములేని శరీరమును యైక్యపరచి యహోరాత్రులు ద్వాదశిస్వరూపు డగు శ్రీసద్గురుమూర్తి యే యని దలచుచు ద్వాదశి షోడశిని పంచదశిని అనుభవార్థము తెచ్చుకొని ఆనందాతీత మగు యేవాస్తువయున్నదో దానియందు లీనంబై లేనిదానిని లేనని నమ్ముకొని యున్నదానిని శ్రీసద్గురు మూర్తి కనుసొజ్ఞ నంది లేనిచచ్చినవారి మాదిరి మెలగుటకు యీక్రింది మంత్రముల మరుగుదెలసి ధ్యానించి ధ్యానించినా ననే స్పృహ మరచియుండిన యీమూలములేని గురుతెరిగే శరీరము యేమియులేక పోవును గాక! తల్లిదండ్రులపై అన్నదమ్ములపై భార్యాపిల్లలపై భ్రాంతియుంచుకొని యీమూలములేని శరీరముపై భ్రాంతి పోకయే విస్తరించుచు జననమరణములదారికి తీసుకవచ్చును. గనుక యీ మూలములేని గురుతెరిగే శరీరము యాశనొదలినవారలే సద్గురుమూర్తికి తనుధనము మనములు అర్పణచేసి యేమి లేనివారలై యున్నటుల

యెల్లరకు గనుపించుచు కొరతకాలము తీసుకొనిపోయి రానివార లగు దురని దెల్పుచుందురు గనుక యీ వృత్తబట్టబయలు పరిపూర్ణపర బ్రహ్మమునందు యెరుకపుట్టనే లేదు. పదికోట్ల మారులకు యిదే నిశ్చయము. యీ మూలములేని శరీరమును నమ్మవద్దు. యీ మూలములేని యోగురు తెరిగే శరీరముపై భ్రాంతియుంచకు. యుంచిన చెడుట నిశ్చయం, నిశ్చయం, నిశ్చయం.

శ్రీగురుభ్యో నమః.

# అ చ ల ము.

అస్య శ్రీద్వాదశాక్షరీమహామంత్రస్య అచలఋషిః, అవినాశ శ్ఛందః, అభవో దేవతా, అమృతబీజం, అప్రమేయశక్తిః, అఖిల కాలేషు పరిపూర్ణ మస్తి మాయాసహిత ఏతత్ప్రపంచాదికం నాస్తీతి నిశ్చయసిద్ధ్యర్థే జపే వినియోగః.

అయ మఖండాయ అంగుష్ఠాభ్యాం నమః, వ్యర్థ మభవాయ తర్జనీభ్యాం నమః, బాహ్యాప్రమేయాయ మధ్యమాభ్యాం నమః, కోపి నభవతీ త్యసంగాయ అనామికాభ్యాం నమః, అయ మవాత్మా య కనిష్ఠికాభ్యాం నమః, వ్యర్థ మచింత్యాయ కరతలకరపృష్ఠాభ్యాం నమః, బాహ్యాప్రతర్క్యాయ శిరసేస్వాహా, కోపీ నభవతీ త్యశరీరాయ ముఖేస్వాహా, అయ మభోక్త్యాయ హృదయేస్వాహా, వ్యర్థ మబాహ్యా య శిఖాయై స్వాహా, బాహ్యాచ్యుతాయ పాదద్వయే స్వాహా, కోపీ నభవతీ త్యప్రకాశాయ హృదయాయై నమః, అయ మగోచరాయ శిరసే స్వాహా, వ్యర్థ మసమానాయ శిఖాయై వషట్, బాహ్యాప్రమే యాయ కవచాయ హుం, బహిర్వ్యాప్తాయ నేత్రత్రయాయ వౌ షట్, అయం వ్యర్థబాహ్యాకోపీ న భవతీ త్యక్షయాయ హస్త్రాయ ఫట్, అహం పదార్థరహితం భూర్భువస్సువరో మితి దిగ్బంధః.

ధ్యా న ం.

శ్లో॥ అచల మబాధ్యం సర్వలోకేషు పూర్ణం, సర్వాతీతం స్వాను భూత్యాదిగమ్యం। సర్వాబాధ్యం సర్వక ర్తృత్వశూన్యం, సర్వా వేద్యం సర్వశూన్యంచ బాహ్యం.

శ్లో॥ అవాత్యం హ్యఖండం హ్యలక్ష్యం హ్యబాధ్యం, హ్యబోధ్యం హ్యసంగం హ్యవేద్యం హ్యచింత్యం, హ్యరూపం హ్యసాధ్యం హ్యనాద్యం హ్యతీతం, హ్యనంతం హ్యశుద్ధం హ్యనామం నమామి.

శ్లో॥ మృత్యుజన్మభయదుఃఖవ ర్జితం, సర్వదృశ్య దురిత దుష్టనాశనం అప్రతీర్వ మమలం నిరామయం, అనుపమానం శివం నమా మ్యహం.

శ్లో॥ నిత్యపూర్ణాయ నిష్కామ నిశ్చలాయ నిరీశ్వరాయ నిరాకాశాయ నిత్యాయ, మద్రిహితాయ నమోనమః

మ ం త్రి ము.

అయం వ్యర్థబాహ్యాః కోపీ న భవతి - పదవిభాగము.

అర్థము — యీవృత్తబట్టబయలు యేమీా లేదు——౧౨ యిదే ద్వాదశాక్షరి.

౧. ద్వాదశాక్షరివివరము.

అయం వ్యర్థబాహ్యాః కోపీ న భవతి.

పదవిభాగము — అయః వ్యర్థః బాహ్యాః కం అపి న భవతి.

అర్థం — అయం - యీా, వ్యర్థః - వట్టిదైన, బాహ్య - బట్ట బయలు, కోపీ - యేమిన్ని, న భవతి - లేదు. అయ మాత్మేతి శ్రుతి వలన అయ మనగా బ్రహ్మస్వరూపము, వ్యర్థః అనగా విశేషః అర్థః వ్యర్థః యితి వ్యుత్పత్త్యా చతుర్విధపురుషార్థములలోను అతిశయమైన అర్థః మోక్షము, మోక్షము యనగా ప్రకృతి పురుషాతీతమైన బ్రహ్మ స్వరూపము - శరీరత్రయనాశనమే మోక్షము, బాహ్యాః బహి ర్భవః

బాహ్యః యీయుత్పత్తిచేతను బహిః బయలు భవహ అయినది బయలు అయినది యనగా ఆవరణశక్తిరహితమైనదియు, సాక్షాత్కార మయ్యేదియు యని అర్థము.

తాత్పర్యము.—యీబ్రహ్మస్వరూపము బాహ్యాభ్యంతరముల యందు పూర్ణం పురుషేణ సర్వ మితి శృతివలన పరిపూర్ణమై వెలు పల లోపల చరాచరములయందు నిండి సందులేక సర్వవ్యాపకమై యున్నప్పటికి కనపర్చుకొనలేని యవివేకులకు కనపడదుగనుక వివేకు లైన యోగులకు సర్వదా యెల్లప్పుడు అపరోక్షరూప మని తాత్ప ర్యము. కిం అనగా యీకీము శబ్దమునకు అనిర్వాచ్యు డని అర్థము. అనిర్వాచ్యు డనగా శ్లో॥ యతో వాచో నివర్తంతే సంప్రాప్య మనసా సహ, ఆనందో బ్రహ్మణో విద్వాన్, నబచేతి కదాచన - అనే శ్రుతి వలన యీబ్రహ్మస్వరూపము మనోవాగగోచరు డని తాత్పర్యము. కోపీ న - భవతి కోపీ యేమిన్ని న భవతి - కాలేదు; యేమిన్ని కాదు. అనగా కీము శబ్దమునకు వాక్యార్థమురీతిచే నంతా యాచున్న దని అర్థము. శృతి-సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ - యీస్మృతివలన బ్రహ్మ నెరిగిన యోగి బ్రహ్మంతరహితమైన సర్వకామసర్వానంద ముల నన్నిట ననుభవించుచున్నా డని తాత్పర్యము. సచ్చిదానంద స్వరూపు డగమ్యుడవైన నీయందు కోపీ - యేమిన్ని, నా లేదు. అనగా నిర్మలుడైన యీబ్రహ్మస్వరూపమందు గగనారవిందములవలె మిథ్యాభూతములైన యీప్రపంచ మేమీ లే దని తాత్పర్యము.

షోడశాక్షరీమంత్రము - శరీరేంద్రియజ్ఞాననిరసనవిధి.

అస్య శ్రీనిరుపమాన షోడశాక్షరీ మహామంత్రస్య నిరంజన ఋషిః, నిరహంకారశ్ఛందః, నిరామయ నిరాకాశో దేవతా, నిరా వరణబీజం, అప్రమేయశక్తిః, నిర్గుణప్రజ్ఞానరహితకీలకం, నిఖిలకా లేషు మాయాసహిత షడ్భావరహిత నిశ్చయసిద్ధ్యర్థం జపే విని యోగః.

## అంగన్యాసః.

మూలం నిర్ద్వంద్వాయ అంగుష్ఠాభ్యాం నమః, అభావం నిశ్చయాయ తర్జనీభ్యాం నమః, యిదం నిరవయవాయ మధ్యమాభ్యాం నమః, జ్ఞాతుం నిర్మలాయ అనామికాభ్యాం నమః, సశరీరం నిరతిశయాయ కనిష్ఠికాభ్యాం నమః, న కిం మస్తి నిరుపద్రవాయ కరతలకర పృష్ఠాభ్యాం నమః, మూలం నిరంతరాయ శిరసేస్వాహా, అభావం నిర్దోషాయ ముఖేస్వాహా, యిదం నిరాభాసాయ హృదయే స్వాహా, జ్ఞాతుం నిజస్తేజాయ నాభౌన శరీరం నిష్ప్రపంచాయ పాదద్వయై స్వాహా, న కిమస్తి నిరూపాసనాయ హృదయాయై నమః. మూలం నిస్సంగాయ శిరసేస్వాహా, అభావం నిష్కారణాయ శిఖాయై వౌషట్. ఇదం నిష్కంపాయ కవచాయ హుం, జ్ఞాతుం నిష్కల్మషాయ నేత్రత్రియాయ వౌషట్, నశరీరం నిర్ద్వందాయ హస్త్రాయఫట్, న కిమస్తి నిర్మోహాయ త్రికాలేషు మదరిహితనిశ్చయే భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

## ధ్యానం.

శ్లో॥ సర్వనిగమగుహ్యం శాశ్వతం సర్వకాలం
సర్వదివిజవంద్యం సర్వదిక్పూర్ణ మచలం
సకలభయనివారం సర్వలోకాంతరస్థం
సకలమునిహృదిస్థం సర్వలోకప్రశస్తం.

శ్లో॥ నజ్ఞాతుం పరవస్తురూపరహితం నిస్తేజ మమృతం సదా
నిష్కామం నిరుపాసనం నిరుపమం నిర్ద్వేశ్వరహితం శివం
నిత్యాభాసవివర్జితం విహితసద్వ్యాపారశూన్యం సదా
నిస్సంగం నిరుపాధికం నిరవయవం నిత్యం శివం మంగళం.

శ్లో॥ నిర్ఘాతనిర్బోధనిరింద్రియత్వం నిర్వాహనిర్ద్వంద్వ నిరూపసత్వం
ఆనందరహితం హ్యచలం స్మరామి.

శ్లో॥ నిరాలంబాయ నిత్యాయ నిర్మలాయ నిరంజనే
నిత్యశుద్ధాయ బుద్ధాయ సదసద్రహితాయ నమః.

మంత్రము.

మూలాభావ మిదం జ్ఞాతుం నశరీరం న కి మస్తి. ౧౬

అర్థం— మూలములేని గుర్తెరిగే శరీరం యేమీ లేదు.

మూలాభావ మిదం జ్ఞాతుం నశరీరం న కి మస్తిః.

అర్థము— మూలాభావము మూలములేనిదిన్ని, ఇదం ఈ, పరిదృశ్యమాన మనగా కనుపడేదైన, శరీరం శరీరమును, జ్ఞాతుం తెలిసేటందుకొరకు, న తగినది కాదు, కిం యేమి, నాస్తి - లేదు.

రెండవ అర్థము—మూలాభావం మూలా - కారణముయొక్క, అభావము - లేనిది అనగా కారణములేనందున కార్యమున్ను లేదని తాత్పర్యము. మాయాచ విద్యాచ స్వయమేవ భవతి యనే శ్రుతి వలన తనంతట తాను పుట్టినదనిన్ని, యిదం - యీకనుపడే శరీర మనగ . సర్వత్ర - యితి శరీర మనే యుత్పత్తిచేత శరీరం తనంతట తానే నశించే శరీరమును, జ్ఞాతుం తెలిసేటందుకొరకు, న తగదు, కిం యేమి, నాస్తి లేదు. స్వప్నే స్వప్నమందు, ప్రతీయమానాని కనుపడేటటువంటి, రూపాణి యథా - శరీరము లేలాగో, తథా - అప్రకారముగాను యీశరీరములున్ను రజ్జుసర్పవతు, స్థాణుపురుషవతు, శుక్తి రజితవతు భ్రాంతికల్పితములేగాని నిజము గావు. మిథ్యాస్వరూపము గనుక దీని తెలియడముకు యేమీ ప్రయోజనము లేదు.

పంచదశాక్షరీ మంత్రము స్వప్న భాతివిధి.

అస్య శ్రీపంచదశాక్షరీ మహామంత్రస్య అఖండఋషిః జీవి ముక్తో దేవతా, బీజరహితం భ్రాంతిరహిత మేవా శక్తిః, సర్వవిచారణ రహిత మేన జపే వినియోగః.

ఓంఓం అద్వైతరహితపరమహంసాయ అంగుష్టాభ్యాం నమః, ఓంఓం మౌనవాఖ్యాయ పరబ్రహ్మానందాయ తర్జనీభ్యాం నమః, ఓంఓం అస్ఖలిత అమనస్క మహాధీరాయ మధ్యమాభ్యాం నమః, ఓంఓం మనోవేగ శరీరవేగ అనన్యమహావైరాగ్యాయ అనామికాభ్యాం

నమః, ఓంఓం సంపూర్ణసాయుజ్యస్వప్రకాశ మహాపూర్ణాయ కనిష్ఠికాభ్యాం నమః, ఓంఓం ద్వంద్వాతీతకాలత్రయ ఉపాసనరహితాయ కరతలకరపృష్ఠాభ్యాం నమః ఓంఓం మానవ్యాఖ్యాయ పరబ్రహ్మనందాయ శిరసే స్వాహా, ఓంఓం అస్ఖలితఅమనస్కమహాగంభీరాయ శిఖాయ వౌషట్, ఓంఓం మనోవేగ శరీరవేగ అనన్యమహావైరాగ్యాయ కవచాయహుం, ఓంఓం సంపూర్ణసాయుజ్య స్వప్రకాశమహాపరిపూర్ణాయ నేత్రత్రయాయ వౌషట్, ఓంఓం ద్వంద్వాతీతకాలత్రయఉపాసన రహితాయ హస్త్రాయ ఫట్, భూర్భువస్సువరో మితి దిగ్బంధః.

## ధ్యానం.

శ్లో॥ అమనస్కం పూర్ణాలోకం చిన్మయం విశ్వరూపకం। శ్రుతి స్మృతిమహాతత్వం పూర్ణానందం పునఃపునః.—ఓంనమ శ్శివాయ పరమహంసవిజ్ఞాపనాయ నిర్వికల్పమహాసమాధి సంపూర్ణ సోహ మస్మి హరిః. ఓంఓం ఉత్పత్తిస్థితిసోహం అహం బ్రహ్మ అహం విష్ణుః అహం శివః అహ మీశ్వరః అహం సదాశివః అహం తత్వం అహం పరిపూర్ణసమాధినాం సత్యం సత్యం సదా. హంసో ఆనందో బ్రహ్మణాం పదం ఓంశ్శాంతి దేవ శ్శాంతి శాంతిదేవ శాంతిరస్తు తయా హగ శాంత్యా సర్వశాంతిః ఓంఓం కుండలీస్థానేన నాదబిందుకళామధ్యేచ హంసతత్వ సంపూర్ణత్వ నిరూపణయా పాదుకాం పూజయామి.

## మంత్రము.

స్వప్నే ప్రతీయమానాని రూపాని యథా తథా—౧౫
అర్థము కలదోచిన శరీరాలు యేలాగో అలాగే—౧౫

## పదవిభాగము.

స్వప్నే-స్వప్నమందు, ప్రతీయమానాని - తోచబడ్డ, రూపాని - శరీరములు, యథా - యేప్రకారము లేవో - తథా - ఆప్రకారముగాను యేమీ లేదు. స్వప్నమందు కనుపడిన శరీరమువలె జాగ్రత్తయందు కనుపడే శరీరమున్ను అబద్ధ మని తాత్పర్యము.

శ్లో॥ భ్రమే ణాహం భ్రమేణ త్వం భ్రమణేనాపాసకం జనః
భ్రమణేశ్వరజీవత్వం భ్రమమూల మిదం జగత్.

టీ - భ్రమకు మూలము జగత్తు, జగత్తుకు మూలము భ్రమ యీరెంటికి మూలము యెరుక. కలకు మూలము యెరుకే. యిటువంటి అవాంతర పిశాచమైన యీగురుతెరిగే శరీరానికి మూలము యేమీా లేదు.

వాక్యత్రియములకు అర్థసహితము సమాప్తము.

సర్వము నిండుపరిపూర్ణపరబ్రహ్మంబే యుండే యీ పరబ్రహ్మంబులో యెన్నడు యెరుక పుట్ట లేదు. ఈనిండు పరిపూర్ణ పరబ్రహ్మం యన్నిటియందు యేకాలములయందు యున్నది. యొక తావున యున్నది, వేరొక తావున లే దని సంశయించుట విశేషము గాదు. మూడుకాలములయందు అనగా యెండాకాలము వానాకాలము చలికాలము యని యొకఅర్థము. మూడుకాలములయందు యనగా ఉదయకాలము మధ్యాహ్నకకాలము సాయంకాలము యని వక అర్థము. మూడుకాలములయందు యన యిడాకాలము పింగళాకాలము సుషుమ్నకాలము 'యనియు యింకా యెన్నియో అర్థములు అనుభవముచే పెద్దలు చూపగలరు. ఈమూడుకాలయలయందు యీమూడు కాలములకు యెన్నియో అర్థము లున్నవనియు చెప్పబడువాటియందు ఆరుఋతువులయందు, పన్నెండుమాసములయందు, యిరువదినాలుగు పక్షములయందు, నలభై యెనిమిది వారములయందు, మూడువందల అరవై దినములయందు, ప్రతిరోజుకు యుండు యెనిమిదిఝాముల యందు, ఝాముకుయుండు ఘడియలు యేడున్నర యేడున్నరఘడియల యందు, ఘడియకు విఘడియలు అరవై అరవై విఘడియలయందు, విఘడియకు లిప్తలు అరవై అరవై లిప్తలయందు, లిప్తకు ఛాయలు అరవై అరవై ఛాయలయందు అష్టదిక్కులయందు దేవతలయందు రాక్షసులయందు నరులయందు గంధర్వులయందు గరుడులయందు కిన్నరుల యందు కింపురుషులయందు యక్షులయందు సిద్ధులయందు సాధ్యుల

యందు విహంగులయందు నాగులయందు విద్యులయందు ధరాదుల యందు సూర్యచంద్రతారధృవ నవగ్రహభూతప్రేతపిశాచబ్రహ్మ రాక్షసభేతాళభైరవవిష్ణుఈశ్వరబ్రహ్మలక్ష్మీసరస్వతీపార్వతీగణపతిమన్మథాదులయందు భూమిలో నీరులో నిప్పులో గాలిలో ఆకాశములో సముద్రములలో నదులలో పర్వతములలో చెట్లలో తీగెలో పువ్వులో కాయలలో పండులో బెండులో గుండులో బండలో ముండలో రండలో దండలో బెండులో దండులో పండులో గుండెలో కండలో పళ్లలో చెండ్లలో చెర్లలో భావిలో పాములో చీమలో దోమలో కప్పలో దొప్పలో చిప్పలో చొప్పలో గడ్డిలో బుడ్డిలో దొడ్డిలో గుడ్డిలో గూడులో పాడులో బీడులో వాడలో మేడలో తోటలో బాటలో పాటలో మాటలో నీటులో తేటలో తోటలో కోటలో మూటలో గూటిలో నోటిలో బోటిలో వేటులో చేటులో మీటులో ఫ్రాళ్లలో పాళ్లలో గోళ్లలో కోళ్లలో గొడ్లలో గుళ్లలో చళ్లలో కళ్లలో పళ్లలో డొక్కలో పక్కలో చిక్కలో టక్కలో టెక్కలో నిక్కలో చెక్కలో ముక్కలో మొద్దులో యెద్దులో పద్దులో గద్దలో గిద్దలో గుద్దలో వద్దలో రద్దిలో చిద్దులో ముద్దులో గుద్దులో పెద్దలో పిన్నలో జొన్నలో కన్నెలో గిన్నెలో చిన్నెలో సన్నలో సున్నలో వెన్నలో దొంగలో గంగలో రంగలో లింగలో పంగలో వంగలో చేపలో పాపలో జ్యోతిలో నీతిలో ఖ్యాతిలో మూతిలో ఘాతలో కోతిలో నేతిలో ప్రీతిలో భీతిలో రాతిలో లోతులో గోతిలో గొంతులో వంతులో చేతిలో మృగములలో పక్షులలో నిక్షేపములో నిమ్మలో కొమ్మలో కమ్మలో దొమ్మలో తమ్ములో కమ్ములో రొమ్ములో తుమ్మిలో యుమ్మిలో దొమ్మిలో తమ్మిలో చిమ్ములో గుమ్మిలో కమ్మిలో సొమ్ములో తుమ్ములో దగ్గులో నిగ్గులో బొగ్గులో యుగ్గులో సిగ్గులో యెగ్గులో మొగ్గలో గగ్గిలో వానలో బానలో తేనెలో గూనలో చానలో చంపలో కంపలో కొంపలో సందులో గొందులో యింది అందు నెం దనరాక నీనానందున నిండి నిబిడీకృతంబై సూది

మైన మోపు చోటు లేశమైన లేక అంతట వ్యాపించి క్రింద మీంద ప్రక్కలయందంతయు తానై యుండి తానై యున్నదన్న గుర్తు తనకు యేమి లేనిదై అచలపరిపూర్ణపరబ్రహ్మంబు యుండే యీపుత్త బట్టబయలు యనే అచలపరిపూర్ణ పరబ్రహ్మము యుక్తికి చిక్కదు. శక్తికి రాదు. భక్తికి లేదు. కరములచే పట్టుద మనిన పట్టు బడదు. కత్తులచే నరకించిన తెగదు. రాళ్లతో కొట్టెద మనిన కొట్టుబడదు. కాల్చెద మనిన కాలదు. గాలికి కొట్టుకపోదు. వానకు తడవదు. యెండకు యెండదు. తుపాకిగుళ్ళకు తూట్లు పడదు. పడిగళ్ళకు నొవ్వదు. చలికి వణకదు. భయముకు యులికిపాటు బడదు. అస్త్రములచే హతము గాదు. యుక్తి గాదు. శుక్తి గాదు. రక్తి గాదు. ముక్తి గాదు. వ్యక్తి గాదు. శక్తి గాదు. స్త్రీ గాదు. పురుషుడు గాదు. పిల్లకాదు. పడుచు గాదు. ముసలి గాదు. తల్లి గాదు. తండ్రిగాదు. అన్నగాదు. అత్తగాదు. ముండగాదు. ముత్తైదువ గాదు. యూరు గాదు. పల్లెగాదు. పట్టణము గాదు. దేశము గాదు. దూషణ గాదు. భూషణగాదు. పాపము గాదు. పుణ్యము గాదు. మానము గాదు. అవమానము గాదు. ధనము గాదు. ధాన్యము. ఖేదము గాదు. మోదము గాదు. కష్టము గాదు. నష్టముగాదు. సుఖము గాదు. దుఃఖము గాదు. జననము గాదు. మరణము గాదు. యోగి గాదు. భోగి గాదు. రాగి గాదు. త్యాగి గాదు. మూగి గాదు. మాట కాదు. పాట గాదు. పల్లు గాదు. మిట్ట గాదు. యివియన్నియు యేదీగాక యెప్పుడు యెడతెగక నిండు పరిపూర్ణపరబ్రహ్మమే యున్నది. ఆపరిపూర్ణపరబ్రహ్మము యింకా యెటుల యున్నదనిన పగలు ప్రకాశించు యెండవెలుగువలె యున్నది. వెలుగువలె యెటుల పరిపూర్ణపరబ్రహ్మ మున్నదనిన ఒకమనుష్యుడు కొండ యెక్కి యీ కొండపై మిగులైన గుండు నెక్కి కూర్చుని చూచుచూయుండ యీ వెలుతురు యెక్కడ పుట్టి యిక్కడికి వచ్చి యెంతవరకు పోవునో, లేక యిక్కడనే యుండి యెక్కడకు పోలేదనే స్పృహగలిగెనో విచా

రించి చూడగా యీవెలుతురు యెక్కడ పుట్టి యెక్కడి నుంచి వచ్చి యెక్కడకు పోవునో అంతులేక యుండెనని తా నుండియు యిది వచ్చిన తావు, యిది యున్న తావు, పోయిన తావు తెలియలేని వాడైన సంగతి యెల్లరకు విశద మగుచునేయున్నది. ఇందున గురించి తాను యుండియున్నట్టు తోచటమేగాని యున్నందుకు తోచినందుకు తెలుసు కోలేని హేతువుచే తాను యెప్పుడూ లేనివాడే యని నిశ్చయించ బడుచున్నది. తాను క్రిందనుంచి పైకి యొక యోజనము యెత్తుగల కొండ నెక్కి చూడ తాను క్రిందయుండినప్పుడు యిండ్లు చెట్లు గోడలు గొడ్లు భూమిమీద యుండు సమస్తము తనకన్న పెద్దగా గనుపించు వోస్తువలు యావత్తు యాకొండపై తానుండి క్రిందికి చూడ క్రింద తనకు కనుపించువోస్తువులన్ని తనకన్న మహాచిన్నగా తోచుచుండును. అప్పుడు తాను యున్నచోట తనయిరుప్రక్కల క్రిందపైన వెలుతురే యుండెను. యీయోజనముకన్నా యింకా నాలుగుయోజనమ్ములదూరముగల యెత్తుకు తాను వెళ్లిచూడ అక్కడ వెలుతురు యుండెగాని క్రిందయుండు వోస్తువులు యేమీ కానరాకుండె. యిట్టి సమయమున వెలుతురేయుండె. తాను యుండి లేనివాడై పోయె తాను యున్నను, లేనివాడైనను, యుండిపోయినవాడైనను, పోయివచ్చినవాడైనను యీ వెలుతురు వీనిసంగతి యెటుల తెలియక యున్నదో యటువలె అచల పరిపూర్ణపరబ్రహ్మము యున్నది. యిది దప్ప మరివకటి యేమీలేదు. యింకా యీపరిపూర్ణపరబ్రహ్మము యెటుల యున్న దనిన భావనామసంవత్సర ఆశ్వీజ బ 30 లు అనగా దీపావళీపండుగదినమురోజు అట్టి అమావాస్యరోజున మిక్కిలియగు మేఘాడంబరముచే మబ్బుపట్టి యుండగా గాంఢాంధకారంబై యేమియు కనుపించకయుండు సమయమున యొకడు తనయింటిలో తాను యుండక త్రోవకు వచ్చి విస్తారంబైన యెగురురాళ్ళు మిట్టలు గుంటలు పెల్లలు పాములు తేళ్లు గొడ్లు గోడలు యివియన్నియు తనకు కొట్టుకుంటూ యుండ చింతించుచు యీగాఢాంధకారంబైన చీకటి యెచ్చటనుండి యిచ్చటి కొచ్చె

యెచ్చటికి పోయె నని విచారించుచూ యీచీకటి యెక్కడ నుంచి వచ్చి యిక్కడికి వచ్చి అక్కడకు పోయిన దనే సంగతి యేమీ జాడ యెరుంగక యీజాడ తెలియకపోగా తనశరీరము తనకు యేమీ కనుపించక తాను తిరుగుతూ మాటలాడుచు యుండియు తనకు యేమీ తన విచారణ తప్ప యితరసంబంధమైన యేచూపులు కాన రాక యుండెను యీచీకటి యింతవరకే యని యంతులేక బ్రహ్మాండ కటాహం బెల్ల నిండి అన్నింటిలో యంటియుండక అంటినా ననే గుర్తెరుగక అంటె యుండలే దనే స్పృహ యెరుగక యీచీకటి యెటుల యున్నదో యటువలె యీఅచలపరిపూర్ణపరబ్రహ్మము యటువలెనే యున్నది. యీఅచలపరిపూర్ణపరబ్రహ్మము పెరుగదు, విరుగదు, అరగదు, కరగదు, తరగదు, మొరగదు, చదరదు, బెదరదు, ఆడదు, పాడదు, యోడదు, కూడదు, వేడదు. ఈఅచలపరిపూర్ణపరబ్రహ్మము వెలుతురుగాదు, చీకటిగాదు, యీరెండుగాకనే యున్నది. ఈఅచలపరిపూర్ణపరబ్రహ్మముకు స్థూలము లేదు. సూక్ష్మదేహము లేదు, కారణ దేహము లేదు, మహాకారణము లేదు. ఈఅచలపరిపూర్ణపరబ్రహ్మముకు జాగ్రిత లేదు, స్వప్నము లేదు, సుషుప్తి లేదు, తుర్యము లేదు, తుర్యాతీతము లేదు. యీషణత్రియ, వాసనత్రియ, మలత్రియ, నాడీత్రియములోగయిరా లేవు. పంచభూతములు పంచకోశములు, పంచవాయువులు, మనోబుద్ధిచిత్తాహంకారములు, కామక్రోధలోభ మోహామదమత్సరయీర్ష్యయసూయడంబదర్పశోకమోహాభయలజ్జలు నామరూపములు కులగోత్రములు స్వజాతీయ విజాతీయస్వగతభేదములు మానావమాననిందాపనిందాజయాపజయలాభాపలాభములుయీఅచల పరిపూర్ణపరబ్రహ్మముకు లేవు. యెల్లకాలము యెడతెగక యే మెరుంగక యేమీగాక యేమీలేక యున్న యీఅచలపరిపూర్ణపరబ్రహ్మమందు యీయెరుక యేమీ పుట్టలేదు. మొదలే లేదనిన యొకదాసునికైనా బెట్టుమన్నట్టు యీఅచలపరిపూర్ణపరబ్రహ్మమందు యీయెరుకపుట్టిన దనుట అధ్యారోపాపవాదమేగాని నిశ్చయముగా విచారిం

చిన యీయెరుక యీవృత్తబట్టబయలందు యేకాలమందైన యెప్పు డూ యీయెరుక పుట్టనే లేదు. ఇదే నిశ్చయం. యీనిశ్చయము కాని యెడల యీయెరుక పుట్టిన దనే సందేహము గల్గును. అటుల సందే హము కలిగిన యెల్లపుడూ సంశయమే బాధించును. ఇటుల బాధ నొందుచు యుండ జన్మరాహిత్యము గాదు. జన్మరాహిత్య మనగా యేసంశయమును లేక యుండుటే జన్మరాహిత్య మౌను. ఈవృత్తబట్ట బయలునందు యెరుకపుట్టనే లేదు. యీగురు తెరిగే శరీరము యేమీ లేదు. ఇదే పదికోట్లమారులకు నిశ్చయం, నిశ్చయం.—తథాస్తు.

వ్రాసిన మాటలనే పదేపదే వ్రాసితినంచని యలుగవలదు. మంచిమాట యెన్నోసారులు తలచుట విశేష మని యీదాసుడు తలచు కొనెను.

శ్రీ వేంకటేశ్వర సమర్థ.



# గురుశిష్యలక్షణము.

## గురునిలక్షణము.

### గురుధ్యానశ్లోకములు.

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురువే నమః.

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః.

శ్లో॥ మమాత్మా సర్వభూతాత్మా మద్గురుః శ్రీజగద్గురుః
మన్నాథ శ్శ్రీజగన్నాథః తస్మై శ్రీగురవే నమః.

శ్లో॥ చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతనిరంజనం
నాదుబిందుకళాతీతం తస్మై శ్రీగురవే నమః.

శ్లో॥ చైతన్యం పరిపూర్ణ మేక మచలం జోతిర్మయం వ్యాపకం
తత్పంచాక్షరిమంత్రిమధ్య మమలం సూక్ష్మాదిసూక్ష్మం పరం
లింగం బ్రహ్మ సనాతనం సుమనసాం జ్ఞాత్రైవ రూపం సదా
బాహ్యాభ్యంతరసంస్థితం పరశివం ప్రాణేశ్వరం భావయే.

శ్లో॥ అనేకజన్మసంప్రాప్త కర్మేంద్రియవిధాయకం
జ్ఞానానలప్రభావేన తస్మై శ్రీగురవే నమః.

శ్లో॥ యస్య స్మరణమాత్రేణ జ్ఞానముత్పత్స్యతే స్వయం
సఏవ సర్వసంప్రాప్తి తస్మై శ్రీగురవే నమః.
శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.
శ్లో॥ నిరాకారం నిరాధారం నిస్సంగం నిష్ప్రపంచకం
నిరామయం నిరాలంబం తస్మై శ్రీగురువే నమః.
శ్లో॥ గుకారంచ గుణాతీతం రుకారం రూపవర్జితం
గుణరూపవినాశాయ తస్మైశ్రీ గురువే నమః.
శ్లో॥ న గురోరధికం న గురోరధికం నగురోరధికం న గురోరధికం
నగురో రధికధ్యానం నాస్తి తత్వం గురోత్పరం.
శ్లో॥ దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవో సనాతనః
త్యజే దజ్ఞాననిర్మాల్యం సోహం భావేన పూజయేత్.

## గురువులలక్షణము.

గురువులు యెనిమిది విధములుగ నున్నారు.

౧. శిష్యుడు శాస్త్రములను చదువగా ఆశాస్త్రములలోని విషయములను వ్యాకరణయుక్తముగా శబ్దముల అర్థమును వినిపించి చెప్పు నతడు బోధకగురు వనబడును.

౨. ప్రకృతియందలి సత్యమును దృష్టాంతరూపముగా శిష్యునకు పదార్థతత్వముల నెరిగించునాతడు వేదకగురు వనబడును.

3. వశ్యము మోహనము స్తంభనము మారణము ఉచ్చాటనము ఆకర్షణము విద్వేషణము మొదలగువానిచే శిష్యునకు యిహలోకమునందు మోదఖేదముల నొసంగునట్టి గురువు సిద్ధగురు వనబడును.

౪. గుళ్లుగోపురములను కట్టుమనియును ఏకాదశీశివరాత్రి మొదలగు దినములలో నుపవాసముచేయుమనియును యీలాగుశిష్యునకు

తెలిసి అందువలన ఐహికాముష్మికసుఖముల నొసంగునట్టి గురువు కామ్యకగురు వనబడును.

౫. జ్ఞానమువలన శమము దమము శాంతి దాంతి మొదలగు సద్గుణములను కలుగజేయు నతడు సూచకగురు వనబడును.

౬. శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములయందు విరక్తిని గలుగజేసి ఆత్మయందు అనురాగమును దృఢీకరణ మొనర్చినవాడు వాచకగురు వనబడును.

౭. ఈశ్వరుడు యిట్టివాడనియును జీవుడు యిట్టివాడనియును తెలియజెప్పి జీవేశ్వరులకు ఐక్యమును గలుగజేసినయతడు కారణగురు వనబడును.

౮. శిష్యునకు గలిగినట్టి సకలసందేహములను బోగొట్టి నిరతిశయానందకైవల్యమును బొందునట్లు జేసినయతడు విహితగురు వనబడును.

శిష్యుడైనట్టివాడు విహితగురువు నాశ్రియించి వారికి చతుర్విధశుశ్రూషలు చేసి వారివలన ఆత్మయొక్క నిజస్థితి స్వరూపమును నెరుంగవలయును. యెందువల్ల ననగా శ్లో॥ విత్తాత్పుత్రః ప్రియం పుత్రాత్ స్వశరీరం తథా ప్రియం। ఇంద్రియాణి ప్రియః ప్రాణాః ప్రాణా దాత్మ పరం ప్రియః. అనగా ధనముకంటె కొడుకు ప్రియుడు, కొడుకుకంటె దేహము ప్రియము, దేహముకంటె యింద్రియములు ప్రియములు, యింద్రియములకంటె ఆత్మ ప్రియుడు కాబట్టి ఆత్మతత్వము నెరుంగ ప్రియత్నించవలయు.

## చతుర్విధశుశ్రూషలు.

౧. ప్రణవమందలి అకార వుకార మకారములకు లక్ష్యార్థమగు ద్రష్టృస్థానమును యెరుకమరుపులు లేని యునికితో విచారణ చేయుట స్థానశుశ్రూష యనబడును.

౨. సూర్య చంద్ర బ్రహ్మ విష్ణు రుద్రాదులే నేత్రాదియవయవము లని విమర్శించి యెరుగుట అంగశుశ్రూష యనబడును.

3. పరబ్రహ్మము మూడుకాలములచే భేదింపబడని దనియును, ఆపరబ్రహ్మమే తాననియును భావించుట భావశుశ్రూష యనబడును.

౪. ఆత్మకు సాటి వేరెద్దియూ లేదనియును కూటస్థానభిన్న పర బ్రహ్మమైన తనయందు ఆత్మ ప్రతిఫలించి తానుగా నున్నా ననియును తలంచుట ఆత్మశుశ్రూష యనబడును.

ఇట్లు శిష్యుడు తనయందు శుశ్రూషలు సల్పుచు, గురువుకు చేయవలసిన శుశ్రూషలు యేవి యనగా—

౧. గురువుకోరిన వస్తువులు శక్తికొలది సమర్పించుట ఆత్మ శుశ్రూష యనబడును.

౨. గురువునకు అభ్యంగనముచేయుట కాళ్ళుపట్టుట భూష ణాదు లలంకరించుట అంగశుశ్రూష యనబడును.

3. గురువు ఇల్లు తోట మఠము వీనియందు ఉనికిచేయించి పోషించుట స్థానశుశ్రూష యనబడును.

౪. గురువే సాక్షాత్పరబ్రహ్మస్వరూపు డని భావించుచుండుట భావశుశ్రూష యనబడును.

ఈలాగున గురువునకు చతుర్విధశుశ్రూషలు చేయుచు గురు వును సామాన్యునిగా నెంచక—

శ్లో॥ గురుఃబ్రహ్మ గురుర్విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షా త్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః.

అనునట్లు గురువునే బ్రహ్మవిష్ణుమహేశ్వరులనుగా భావించ వలయును. మరియు

శ్లో॥ గురుపాదోదకం పీత్వా గురో రుచ్ఛిష్టభోజనం
గురుమూర్తిం సదాధ్యానం గురుమంత్రం సదా జపేత్.

అనువిధమున గురుపాదోదకమును పానముజేయుచు గురూచ్ఛి ష్టమును భుజించుచు గురువును సదా ధ్యానించుచు గురుమంత్రమును సదా జపించుచు నుండవలయును.

# శిష్యునిలక్షణము.

ఇట్లుండిన శిష్యుం డెట్టివాడుగా నుండవలయు ననగా శ్రవణ కీర్తన స్మరణ పాదసేవన అర్చన వందన దాస్య సఖ్య ఆత్మనివేదనము అనబడు తొమ్మిదివిధములైన భక్తితో కూడినట్టివాడుగను సత్యము విజ్ఞానము ఆనందము నిత్యము నిర్మలము అను పంచలక్షణములతో గూడిన పరబ్రహ్మానుసంధానము చేయుటకు అభిలాషకలవాడుగా నుండవలయు. మరియును

శ్లో॥ బ్రహ్మహా మద్యప స్తేన స్తథైవ గురుతల్పగః
ఏతే మహాపాతకినో యశ్చ తై స్సహ సంవసేత్.

అనగా బ్రహ్మహత్యచేయుట లేక హత్యచేయుట, కల్లు సారా యీలను దాగుట, గురుభార్యను కౌగలించుట, దొంగిలించుట అను నీలాటికృత్యములు మహాపాతకములు గనుక వీనిని చేయకయు,

శ్లో॥ విహితస్యా ననుష్ఠానా న్నిషేధస్యచ సేవనా
దనిగ్రహా చ్చేంద్రియాణాం నరః పతన ముచ్యతే.

అనగా శాస్త్రములయందు చెప్పిన కర్మను చేయకపోవుటవలన గలుగు అహ మను దోషమునకును, శాస్త్రములయందు చెప్పబడని కర్మాచరణమువలన గలుగు ఆగమ మనెడు దోషమునకును, యింద్రియములను నిగ్రహించక అవి పోయినట్లు విడచిపెట్టి స్వేచ్ఛగా ననుభవించుటవలన గలుగు ఏన మను దోషమునకును పాత్రుడుగాక యుండవలయును.

శ్రీ గురుభ్యోనమః.

# సాధనచతుష్టయసంపత్తి.

౧. నిత్యానిత్యవస్తువివేక మనియు, ౨. యిహాముత్రార్థఫల భోగవిరాగ మనియు, ౩. శమాదిషట్కసంప త్తనియు, ౪. మోక్షేచ్ఛ యనియు నాలుగువిధములు.

౧. అందు నిత్యానిత్యవస్తువివేక మనగా - నామరూపక్రియలు లేక సత్తు చిత్తు ఆనందము అఖండము నిర్మలము అనునవే స్వరూప లక్షణములు గలిగి వెలుగు పరబ్రహ్మమే సత్యము. నామరూపక్రియలు గలదై అనృతము జడము దుఃఖము ఖండము మలినము అనునవే స్వరూపలక్షణముగా గలిగి వెలుగు ప్రకృతిచేత కల్పింపబడిన తనశరీరమును తనశరీరసంబంధులైన భార్యలు కొడుకులు కూతుండ్రు అన్నదమ్ములు తల్లిదండ్రులు ధనములు ధాన్యములు గృహములు తోటలు మొదలైనవియును బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులు మొదలగు పరమాణువంతటి పురుగుతుదిగాగల ప్రాణిసమూహముతో గూడిన లోకములును అసత్యము లని తెలుసుకొనుటే నిత్యానిత్యవస్తువివేకము.

౨. ఇహాముత్రార్థఫలభోగవిరాగ మనగా యీలోకమందలి పుష్పచందనవస్త్రభూషణములును, స్త్రీలు ఇండ్లు తోటలు భూములును, ధనధాన్యవస్తువాహనములును మొదలయినవాని భోగములయందును పరలోకమందలి స్వర్గలోక సత్యలోక వైకుంఠ కైలాసాదులయందుగల సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యము లనెడు పదవులలో నుండు పుష్పచందనాది భోగములయందును వమనాన్నమలమూత్రములయందువలె ఆశలేక యుండుటే ఇహాముత్రార్థఫలభోగవిరాగ మని పేరు.

3. శమాదిషట్కసంపత్తి యనగా శమము దమము ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానము అను ఆరుసుగుణములు గలిగి యుండుటే శమాదిషట్కసంపత్తి యనబడును. అందు శమమనగా అంతరేంద్రియ నిగ్రహము, దమమనగా బాహ్యేంద్రియనిగ్రహము, ఉపరతి యనగా విహితములైన సకలకర్మములను జ్ఞాననిష్ఠావిధిచేత క్రమక్రమముగా విడుచుట (యిదియే సన్యాస మని చెప్పబడును), తితీక్ష యనగా శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములను సహించుట, శ్రద్ధయనగా గురువులయందును వేదాంతశాస్త్రములయందును ఈశ్వరునియందును విశ్వాసము గలిగియుండుట శ్రద్ధ యనబడును. సమాధానమనగా సద్గురూపదిష్ట మహావాక్యములయందునుగల అనుభవార్థమును శాస్త్రములందు చూచుకొని మనస్సును దృఢపరచుకొనుట లేక మనస్సు బుద్ధి చిత్తము అహంకారము లనియెడి అంతరేంద్రియములను వానివృత్తులైన సంకల్పవికల్పనిశ్చయచంచల కర్తృత్వములును వానికి యధిదేవతలైన చంద్ర బృహస్పతి క్షేత్రజ్ఞ రుద్రులయందు ధ్యానారాధనాదులచేత చేర్చి యాయధిదేవతలకు యధిదేవతైన పరమాత్మయందు యాయింద్రియాది దేవతలను ఐక్యము పరచి తదేకనిష్ఠగాయుండుట సమాధాన మనబడును.

శమ మనగా వర్ణధ్వని స్వరమిశ్రరూపము లగు చతుర్విధశబ్దములను గ్రహించునట్టి శ్రోత్రేంద్రియమును చల్లన వేడి మృదువు కఠినము మిశ్రము అని యైదువిధములైన స్పర్శలను గ్రహించు త్వగింద్రియమును, పొట్టి పొడుగు లావు సన్నము యెరుపు నలుపు తెలుపు పసుపు ఆకుపచ్చ మిశ్రమము లని పదివిధములైన రూపములను గ్రహించునట్టి నేత్రేంద్రియమును, ఉప్పు పులుసు కారము వగరు తీపి చేదు మిశ్రమము లని యేడువిధములైన రుచులను గ్రహించునట్టి జిహ్వేంద్రియమును, సుగంధము దుర్గంధము మిశ్రగంధము లని మూడువిధములైన గంధములను గ్రహించెడి నాసికేంద్రియమును, సువచనము దుర్వచనము మిశ్రమవచనము యనే త్రివిధవచనములుగల వాగింద్రియమును, దానము ప్రతిగ్రహము అనునవి గల హస్తేంద్రి

యమును, గమనము ఆగమనము అనునవి గల పాదేంద్రియమును, ఆత్యానందము గల గుహ్యేంద్రియమును, మలవిసర్జనముగల పాయ్వింద్రియమును, దిక్కులు గాలి సూర్యుడు వరుణుడు అశ్వనీదేవతలు అగ్ని దేవేంద్రుడు విష్ణువు మృత్యువు బ్రహ్మ అను అధిదేవతలయందు ధ్యానారాధనప్రత్యోపాసనాదులచేత చేర్చి ఆయుక్త దేవతలకు అధిదేవత యగు పరబ్రహ్మమందు ఆయధిదేవతలను ఐక్యముచేసి తదేక నిష్ఠగా నుండుట శమ మనబడును.

దమ మనగా వేదోక్తకులాచారకర్మములు విడువగూడనివైనను బ్రహ్మనిష్ఠకు విఘ్నములు గలుగుటవలన వానిని క్రమముగా విడచుచు ఆత్మనిష్ఠను ప్రబలించుచు చిత్తవృత్తి నటుపోనీయక బ్రహ్మసమాధియందు మరలించుట దమ మనబడును.

ఉపరతి యనగా ప్రారబ్ధవశమున గలిగెడి శీతోష్ణసుఖదుఃఖ మానావమాన నిందాస్తుతి లాభాలాభ జయాపజయ జరామరణ శోక మోహ క్షుత్పిపాసాదులు మొదలైన సకలద్వంద్వములలో నేది ప్రాప్తించినను తననిష్ఠను వదలక వానివలన గలిగెడి ఖేదమోదములను సహించియుండుట ఉపరతి యగును. తితీక్ష యనగా ప్రభుమిత్రస్త్రీలతో సమానము లగు శ్రుతిస్మృతులను పురాణేతిహాసములను జూద చోర యుద్ధ శృంగారాదికథలను తనకు ప్రయోజనము గలుగజేయని సామాన్యశాస్త్రములను స్వప్రయోజనముల నపేక్షించెడి ఆచార్యులను విడచి ప్రతిప్రయోజనముల నొల్లని సదాచార్యులయందును ఆకలిపోగొట్టుకొనుటకై తనయొద్దకు వచ్చెడి బ్రహ్మవిదుడు మొదలగువారియందును విశ్వాసముగలిగియుండుట తితీక్ష యని పేరు.

శ్రద్ధయనగా వేదాంతశాస్త్రములయందు గల విషయములను ఆలోచించి మనస్సునందు సమాధానపరచుకొనుట శ్రద్ధ యని పేరు.

మోక్షేచ్ఛ యనగా లోకమున యెల్లజనులు మోక్షమును అపేక్షించుచున్నారు. అది మోక్షేచ్ఛ గాదు. ఇల్లు కాలుచుండ ఆగృహమున ప్రవేశించినవాడు పుత్రమిత్రకళత్రాదులు యేమైరో

యన్ని విచారపడి అగ్నిచేత కాలి ఆపుత్రమిత్రాదులను విడచి శీతల జలమ్ములో ప్రవేశించినరీతిని, సంసారమందలి తాపత్రయాగ్నిచేత గాలిన పురుషుడు యీసంసారతాపంబును దొలగించు సద్గురువు లెవరు? దీనికి సాధనము లేవి కావలయును? అని తలంచు చిత్తవృత్తికి మోక్షేచ్ఛ యని పేరు. మరియు మనస్సనెడి వ్యాఘ్రమును ఆశ యనెడి కృష్ణసర్పమును కామాదు లనెడి దొంగలును నిరాకరించుటకై పై నాలుగుసాధనములు కావలయును. అవి గలవాడే యధికారి శ్రవణమునకు మునుపే సాధనచతుష్టయసంపన్నుండై శ్రవణమును అపేక్షింపవలయును. లేనియెడల ఆజన్మమున జ్ఞానము గలుగనేరదు. గురువులైనవారు అనధికారులకు ఉపదేసింపరు. యెట్లనగా శూద్రుడు యాగముచేసినను ఉపనయనాదిసంస్కారములు గల వాడైనను స్వర్గ ఫలప్రాప్తికారణత్వము లెటువలె సిద్ధింపదో యటువలెనే సాధనచతుష్టయ సంపత్తి లేనివానికి శ్రవణాదులచేత జ్ఞానఫలము సిద్ధింపదు. కాబట్టి సాధనచతుష్టయ సంపన్నుండై యుండవలయును.

ఇట్లు,

జూపూడి హనుమద్దాసు.

గ్రంథసమాప్తము.

సర్వము శ్రీసద్గురుచరణారవిందార్పణమస్తు.

